శ్రీమదాంధ్ర వాల్మీకి

# వచన రామాయణము

## కిష్కింధా కాండము



శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ

# శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము

(రిజిస్టర్డ్ ట్రస్ట్ 327/95, తేది 18-8-95)


శ్రీ జీయర్ స్వామివారి కార్యాలయం
7-7-41, రామారావు పేట
కాకినాడ - 533 004
తూ॥గో॥జిల్లా, ఆంధ్రప్రదేశ్
ఫోన్స్ : 0884 - 2371064, 2371070.



వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ
రామానుజ జీయర్ స్వామివారు


తేది : 18-09-2020

## మంగళాశాసనములు

శ్రీమద్రామాయణం శ్రీరామానుజ సంప్రదాయానికి మూలాధారమని, సాక్షాత్తు వేదమని, శ్రీరాముడు వేద పురుషుడని మన పూర్వాచార్యుల వాక్కు.

అట్టి శ్రీమద్రామాయణమును సంప్రదాయానుగుణముగా, సరళ వచనములో రచించారు పండితురాలైన శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ గారు. వీరు శతాధిక వృద్ధులు. వారికి అనేక మంగళాశాసనములు.

శ్రీమతి సీతమ్మగారి శతజయంతి సందర్భంగా ప్రకటిస్తున్న ఈ సరళ వచనరూప రామాయణము అందరికీ ఉపయోగ పడాలని మా ఆకాంక్ష.



ఈ పుస్తకం ముద్రణకి ప్రవచనం.కామ్ వారు సహకరిస్తున్నట్లు తెలిసింది. వారికీ అనేక మంగళాశాసనములు.

(signature)

(శ్రీరంగ రామానుజ జీయర్,
కాకినాడ)

శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారి

## శతజయంతి సందర్భంగా

కుటుంబ సభ్యుల కానుక

# కిష్కింధా కాండము



పరిష్కర్త


శ్రీ వింజమూరి శేషఫణి శర్మ



ముద్రణా సహకారం

pravachanam.com బృందం

# కిష్కింధా కాండము

**శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**



ముద్రణ

**నవంబరు, 2020**

వెల

**అమూల్యం**

ముద్రణా సహకారం

**pravachanam.com బృందం**

సంప్రదించుటకు

**శ్రీ ఎస్.టి.పి.ఎస్.వి.రాఘవాచార్యులు**

9490942884

ప్రింటర్

**ముద్రిక ప్రింటర్స్, విజయవాడ**

# నివేదన

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ నారాయణుల కటాక్షముచే మంచి ఆరోగ్యముతో మా మధ్య కదలాడుచూ ఈ శార్వరి నామ సంవత్సర ఆశ్వయుజ బహుళ ద్వాదశి, హస్తా నక్షత్రము అనగా 12-11-2020 నాడు నూఱవ వసంతము పూర్తిచేసుకొనుచున్నారు మా కుటుంబపెద్ద శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారు. ఈమె పతిదేవులైన పరమ పదవాసులు శ్రీమాన్ వేంకటరాఘవాచార్యులువారు గొప్ప ఉపాసకులు, మంత్రశాస్త్రవేత్త. వీరికి నలుగురు కుమారులు మఱియు ముగ్గురు కుమార్తెలు. ప్రస్తుతము రెండవ కుమారుడైన శ్రీమాన్ శ్రీవెంకటేశ్వర్లుగారి కుటుంబానికి సేవా భాగ్యము కలిగించుచు హైదరాబాదు నందు నివసించుచున్నారు.

ఆమె పుట్టింటి నుండి సంగీత సాహిత్యాలు, సంప్రదాయకత, పఠనాసక్తి, ఆర్షజ్ఞానము, దైవచింతన అరణంగా తెచ్చుకొని మెట్టినింట పతిదేవుల సాహచర్యములో దైవోపాసన, పరోపకారము అలవరచుకున్న ఉభయవంశ పవిత్ర. తల్లిదండ్రులైన శ్రీమాన్ మొలుగు వెంకట నరసింహాచార్యులు, వెంకటనరసమ్మ శిక్షణలో వాల్మీకి రామాయణము ఆమెకు నిత్యపారాయణ గ్రంథమైనది. అదియే ఈ గ్రంథ రచనకు నాందియైనది. అజరామరమైన శ్రీమద్రామాయణానికి ఎన్ని వ్యాఖ్యానములు, అనువాదములు ఉన్నా వేటి తీరు వాటిదే. ఆయా రచయితల అనుభూతులు కూడా వాటి వాటి ప్రత్యేకతలు కలిగి ఆస్వాదయోగ్యంగా ఉంటాయి. 'ఆంధ్రవాల్మీకి' శ్రీ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) గారి 'ఆంధ్రవాల్మీకి రామాయణ' పద్యకావ్యము పఠన ఆమెకు రామాయణముపై మరింత అవగాహన పెంచడమేగాక సామాన్యులకును

అర్థమగునట్లు తనదైన శైలితో తెలుగు వచనములో రామాయణమును ఉత్తర కాండ సహితముగా అనువదించుటకు మూలమైనది. ఆమె రచన స్నిగ్ధమైన తేటనీటిధార, సహజమైన శైలీప్రవాహము.

ఈ సంకల్పమునకు తగిన ప్రేరణ యిచ్చి ప్రోత్సహించినవారు ఆమె సోదరులైన ఆధ్యాత్మికవేత్త శ్రీమాన్ మొలుగు రంగాచార్యులుగారు కాగా రచనలోని సహజధారను పరిష్కరించినవారు పెద్దకుమారుడైన రాధా కృష్ణమాచార్యుని మిత్రులు, పండితులు, కవులునైన శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. ఆమెపై నున్న వాత్సల్యముతో 'ప్రవచన శిరోమణి' శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు వారి అభినందనములను తెలియజేయగా 'న్యాయ-ఉభయవేదాంత ప్రవీణ' శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులు గారు వారి ఆశీస్సులను అందజేశారు.

ఈ రామాయణ కథానాయకుడైన శ్రీరాముని అన్నదమ్ములవలె నుండెడి ఈమె కుమారులు తొలి ప్రయత్నముగా వీరి రచనలలోని 'రామానుజ చరిత్ర', 'బాలకాండము'లను మూడవ కుమారుడైన శ్రీమాన్ నరసింహాచార్యులు - లీల దంపతులును, 'సుందరకాడము'ను శ్రీమాన్ రాధాకృష్ణమాచార్య - భూదేవి దంపతులును, 'దశరథుని కోడళ్ళు'ను మూడవ అల్లుడైన శ్రీమాన్ కరి రాధానాధాచార్యులు - విజయలక్ష్మి దంపతులు ప్రచురింపజేసిరి. ఈమెకు సేవచేసి ఈ రచనలు చేయుటకు చక్కని వాతావరణము కల్పించినవారు నాల్గవ కుమారుడైన శ్రీమాన్ శ్రీమన్నారాయణ, సీత దంపతులు.

అటు పిమ్మట సీతమ్మగారు ఈ వచన రామాయణ మూలప్రతులను శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము (కాకినాడ) వ్యవస్థాపకులు అయిన శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారికి సర్వహక్కులతో సమర్పించినారు. అంతేగాక వీరి కథా

సంపుటీకరణములైన సన్మార్గదర్శనము, ఆత్మజ్ఞానమునకాధారము, అహం వేద్మి మొదలగునవి స్వామివారి ఆధ్యాత్మిక మాసపత్రిక 'శరణ్య'లో ప్రచురితమైనవి.

శతజయంతి సందర్భమునకు తగిన బహుమాన రూపములో ఈ వ్రాతప్రతులను వెలుగులోనికి తీసుకురావలెనను, శాశ్వతముగా నిక్షిప్తపరచ వలెనను కోరికతో ఈ వచన రామాయణమును (ఏడు కాండలు) నేటి సరళి ననుసరించి అంతర్జాలమునందు ఉంచినచో అందరికీ అందుబాటులో నుండునని తలచి, పెద్దల అనుమతితో ప్రవర్తించుచుంటిమి. ఇందుకుగాను పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారు తమ దివ్య మంగళాశాసనములను కృపజేసినందున ఆమె మఱియు ఆమె కుటుంబము తరఫున స్వామివారికి అనేకానేక దాసోహములు. అలాగే అంతర్జాలము నందుంచుటకు, ముద్రణకు సహకరించిన 'ప్రవచనం.కాం' బృందము వారికి మా ధన్యవాదములు. ఈ ఆలోచన చేసి, సాకారము చేయుటలో ముఖ్య భూమిక వహించిన వారి మనుమలైన శ్రీమతి కొమాండూరి శిరీష, కులశేఖర్ దంపతులు ఎంతో అభినందనీయులు. ఈ గ్రంథము www.pravachanam.com నందు ఎల్లవేళలా లభ్యమగును గాన ఈ అవకాశమును అందరూ సద్వినియోగపరచుకొనవలసినదిగా మనవి.

ఈ పుస్తకము పఠించు సహృదయులకు శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రులవారు కరుణా కటాక్షముల ననుగ్రహించి సర్వశ్రేయాలు కలిగించుగాక!

**కుటుంబ సభ్యులు**

**(12-11-2020)**

# ముందుమాటలు

**శ్రీ** సకల భువన సామ్రాజ్యలక్ష్మీ ప్రసాద సిద్ధికొరకై యా దివ్యమహిషిని ప్రార్థన చేసి నే చెప్పబోవు తొలి పలుకులు రసజ్ఞులైన మహనీయ పాఠకులందరు ఆలకింతురు గాక.

నా చిన్నతనమున మా తండ్రిగారైన మొలుగు వెంకట నరసింహాచార్యులు గారు నాకు అక్షర జ్ఞానముతో బాటు కావ్యపఠనమందు ఎంతయో అభిమానము కలిగించిరి. సంస్కృత వాల్మీకి రామాయణముపై మక్కువ వారివలననే కలిగినది. దానిని చదివినను పూర్తిగా అవగాహనము చేసుకొనలేనను భయముతో సంస్కృతమునకు సరియగు ఆంధ్ర పద్య కావ్యమునకై యెంతయో యత్నించితిని. నా తపన ఫలించి అట్టిది లభించినది. కాని యెంత హృద్యముగ నున్నను పద్యమును చదువువారు నేడు కరవైపోవుచున్నారు. పండితులకు సంస్కృత మైనను, ఆంధ్ర పద్యమైనను, వచనమైనను ఒకటే ఉపాదేయమే వచనమైనచో సామాన్యులును చదివి యానందించగలరు. నేను ఆంధ్ర రామాయణ గ్రంథలభ్యతకై పడిన తపన – వాల్మీకి రామాయణమునకు సరియగు తెలుగు వచన రామాయణమునకై మరి యెవ్వరును పడరాదని తలచి – యీ రచనకు పూనుకొంటిని.

నాకు లభించిన ఆంధ్ర వాల్మీకి రామాయణ పద్యకావ్యము మూలానుసారియైయున్నది. ఆంధ్ర వాల్మీకి, వాసుదాసు వంటి సార్థక నామములు గల శ్రీ వావిలికొలను సుబ్బారావుగారిచే రచింపబడినది. కనుక

దానిని చదివి వచన రూపమునకు తెచ్చుటకు ఉత్సాహపడితిని. రామాయణము వంటి కావ్యమును అందరు చదివి ఆనందించునట్లు ప్రసన్న మాధుర్యమైన వచనములో వ్రాయుట నాకు సాధ్యపడునా? అను శంక నన్ను బాధించు చుండగా, మా ఇలవేల్పులు శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ అమ్మవారును, శ్రీ ఆపదోద్ధారక ఘోర వీర లక్ష్మీనృసింహస్వామివారును, శ్రీ పంచాయతన వేణుగోపాలస్వామి వారును రచనకు ఉపక్రమించుమని నన్ను ఆదేశించిరి.

శ్రీమాన్ మాంత్రిక రాణ్మౌళి, శ్రీమత్పండిత మంత్రరత్న బిరుదాంకితులైన నా పతిదేవులు శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకటరాఘవాచార్యుల వారి యాదేశము లభించినది. వారి ఆదేశముల ననుసరించి, ఆదేశకర్తలపైననే భారముంచి రచనకు ఉపక్రమించితిని.

మా పొరుగువారైన శ్రీ అవ్వా జగన్నాథశాస్త్రిగారి సతీమణి సుశీలాదేవిగారు కావ్య పఠనమునందు ప్రీతి కలవారు. పరహృదయములను అవగాహన చేసుకొను సహృదయ స్నేహపాత్ర. వారు నేను వ్రాసిన దానిని చదువుచు సూచనలనిచ్చుచు ప్రోత్సహించిరి. నా మనుమలు శ్రీధర్, శ్రీకాంత్‌లు శ్రద్ధతో భౌతిక సౌకర్యములు కల్పించుచు వచ్చిరి. నా సోదరుడు మొలుగు రంగాచార్యులు రచనలో మెళకువలు తెలుపుచు, వాక్య నిర్మాణమున సూచన లిచ్చి సహాయపడినాడు. నా పెద్దకుమారుడు రాధాకృష్ణమాచార్యులు కోరగా గ్రంథమును పరిష్కరించుటేకాక శుద్ధప్రతిని కూడ వ్రాసియిచ్చిన పండితులు, ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు నగు శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. వీరు కవులు, సాయిభక్తులును. కాళిదాస విరచిత రఘువంశమును ఆంధ్రమున పద్య కావ్యముగా 'రఘువంశ తిలక చరితము' అను పేరున, మయూర కవి విరచిత సూర్యశతకమునకు వ్యాఖ్యను వ్రాసి ప్రచురించినవారు, ఇంకను అనేక రచనలు చేసినవారు. వీరికి నాయందు గల సోదరీ వాత్సల్యము,

శ్రీరామచరితముపై గల అభిమానమును యింతటి శ్రమ తీసుకొనుటకు కారణములైనవి.

వీరందరికి శ్రీ సీతారాములు ఆయురారోగ్యైశ్వర్యముల నొసగి రక్షింతురు గాక!

ఈ గ్రంథమును శ్రీ సకలభువన సామ్రాజ్య లక్ష్మీనారాయణ స్వామివారికి తత్కటాక్ష లబ్ధికోరి నా హృదయ కుసుమముతో జతచేసి సమర్పించుచున్నాను. ఇందలి గుణములను గ్రహించి దోషములు విసర్జించ గోరుచున్నాను. కథానాయకుడు శ్రీరామచంద్రుడు సాగరమును దాటించి హనుమను అనుగ్రహించినట్లు యీ సంసార సాగరము నుండి నన్ను తరింపజేసి పరమపదము ననుగ్రహింప గోరు భాగవత పదదాసి.

(సం) **శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**

**(అయ్యవారిరుద్రవరము)**



శ్రీరామ శ్శరణం మమ

# అభినందనము

శ్రీమాన్ శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకట రాఘవాచార్యులుగారు మంత్రానుష్ఠానము చేసి సిద్ధి నొందిన మహనీయ చరిత్రులు. వారి ధర్మపత్ని వెంకట సీతమాంబగారు, వారి ధర్మపత్నియై జన్మసిద్ధమైన భగవద్భక్తికి మెరుగుపెట్టుకొనిన ధన్యురాలు. ఆమె లౌకిక విద్యలలో ప్రావీణ్యమును సంపాదింప యత్నించలేదు. కాని ఉత్తమ గృహిణిగా శ్రీ రాఘవాచార్యులుగారి సాహచర్యమున, భగవదుపాసనమున పరినిష్ఠితురాలై భగవదనుగ్రహ పాత్రతనందినారు. భగవత్కటాక్ష విశేషముచే దివ్యమైన జ్ఞానవైశద్యము, సౌమ్యమైన వాక్కు, ప్రకృతిసిద్ధమైన మాధుర్యము వారి కలవడినవి. ఈమె పతివ్రతయగుటచే పతివ్రతయై కారుణ్యరూపిణియై ఛాయవలె శ్రీరామచంద్రుని అనువర్తించి, తన నడవడిచే లోకాన్నే కాక ప్రియుని కూడ పరవశింపజేసిన ధన్యచరిత. భూజాత సీత చరిత మీమె మనసు నాకర్షించినది.

“సీతాయాశ్చరితం మహత్” అని పేరుపొందిన శ్రీరామాయణము ఆంధ్ర వాల్మీకి నుండి వెల్వడినది. అది ఈమె భాగ్యవశముచే నిత్యపారాయణ గ్రంథమైనది. పెద్ద పాండిత్యము కాని, భాషాజ్ఞానము కాని లేదని చెప్పుకొనుచున్న ఈమెకు ఆ రామాయణము నంతను తన వాక్యములతో తెనుగున వ్రాయవలెనని కోరిక కలిగినది. ఇది పూర్వజన్మ సుకృత ఫలము. శ్రీరాముని చరితము చదువుట, అనుభవించుట మాత్రమే కాక తామాస్వాదించిన దానిని తమదిగా చేసుకొని తన వాక్కులతో ఆవిష్కరించవలెనని కోరిక కలిగినది. దానికి తగిన భాష, ఆవిష్కరణ శక్తి వారి ఉపాస్యదైవము వారికి అనుగ్రహించినారు.

ఆంధ్ర వాల్మీకి విరచిత శ్రీరామాయణము వాల్మీకి ప్రతి శ్లోకమునకు అనువాదము మాత్రము కాదు. రహస్యార్థప్రతిపాదకములగు శబ్దములను విడువక అనువాదము నందిచ్చిన మహత్తర గ్రంథము, దాని నర్థము చేసుకొనుట కష్టము – కాని అర్థము చేసుకొనినారు. చేసుకొని సులభము, నిర్దుష్టము, స్పష్టము, అన్వయ క్లేశరహితము నగు మధుర ప్రసన్న భాషలో వచనముగా అందించి జీవితాన్ని సార్థకము చేసికొనినారు. శ్రీరామాయణము ప్రాచేతసుల నుండి వెల్వడిన వేదము. వేదమున పూర్వభాగార్థమును వాల్మీకి వాచ్యార్థమున కవిగా ప్రతిపాదించినాడు. అంతరమగు ధ్వన్యర్థమున ఆధ్యాత్మికమైన వేదోత్తర భాగార్థమును మునిగా సూచించినాడు. ఈ రామాయణమున శ్లోకమును కాని, పాదమును కాని అధ్యయనము చేసినంతనే భగవత్సాయుజ్యము నొందెదము అని పెద్దలు చెప్పుదురు. అట్టిచో ఈమె ఏడు కాండలు చదివి అనుభవించి జీర్ణము చేసుకొని తనదిగా తెనుగు వచనమున ఆవిష్కరించి ధన్యత నందినారు. ఈమె భాగ్యమే భాగ్యము.

ఈ అనువాదము అనువాదము వలె లేదు. స్వతంత్రముగా సాగినది. భాష సహజము, మధురము, ప్రసన్నము. వాక్యము సంస్కృతమునకు అనువాదముగా ఉండక అచ్చమైన తెనుగుదనమును సంతరించుకొన్నది. బాలకాండములో అశ్వమేధయాగ సందర్భమున ఆమె చేసిన అనువాదము ఆశ్చర్యజనకముగా నున్నది. పండితులకు కూడ దురవగాహమైన యాగక్రమ వివరణము పండితులకు కూడ సంశయము తీరునట్లు, పామరులకు కూడ సులభముగ అర్థమగునట్లు వ్రాసినారు. ఇది చదువుకొనిన జ్ఞానము కాదు. భగవదుపాసనచే వచ్చిన భాష–విషయ వైశద్యము. తెనుగున ఇంతవరకు ఎన్నో – గ్రాంధికభాషలో, వ్యావహారిక భాషలో గూడ అనువాదములు వచ్చినవి. భాషలో, వాక్య నిర్మాణములో ఇంత అందము సౌలభ్యము వేరొకదానిలో చూడమనుట అతిశయోక్తి కాదు – వాస్తవము.

ఆమె అనుభవించిన శ్రీరామచరితమును లేశమాత్రమనుభవించి ధన్యత నొందిన వాడనగుటచే అనువాదమును చూచి ఆనందించి ఆమె చేసిన ప్రయత్నమును అభినందింపకుండ ఉండలేకనే యీ మాటలు వ్రాయుచున్నాను. కాని ఆమె ద్వంద్వాతీతురాలు. ఆమెకు వెనుక బలము ఆమె ఉపాస్యదైవము. ఆ దైవబలము పలికించగా వాల్మీకి నోటినుండి శ్రీరామాయణ మంతయు బ్రహ్మానుగ్రహముచే వెల్వడినట్లు ఈ వచన శ్రీరామాయణము ఈమె నోటి నుండి వెల్వడినది. ఆంధ్ర పాఠకలోకము అన్యూనాతిరిక్తముగ వాల్మీకి రామాయణమును గ్రహించుటకు ఈ గ్రంథము సాయపడును.

ఆమె తరించుటయే కాక అందరిని తరింపచేసిన ధన్యచరిత మా సీతమ్మగారికి శ్రీ సీతారామచంద్రులు తమ విశేష కటాక్ష ప్రసాదముచే ఇతోధికముగ లోకానికి తమకున్న దైవీసంపదను పంచిపెట్టు శక్తిని, భక్తిని ప్రసాదింతురు గాక అని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

**(సం) శ్రీ భాష్యం అప్పలాచార్యులు**

**26-12-1989**



శ్రీ హయ వదన పరబ్రహ్మణే నమః
శ్రీమతే రామానుజాయ నమః

# ఆశీస్సు

**సుఖాయ కర్మాణి కరోతి లోకః నతైస్సుఖంవా న్యదుపారమం వా।**
**విందేత భూయాస్తత ఏనదుఃఖం యదత్ర యుక్తం భగవన్వదేన్నః॥**

అని నటుల ఈ ప్రపంచమున ప్రకృతి బద్ధులగు చేతనులందరును సుఖాపేక్షచే కొన్ని కార్యములందు ప్రవర్తించుచున్నారు. అందువలన వీరికి సుఖప్రాప్తి గాని దుఃఖ నివృత్తి గాని సంభవించకపోవుటయే గాక అధికముగా దుఃఖములు సంభవించుచున్నవి. ఇటుల ప్రకృతి పిశాచికావిష్టులై ప్రకృతి సామ్యము ననుభవించుచు స్వభావ సహజమగు జ్ఞానానందమలత్వాదికమును, పరమపురుషశేషత్వమును విస్మరించి నానావిధ సాంసారిక దుఃఖముల ననుభవించుచున్నను క్షణకాలము కూడ ప్రకృతి సంబంధము లేక యుండ జాలరు. ఇది యొక విచిత్ర సంఘటన. ప్రకృతి సంబంధ విచ్ఛేద మెటుల సంభవించును? ఇందుల కుపాయమెద్ది? దీనిని తెలుసుకొనుటకు సాధనము లేవి? యని విచారింపగా ప్రత్యక్షము అతీంద్రియార్థములను గోచరింప చేయనందునను, అనుమానము ప్రత్యక్షాపేక్ష మగుట చేతనున్నూ – ఇవి సాధనము లన వీలులేదు. ఇక శబ్దమును సాధనముగా గ్రహించవలెను. అదియు పౌరుషేయమైనచో సజాతీయ పురుషులయందు విశ్వాస ముండదు గాన వారు చెప్పినదాని ననుసరించుట అసంభావితము. దీనిని విచారించి నిరుపాధిక వత్సలుడును దయాసముద్రుడును సర్వశక్తుడు నగు భగవానుడు

అపౌరుషేయము నిత్యనిర్దోషము సకల పురుషార్థబోధకము నగు వేదమును తన నాభికమలమున జన్మించిన చతుర్ముఖుని కుపదేశించెను. ఆ వేదమింత వరకు అవిచ్ఛిన్నముగా పాఠక్రమమున వచ్చుచున్నది. దీని కర్థము దుర్బోధక మగుట వలన వివరణ మపేక్షిత మగుటచేత సర్వేశ్వరుడు మహాత్ముల కొందరి నవతరింపజేసి వారిలో తా నంతఃప్రవిష్టుడై వారి ముఖమున వాటిని వివరించుటకు ప్రవర్తించిన వాడాయెను.

ఆ వివరణములు స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ఆగమములు – అని వ్యవహరింపబడుచున్నవి. ఇందు స్మృతులు మానవ పారాశర్యాదులు. ఇవి భగవదారాధన రూపమును ఫలాపేక్షి జనానుగ్రాహకము నగు కర్మ కాండమునకు వ్యాఖ్యారూపములు. ఇతిహాసములు – రామాయణ భారతాదులు. ఇవి మహాపురుష చరిత్ర బోధకములగుచు వేదాంత భాగ వ్యాఖ్యారూపములు. పురాణములు – విష్ణుపురాణ, భాగవతాదులు. ఇవి సర్గాదిలక్షణపంచక సమేతములై వేదాంతార్థ ప్రకాశకములు. ఆగమములు పాంచ రాత్రాదులు. ఇవి దేవతారాధన బోధకములు. ఇందు ఇతిహాసము సాక్షాదుపనిషద్వ్యాఖ్యాన మగుటచే స్మృత్యాదికమున కంటె ప్రశస్తము. ఇందు రామాయణము సీతారామ రూప మానుష వేషధారులగు శ్రీ శ్రియఃపతుల యొక్క చరితమును బోధించు నదియు, చతుర్ముఖ ప్రేరితుడగు వాల్మీకి మహర్షిచే రచింపబడినదియు మోక్షసాధనమగు భగవచ్ఛరణాగతిని సీతా రూపమును ధరించిన శ్రీదేవి యొక్క పురుషకార వైభవమును ప్రతిపాదించునదియునై యున్నది. కనుకనే –

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।**
**వేదః ప్రాచేత సాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా ॥**

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథ కుమారుడుగా నవతరించగా – ప్రమాణము ప్రమేయానుసారి కనుక – ప్రమాణమగు వేదము వాల్మీకి మహర్షి వలన రామాయణ రూపమున నవతరించినదని ప్రశంసించబడి యున్నది.

శ్రీమద్రామాయణము సీతారాముల చరిత్రమైనను ఇందు ప్రధానముగా

సీతాచరిత్రమే చెప్పబడినదనియు, ఇది గొప్పదనియు, "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్" అని వాల్మీకి మహర్షి చెప్పియుండెను. సీతాచరిత్ర దేనికంటె గొప్పది? అనిన రామచరిత్రకంటె – గొప్పదని యభిప్రాయము. పూర్వాచార్య గృహీతమగు నీ క్రింది శ్లోక మీ విషయమును స్పష్టపరచుచున్నది.

**"మాతర్మైథిలి రాక్షసీస్త్వయి తదైవార్ద్రా పరాధాస్త్వయా**
**రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా ।**
**కాకంతం చ విభీషణం శరణ మిత్యుక్తి క్షమౌ రక్షతః**
**సానస్సాంద్ర మహాగస స్సుఖతు క్షాంతిస్తవా కస్మికీ ॥**

రావణ సంహారానంతరమున హనుమంతుడు సీతా సమీపమునకు వెళ్ళి రాక్షస స్త్రీలు నీ విషయమున అపరాధము చేసి యున్నవారు గాన వీరిని సంహరించుటకై అనుజ్ఞ నీయవలసినదనగా రాజాశ్రితులు రాజాజ్ఞచేతనే గదా ఏపనినైన చేయుట. అట్టి వారి విషయమున కోపించుట యుక్తము కాదని రాక్షసస్త్రీలు తమ రక్షణను ప్రార్థించక పోయినను వారిని రక్షించెను. శ్రీరామచంద్రుడు శరణ ప్రార్థన చేసిన కాకాసుర విభీషణుల రక్షించెను. ఇందువలన రామచరితము కంటె సీతాచరితము గొప్పదను ఆశయము చేతనే "సీతాయా శ్చరితం మహత్" అని చెప్పెను.

ఇట్టి శ్రీరామాయణమును సర్వజనులకు సులభగ్రాహ్య మగునటుల వచన రూపమున వ్రాసి లోకోపకారము గావించినదీ సీతామతల్లిక. సీతమ్మకు సీతాచరితమే మనోహరము ఆనందావహము కదా! కనుకనే భగవచ్చరితము లనేకము లున్నను ప్రథమమున శ్రీరామాయణము వ్రాయబడినది. ఇటుల భగవచ్చరిత బోధకములగు యితర గ్రంథములను కూడ సుగ్రాహ్యములగు నటుల వచన రూపమున వ్రాయుట కీమెకు భగవాను డాయురారోగ్యోత్సాహాదుల నొసంగుగాక!

**(సం) మొలుగు రామానుజాచార్యులు**
**ముగ్గుళ్ళ**

# విషయసూచిక

శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః
శ్రీ శారదాయై నమః
శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము

# కిష్కింధా కాండము

## మొదటి సర్గము

### శ్రీరాముడు పంపాతీరమున సీతావిరహమున తపించుట

తామరలు, కలువలు, చేపలు మొదలగువాని సమూహములచే ప్రకాశించుచు సిరులొలుకుచున్న పుష్కరిణిని చూచి, దశరథనందనుడు తమ్మునితో హా! యని విలపించెను. పంపాసరోవరమును చూచిన సంతోషముతో సర్వేంద్రియములు కంపించుచుండగా, మన్మథబాణములచే కంపింపజేయబడిన హృదయము గలవాడై రాఘవుడు సొంపుగా లక్ష్మణుని జూచి యిట్లు పలికెను. విరిసిన తామరలును, చెంగలువులును, అందమైన వైఢూర్యములవలె ప్రకాశించు చున్న స్వచ్ఛమైన, పవిత్రమైన జలమును, చుట్టుప్రక్కల వివిధములగు వృక్షములును కలిగి పంపాసరస్సు వప్పుచున్నది. సౌమిత్రీ ! చూచితివా ? శిఖరములతో గూడిన కొండలవలె, కొమ్మలతోగూడిన వృక్షములు గలిగి పంప చుట్టును కొనియాడదగినట్లున్న వనములను చూచితివా ? సోదరా ! భరతుని కొఱకైనా దుఃఖము చేతను, భార్య దొంగిలింపబడుట వలన కలిగిన శోకము

చేతను తపించుచున్న నన్ను గొప్పదైన సహింపరాని దుఃఖభారమున నుంచి వసంతుడు బాధించెను గదా. అయ్యా ! శోకముచే ఆర్తి చెందిన నాకు చిత్ర చిత్రములైన అడవులతోనూ, ప్రశస్తమైన చల్లనినీటితోడను, చిత్ర చిత్రములైన పువ్వులతోడను ఈ సరస్సు మిగుల సంతసము కలిగించినది. పాములతో గూడియున్నను, మృగములు, పక్షులు మొదలగువాని సమూహముచే సంకలమైనదైయ్యును, నల్లకలువలు, తామరలు, నిండియున్నదైయ్యును, పంపాసరస్సు గొప్పసంతోషమును గలుగజేసెను. నల్లనైన, పచ్చనైన రంగులతో నున్న లేతపచ్చికలు అవిగో ! గొప్ప అందమగు చెట్లయొక్క పుష్పములు రాలుటచే, రత్నకంబళ్ళు పరచినట్లందముగానున్నవి. పుష్పభారములతో నిండియున్న కొనకొమ్మలుగల వృక్షములను, పుష్పములతో కూడిన అగ్రభాగములు గల లతలు చెట్లచివరవరకూ ప్రాకుటచే కౌగిట గృచ్చినట్లు కనిపించుచున్నవి. చూచితివా ? సుగంధములతో గూడినవాడై, సుఖమును గలుగజేయు వాయువులు గలవాడై, మన్మథునుద్దీపింప జేయుచున్నవాడై, పుష్పములతో, ఫలములతో మనోహరుడై వసంతుడు ప్రకాశించుచున్నాడు. మేఘములు వర్షము కురిపించునట్లుగా పువ్వులచెట్లు పువ్వులను వర్షించుచున్న వైభవమును జూచితివా ? గట్టి రాతినేలలందు అడవిచెట్లు గాలివిసరగా పువ్వులను రాల్చెను. పిల్లవాయువులు రాలిన పువ్వులను గలిపి యాడుకొనుచున్నాడు చూడవయ్యా! పువ్వులతోనున్న కొమ్మలను గాలి ఇటునటు నూడ్చి వానిస్థానములనుండి గ్రదలిన తుమ్మెదల ఝుంకారము నెపమున గీతములను పాడెను. హర్షముతో చెట్లకొమ్మలనాడించునట్లు పర్వతాగుహలనుండి వెడలుచూ కోకిల ధ్వనులతో వాయువు పాటలు పాడుచున్నట్లుగా కనుపట్టెను. గాలి విపరీతముగా వీచుటచే ఒకదానితోనొకటి కలసికొన్న చెట్లకొమ్మలు అందముగా దండలవలె నొప్పు చున్నవి. చూచితివా ? సోదరా ! చందనమువలె చల్లనగుచు మందమారుతము ఇప్పుడు పుణ్యమైన సుగంధములతో నొప్పుచు బడలికతీరునట్లుగా సుఖస్పర్శ గలదియై వీచుచున్నదిగదా. తేనెల సుగంధములు వ్యాపించిన వనములలో

మదించిన తుమ్మెదలయొక్క ఝుంకారముల నెపముతో వృక్షములు గానము చేయుచూ గాలికి ఆడుచున్నవి. గట్లయందు పుట్టి పూలగుత్తులతో నిండియున్న చెట్లు దగ్గరదగ్గరగా నుండుటచే ఆ కొండల సమూహము పెద్దపువ్వులరాశి వలె కనిపించుచున్నది. పువ్వులపై తుమ్మెదలు నివసించి గొప్ప గాలివలన కదలుచూ రొదచేయుచుండగా ఆ చెట్లే గానము చేయుచున్నట్లుగా తోచుచున్నది గదా. గోగుచెట్లు నిండుగా పూచి అందముగా బంగారు యాభరణములు దాల్చి, పైన వల్లెవాటుగా బంగారు జరీబట్టలు ధరించిన జనులవలె తోచుచున్నవి. వింత వింతల పక్షులు ధ్వనులతో నిండియున్న యీవసంతము భార్యా విహీనుడనగు నాకు భరింపరానిదై నాకు సంతాపమును గలిగించుచున్నది. భార్య నెడబాసిన దుఃఖముతో నున్న నన్ను మన్మథుడు నిగులబాధించుచున్నాడు. జయా శబ్దములతో కోకిలలు సంతోషముతో నన్ను పలుమారు పిలుచుచున్నవి అందమైన అడవులందలి సెలయేళ్లలో నున్న నీటికోళ్ళు మిక్కిలి సంతోషించు చున్నవై మధుర ధ్వనులను మెల్లమెల్లగా వినిపించుచు నాకు సెమించని పరితాపము కలుగజేయుచున్నవి. తమ్ముడా! మనము ఆశ్రమ ప్రదేశమున మునుపుండగా ఇట్టి సొంపైన ధ్వనులు విన్నదై జానకి ఎక్కువ సంతోషముతో నన్ను పిలిచి సంతోషించెడిది. అనేక విధములైన మంచి ధ్వనులతో నీవిధములైన పక్షులు తమకముతో తీగ పొదరిండ్లపై వ్రాలుచుండుటను చూడుము. కమ్మని ధ్వనులతో కూయుచు ఎక్కువైన ప్రేమతో తమ మగ పక్షులతో సంతోషముతో ఆడ పక్షులు క్రీడించుచున్నవి. పక్షులు, తుమ్మెదలు విలసముతో అరుగుచున్నవి. చెట్లన్నియు అత్యుత్సాహముతో గూడిన ధ్వనులతోనూ కోకిలల కళకళ ధ్వనులతోనూ నా మనస్సున మన్మథాగ్నినధికము గావించుచున్నవి. అశోక వృక్షము యొక్క పూలగుత్తులు నిప్పులుగాను, తుమ్మెదల ధ్వని మంటల చప్పుడుగాను, ఎఱ్ఱని చిగురులు జ్వాలలుగాను ఇదిగో వసంతమనెడు అగ్ని నన్నిపుడు దహించుచున్నది. ఈ అందమైన కోకిల ధ్వనులును, పువ్వులతో నిండిన కాననమందలి వసంత శోభయు, సీతకెంతో సంతోషమునిచ్చెడివి.

చక్కని కనులుగలదియు, మృదువుగా సంభాషించునదియు, తుమ్మెదలవంటి ముంగురులుగలదియు నగు జానకిని విడచి నేను ప్రాణములతోనుండి ఓ ప్రియ సోదరుడా! యేమి ప్రయోజనము? ఎక్కువగా పుష్పించిన పూబొదరిండ్లు ఎల్లెడలను గనిపించుచు, చెకోరములవంటి నేత్రములు గల్గిన నాజానకిని చూడజాలకపోవుటచే మన్మధునిచే పుట్టింపబడినదియు, వసంతునిచే దరికొల్పబడినదియు, ప్రేమయను కారణమున పుట్టి, శోకమనెడు అగ్నిచే మండింపబడినవాడనై కృశించుచున్నాను. అయ్యో సోదరా! ఎట్లు భరింపగలను? విదేహరాజపుత్రి కనిపించక శోకమును కలుగజేసెను. కనిపించిన వసంతుడు చమటబిందువులు తొలగించుచున్నాడు. నేను సీతను బాసి వేదనచే తపించుచుండగా ఈ వసంతపువాయువెంత క్రూరుడో అయ్యో నన్ను దహించుచున్నాడు. గాలి వీచుటచే రెపరెపలాడుచూ స్పటికపు గవాక్షముల వలెనున్న పింఛములను విప్పి నటించుచు, తమ భార్యలగు ఆడనెమళ్లచే సేవింప బడుచున్నవి. అట్లని మదించిన ఆనందముతో చొక్కసోలుచు మన్మధపీడితుడనైన నన్ను మఱింత మదన తపమునకు గురిచేయుచున్నవి. అట్లాడుచున్న నెమలిని జూచి సంతోషముకల్గి ఆడనెమలి తానును నటింపగ వీడని మన్మధతాపమున మగ నెమలి దానిపంచజేరి రెక్కలల్లార్చుచు మృదువుగా శబ్దించుచు నన్ను పరిహసించుచున్నదో యనునట్లు నావంక జూచుచున్నది. లక్ష్మణా చూచితివా? అడవులలో ఈ నెమలియొక్క ప్రియకాంతను రాక్షసుడు దొంగిలిచ్చుకొని పోవడుగదా! అందులకే ఇది తన ప్రియురాలుతో గలిసి వేడుకతో క్రీడించు చున్నది. ఔరా! వసంత కాలమహిమాతిశయము! పక్షి జాతులలో భూమియందు జన్మించియో అధికమైన అనురాగభారముచే ఈ ఆడనెమలి తనభర్త దగ్గరగా వెళ్ళి నిల్చెను. సీత కూడా రాక్షసుని చేత జిక్కకున్నచో, ప్రేమతో ఆ చంచలనేత్ర నన్ను సంభ్రమముతో కూడ రాకుండునా? మనోహరములగు కురులుగల నాప్రియురాలిని, జానకిని విడిచి లక్ష్మణా! ఎట్లీవసంతమును గడపగలను? చూచితివా? తొరగుచున్న తేనెలుగల మంచిపువ్వులతో ఈ వనములు నిండి

యున్నవి. అయ్యయ్యో ! ఈ సమయమున నీ పుష్పసమూహమంతయు నా విషయమున వ్యర్థ మగుచున్నవి సుమా. తమ కాంతల గుంపులతో గూడి తుమ్మెదల సమూహములు రొదచేయుచు నీ కుసుమములపై వ్రాలగా అవి నేలకు రాలుచున్నవి. ఇవి యన్నియు నా విషయమున వ్యర్థములైనవి. మనోహరములైన కలధ్వనులు చేయుచు, నాకు కామము నతిశయింప జేయుటకోయన్నట్లు పక్షిసమూహములు పరస్పరము పిల్పులతో సల్లాపములాడు చున్నవి. నా ప్రియురాలగు సీత యెచ్చటనున్నదో అచ్చట గూడ ఈ వసంత సమయమిట్లేయున్నచో నిజముగా ఆ చపలాక్షియగు జానకి నా వలెనే కందర్పుని యొక్క ప్రతాపముచే మూర్ఛితయగుచు బాధ చెందును గదా. ఆ జానకి యున్న చోటున వసంతము రాదు సుమా. ఒకవేళ వచ్చినచో నన్ను విడచి ఆ సీత ఎట్లు సహించును? అయ్యో! రాక్షసకోట్లు చుట్టూ చేరి బెదరింపు మాటలు పల్కుచుండగా, ఆ పూర్ణచంద్రానన ఆర్తితో వెల్వెలపోవు మోముతో యేమిచేయగలదు? మృదువైన మాటలు చెప్పునదియు, అందమైన రూపము గలదియు, పద్మ దళములవంటి నేత్రములుగలదియు, యౌవ్వనవతి యగు నా సీత కామబాధ అతిశయించినదై ఈ వసంత సమయమున శరీరమును విడువదా? నా మనస్సునకిట్లు తోచుచున్నది. ఈ సమయమున జనకపుత్రి యౌవనవతియు, పతివ్రతనగుటచేత ఏ విధముగను నా యెడబాటును సహింపజాలదు సుమా. తమ్ముడా! సీతారమణి మనస్సెప్పుడును నాయందే నిలిచియుండును. ఆ మదిరాక్షియందే స్థిరముగా నెల్లప్పుడు మనస్సు నిలిచియుండును. ఈ పువ్వుల వాసనలతో నిండి చల్లదనముచే గొప్ప సుఖమును గలుగజేయుచు వాయుదేవుడు ప్రకాశించుచుండియు, భార్య ప్రక్కన లేకుండుటచే నాకగ్నిసమానుడై బాధ పెట్టజొచ్చెను. సీతతో గలిసియున్న సమయమునెంతో సుఖమునిచ్చు నితడు నేడిట్లు కాల్చుచున్నాడిదేమి పాపమో గదా. ఈ పలుగాకియగు గాకి మునుపు మేము సుఖముగా నున్న సమయమందు మాపై ప్రేమను జూపుచు ఆకాశమందు చెవులు చిల్లులుపడునట్లుగా కూసెడిది. ఇప్పుడు

జానకి లేకుండుటచే సంతోషముతో రెక్కలు విదుల్చుచు చెట్లకొమ్మలందు సంతసమార కునియుచున్నది. తమ్ముడా! మునుపీకాకియే భార్యా వియోగమును సూచించినది. తిరిగి ఇప్పుడు సంతోషకరములగు కూతలతో ఆ స్త్రీరత్నము తోడి యోగమును సూచించుచున్నది. కొమ్మలకొనలలో పువ్వులుగల చెట్లలో గూర్చుండి పక్షి సంఘములు అనేకములైన అందమైన అరపులతో నా ధైర్యమును నశించునట్లు కామమును పెరుగజేయుచుండెను వింటివా? గాలిచే నెగుర గొట్టబడిన బొట్టును, పూగుత్తిని తుమ్మెద కామమదముతో సాగిపోయెడు వనిత ననుసరించు మగనివలె అనుసరించుచున్నది. పేరునకశోకమయ్యును ఇది కాముకులగు వారికి శోకమును పెంపొందజేయును. ఇది గాలికి కదలెడి పువ్వుగుత్తులతో మాటిమాటికి నన్ను భయపెట్టుచున్నట్లుగా తోచుచున్నది. నిండుగా పూవులు పూచియున్న మామిడిచెట్లను చూచితివా? విలాసము, గర్వముగలవారై పవిత్రములైన లేపనములను బూసికొన్న మనుష్యులవలె కాంతులతో నొప్పుచున్నవి. పంపా సరోవర ప్రాంతమునందు అక్కడక్కడ కిన్నరులు తిరుగుచున్నారు లక్ష్మణా! చూచితివా? ప్రతిబింబించిన బాలసూర్యుల వలెనున్న ఆ యెఱ్ఱతామరల అందమును జూడుము. సౌగంధికములు, ఎఱ్ఱకలువలు, హంసలు, బెగ్గురుపక్షులు మొదలగు వానిచే మనోహరమయిన ఈ జలమును చూడుము. బాలసూర్యునివలె ప్రకాశించునదియు, తుమ్మెదలచే కదలింపబడుచున్న కేసరములుగలవియు నగు పద్మములతో ఎండిన సరోవరమును జూచితివా? చక్రవాకములతో గూడినదియు, అందమైన వనమనెడు వస్త్రముగలదియు, దప్పికతో నీటికై వచ్చియున్న లేళ్ళ గుంపులు గలదియునై ఈ పంపాసరస్సు ఇంపుసొంపు లొలుకుచున్నది. గాలి తాకిడిచే నెగురగొట్టబడిన తరంగములచే కదలింపబడినవై తామర పువ్వులు సరసత్వముతో నుయ్యలలూగుచున్నట్లందముగా కనిపించుచున్నవి చూచితివా? సౌమిత్రీ ! నూరురేకులకు శేశయముయొక్క రేకులవంటి కన్నులుగలదియు, శతపత్రములందు ప్రీతిగలిగినదియు, పద్మగంధియులునగు భూపుత్రి

లేకుండుటచే భూమికి భారముగా నేను బ్రతుకాజాలను. తమ్ముడా! ఓరా మన్మధుని కౌటిల్యము ! ప్రాణసమానురాలును, లభింపరానిదియు, మంగళకరు రాలును, అందముగా, సుఖముగా బల్కునదియు, దూరముననున్నదియు అగు జానకినిప్పుడు తలపునకుదెచ్చెనుగదా. పూచియున్నచెట్ల బలముతో, వృద్ధినొంది వసంతుడు నన్ను బాధింపనిచో సౌమిత్రీ ! నేనేవిధముగానైనను మన్మధుని సహింపగలిగియుందును. ఆ రమణితో గలసియున్నప్పుడేయవి యందముగా గన్పించి నాకు అనురాగమును గలుగజేసినవో, అవియే ఆమెనెడబాయుటచే అందమునుగోల్పోయి ఎక్కువ విరక్తిని గలుగజేసెను. తామరపువ్వుల రేకుల నానందముతో చూచెదనాయన్ననవి నా ప్రియురాలి కన్నులతో పోలిక గలిగి యుండుటచే వానిని తోపింప జేయుచుండెను. పద్మ కేసరములను ముట్టి చెట్ల సందులనుండి వెడలివచ్చు వాయువు నా అంగన యొక్క నిశ్వాసముల విధముగా నుండి సాటిలేని రీతిని మనోహరమై వీచుచుండెను. పంపా సరోవర దక్షిణ తీరమున అందమైన చోటులను చూచితివా సౌమిత్రీ! బాగుగా వికసించిన పుష్పములు గల గోగులతో ప్రకాశించు నీటిలో ఎక్కువైన శోభ కలిగి యున్నవి. అనేక విధములైన గైరికాది ధాతువుల రసములచే అలంకరింపబడిన ఈ పర్వతరాజును చూడుము. ఆనందము గలిగించుచు గాలి తాకిడిచే పుష్ప రజములను చిత్రచిత్రమైన విధముగా రేపుచున్నవి. బాగుగా వికసించి ఆకులు ప్రక్కకు తొలగిన అందమైన మోదుగపూల కాంతులచే పర్వత సానువులు ప్రజ్వరిల్లుచుండెను. జాజి, గన్నేరు, గురివెంద, మొదలుగాగల తీగలు అల్లుకొన్న ప్రదేశములును, వావిలి, మొల్ల, అడివిమొల్ల మొదలైన పొదరిండ్లు గల ప్రదేశములును, అశోకము, పొగడ, సంపెంగ, కడిమి, కానుగ, మొగలి మున్నగు చెట్లు గల ప్రదేశములును, నారింజ, మధురరంగము, నారంగము, తుమ్మి, కలిగొట్టు, మద్ది, మామిడి మొదలగు ఫల వృక్షములు గల ప్రదేశములును, ఇరుగుడు, విరిగి, మొగలి, మోదుగ, చందనము మొదలగు చెట్లతో నొప్పిన ప్రదేశములును, గోరింట, దిరిసెన, తినిశము, పొన్న, ఊేల, లొద్దుగు చెట్లుగల

ప్రదేశములును గల కొండచరియలను చూచితివా? పూచిన అగ్రభాగములు గల మనోహరమైన తీగల సమూహములు చుట్టుకొనగా పంపాసరస్తీరమున పూచిన చెట్లు దట్టమైన కాంతులను వెదజల్లుచు విలాసముగా కొమ్మలనూంచు చున్నవి చూచితివా? చెట్లు గాలికి కదలెడి కొమ్మలతో సంతోషముతో తమను చేరరాగా వానిని మదించిన అందమైన స్త్రీలవలె లతలు కౌగిలించుకొనుచున్నవి. చెట్టు నుండి చెట్టునకు, కొండ నుండి కొండకును, అడవి నుండి అడవిని బహురసజ్ఞుడై ఆనందించెడి మనుష్యుని వలె గాలి పలుచోట్లకు వెళ్ళుచున్నది. ఎక్కువగా వికసించిన పుష్పములు గలిగి సువాసనలు గల్గి కొన్ని చెట్లు ప్రకాశించెను. సుకుమారములైన మొగ్గలచే కొన్ని నీలములగు చెట్లు ప్రకాశించెను. అదిగో మదించిన తుమ్మెద ఇది అందమైనదని, మధురమైనదని, ఇది ఇప్పుడిప్పుడే వికసించినది గదా యని యెంచుచు సంతోషముతో ఝుంకారములు చేయుచు పువ్వులపై వ్రాలుచున్నది. చెట్ల చాటున దాగి హఠత్తుగా బయటికి వచ్చి తేనెగ్రోలవలెనను ఆసక్తిచే చాటుగా వేరొక చెట్ల సమూహమును చేరుటకై తుమ్మెద తొందరగా వెళ్ళుచున్నది. విశేషముగా తామంతదాము రాలిన వికసించిన పుష్పములతో అందమైన నేలలు పరిమళించుచు నిచ్చట హాయిగా పరచిన పూల పానుపులవలె ప్రకాశించెను చూడుము. అనేక విధముల రంగులు గలిగిన పువ్వులు కొండ ప్రక్కలందు రాలి పచ్చగాను, ఎఱ్ఱగాను, తెల్లగాను ఉన్న పానుపులవలే అందముగా ప్రకాశించెను. చూచితివా సౌమిత్రీ! వసంత సమయమున చెట్ల కొమ్మల నిండుగా నున్న పువ్వుల సమూహములను చూడుము. పువ్వులను తలలందలంకరించుకొనిన చెట్లే ఏ ప్రక్కల జూచినను అందమును చిందుచున్నవిగదా. ఒకదానితో నొకటి సాటికి పోటీకి పూచినట్లుగా విరివిగాపూచి చెట్ల తుమ్మెదల మ్రోతలనెడు వెలకొలపు మాటలతో ఒకదానినొకటి పిలుచున్నట్లుండెను. ఈ కన్నె లేడిపిట్ట తనును, తన రమణీయ ఈ శుభ జలములందు మునిగి నాకు మదన తాపమతిశయించునట్లు రతిక్రీడల దేలుచున్నదిగదా సౌమిత్రీ! గంగానదికి ఈ అందము మనోహరముగా నేర్పడుటచేతనే జగమునందు తన మనోహర గుణములచే ఆనందదాయకమై

ఏళ్ళేడల ప్రఖ్యాతిచెందెను. కన్నులారా నా జానికిని చూచుచు ఇష్టము వచ్చినట్లుగా ఇచ్చట నుండుట కలవాటు పడినచో, వినుము, స్వర్గమునైనను, ఆ అయోధ్యనైనను మనస్సున స్మరింపజాలను సుమా సౌమిత్రీ! వాని మాటలట్లుంచుము. భూపుత్రితో గూడ అందము చిందుచున్న పచ్చిక బయళ్ళ యందు నేను రమించుచున్నచో వినోదమునకైనను నేను ఇతర ప్రదేశముల నేల తలంచెదను. చిగురాకులతో మొగ్గలతో అందమైన ఆకులతో శోభను కలుగజేయుచున్న చెట్లతో నిండిన వనముల యొక్క రవరవలు చేత వారు విరహతాప మతిశయించుచున్నదిగా అనఘా! సౌమిత్రీ! జెక్కవ పక్షులు, బెగ్గురు పక్షులు, నీటి కోళ్ళు, క్రౌంచ పక్షులు, శబ్ధించుచున్న ఇతర పక్షులు, అనేకములైన లేళ్ళను, అధికముగానున్న పంపను చూచితివా? మిక్కిలి వెలుగుచున్నది ఆనందముగానున్న వర్షసమూహములు యౌవనవతియు, చంద్రునివంటి ముఖముగలదియు, పద్మములవంటి కన్నులుగలదియునగు జానకిని నా మనస్సునకు జ్ఞాపకము చేసి నాలోని కామమును అతిశయింపజేసెను. ఆడులేళ్ళసమూహములతో గలిసి తిరుగు లేళ్ళను కొండచరియలందు చూడుము. చిన్న ఆడ లేడి కన్నుల వంటి కన్నులు గలిగిన సీత నెడబాసియున్న దీనుడనగు నన్ను చూడుము. ఈ కొండ నెత్తములందు మదించిన యేనుగుల గుంపులు నెమ్మదిగా తిరుగుచుండుటచే నాకు కలుగుచున్న తహ తహ నేమని చెప్పుదును సోదరా! భార్యాసహితుడైన ఈ అందమైన అడవులందు చింతలేకుండ కామము తీరునట్లుగా సంచరించునప్పుడు గదా నాకు పూర్తి సుఖము గలుగగలదు సౌమిత్రీ! పవిత్రములైన పంపాతీరవనములందు నేను పవిత్రయగు సీతాభామతో గూడి పిల్లగాలులను సేవించినచో ప్రాణములీ శరీరమున నిలుచును. వేరువిధముగా క్షేమము లేదుగదా. పంపాతీరవనముల నుండి వచ్చిన వాయువు పద్మముల, కలువల సువాసనలతో గూడినదై వీచుచుండగా బాధ తీరునట్లుగా సేవింప గలవారే ఈ భూమి యందు ధన్యాత్ములు. ఆ పద్మాక్షి, ఆ యౌవనవతి, ఆ విలాసవతి, ఆ పూర్ణచంద్రముఖి విరహముచే వివసురాలై ఏ విధముగా జీవములో నుండ నేర్చునోగదా. పాపరహితుడును, సత్యము పల్కువాడును,

మహాత్ముడును, ధర్మమునందాసక్తి గల శీలము గలవాడును, అయిన ఆ జనకమహారాజు ఇష్టాగోష్ఠిగా నున్నప్పుడు నన్ను అల్లుడా! నా పుత్రిక క్షేమముగా నున్నదా? యని ప్రశ్నించినచో దానికి నేనేమని సమాధానము చెప్పువాడును? సీతనెవ్వడో వనములందపహరించెనని చెప్పగలవాడనా? నన్ను గన్న తండ్రి నన్నడవుల బడి పొమ్మనగా సజ్జనులు మెచ్చుకొను విధముగా నన్ను వెంటనంటి వచ్చిన సీతాసతి గతి ఏమైనదో గదా. రాజ్యహీనుని, దీనుని, భాగ్యహీనునయిన నన్ను వెంటనంటి అడవులలో జోడు విడవక యుస్సురని యైననక వచ్చిన యువతిని విడచి, యేమి చూచుకొని శరీరమున ప్రాణముల నిలుపువాడను? ఘుమ్మను కమ్మని సువాసనగలదియు, అద్దమువలె నునుపైనదియు నగు నా వనిత ముద్దు మొగమును చూచెదనా? వీనులవిందుగా సాటిలేని లేతనవ్వుతో గూడిన హాస్యపుమాటలను విందునా? మన్మథుని బాధ నొందుచున్న నన్ను దుఃఖము జెందని విధముగా ఊరడించు సీతతో గలిసియుందునా? మెల్లని నడకలు గల ఆ సీతను గూడి మనస్సానందముతో నిండియుండునట్లుగా బ్రతుకుదునా? ఏమి చేయు వాడనురా? నేను పట్టణమునకు వెళ్ళినచో నా తల్లియైన కౌసల్య మృదుస్వభావము గలది. కుమారా! రామా! ఎదిరా నా కోడలు అని యడుగగా ఏమని చెప్పమనెదవురా? చిన్న తమ్ముడా! లక్ష్మణా ! నీవు పట్టణమునకు వెళ్ళుము. సోదర ప్రేమ గలిగిన కైకపుత్రుని చూడుము. జానకి లేకుండుటచే నేనింక బ్రతుకుట అబద్ధము. అనుమానము లేదు సుమా. అని ఆనాథుని వలె విలపించుచున్న అన్న విధమును జూచి సమయమునకు తగిన హితవైన మాటలతో సంతాపము తీరునట్లుగా నీతి యుక్తముగా లక్ష్మణుడు రామునకిట్లనెను.

## లక్ష్మణుడు రామునకు ధైర్యోక్తులు చెప్పుట

అన్నా! ధైర్యమును పొందుము. నీవంటి ధీరోత్తముడును ఆపన్నుడైకుండుట తగునా? నా మాటను విని వగవకుము. నా మనవిని వినుమన్నా! రామన్నా! ఇటువంటిదే గదా లోకమందిష్టులైన జనులను వీడినంతటనే కలిగెడు గొప్ప

దుఃఖమని బుద్ధియందు బాగుగా తెలిసికొని మనస్సున బంధువులందు ప్రేమను ప్రవేశింపనీయకుము. నీళ్లలో నానియుండినదైనను వట్టి స్నేహబలముచే గదా మండ నేర్చును. వార్త కొంచమైన తెలిసినచో ఆ పిమ్మట సీత నపహరించినవాడు తనంతటతానే జానకిని నీకర్పింపగలడు. ఒకవేళ ఇవ్వడేని దౌష్ట్యముతో వాడు సీతతో గూడ నాగలోకములోనికి ప్రవేశించినను, ఆకాశమధ్యభాగమున దాగినను, చీల్చిచెండాడెదను. బుద్ధిమంతులలో శ్రేష్ఠుడా! భార్యకై విచారింప కుము. ధైర్యమును పొందుము. సీత నేయత్నముచేత నైనను సాధింతము. చెడిపోయిన కార్యము ప్రయత్నింపకయే నెరవేరుట గలదా ? ఉత్సాహమునకంటె మించిన బలము లేదు. ఆ యుత్సాహమే శక్తి నిచ్చును. ఉత్సాహముతో నుండువానికి ఈ భూమియందొక్క పనియైనను సాధింపరానిది లేదు.

ఉత్సాహముతో గూడియుండువాని కార్యములందెచ్చటనైనను విఘ్నము ఉండదు. ఓ రాఘవా ! నీ ఉత్సాహము నొక్కదానిని పొందియుండుము. భూపుత్రిని చూడగలుగుదుము. శోకమును వెనుకకు త్రోయుము. కామవృత్తిని ప్రశంసింపకుము. పండితుడగును, మహాత్ముడగును, పుణ్యాత్ముడగును అయిన నిన్ను నీవే యఱుగకున్నచో రామా! నేనేమనువాడను అని చెప్పగా, లక్ష్మణునిచే ప్రబోధింపబడినవాడై ఆ పుణ్యాత్ముడగు రాముడును శోకమును, మోహమును మనస్సు నుండి తొలగించుకొని ధైర్యముతో వేగముగా తగువిధముగా పంపా సరస్తీర వనములను జూచుచూ సమర గజగమనముతో వెళ్ళుచుండగా సుమిత్రా తనయుడును అప్రమత్తుడై రాముని ధర్మబలములతో కాపాడుచూ వెళ్ళెను.



# రెండవ సర్గము

## సుగ్రీవుడు రామలక్ష్మణుల జూచి భయపడుట

ఈ విధముగా ఋష్యమూక పర్వత సమీపమందారాజపుత్రులు తిరుగు చుండగా, గొప్ప అద్భుతమును కలిగించునట్లుగా చూచుటకందముగా నున్నవారలను, దేవతలతో సమానమైన పరాక్రమము గలవారలను, సాహసము తో జూచి కొండమీద నున్న సుగ్రీవుడు భయము చెందిన మనస్సు గలవాడై చేష్టలుడిగి కంగారు పడజొచ్చెను. ఆ రాజపుత్రులను చూచినంతనే వనమునందు సంచరించు వానరులు, వానరుల యంతఃపురమైనదియు, సుఖకరమైనదియు నగు ఆశ్రమమును వేగముగా చేరనరిగిరి. పరాక్రమవంతులును, గొప్ప అందమైన ఆకారములు గలవారును, ధనుర్బాణములను, ఖడ్గములను ధరించినవారును, అన్నదమ్ములును, బలవంతులునయిన లక్ష్మణరాఘవులను సూర్యపుత్రుడైన సుగ్రీవుడు చూచి అనుమానించిన వాడై గుండెలు దడదడలాడు చుండగా, వేగముగా దిక్కులన్నియు చూచుచు, తొందరతో నిప్పుత్రొక్కిన విధముగా పాదముల నొక్క నిమిషమైన నొకచోట నిలుపలేక పాపములను దూరమొనరించు వారిని చూచుచు భయముతో పీడింపబడినవాడై, భరింపరాని శోకముచే తపించుచున్నవాడై, తానున్న చోటును వీడి నిలువజాలక అటమట మందెను. ఉన్నచోటున నుండుటయే మేలో, పారిపోవుట అపరిమిత శుభకరమో యని తలంచుచు తన సహాయులగు వానరులతో గూడి మంత్రులతో ఈ విధముగా బలికెను. ఆ సరస్సు సమీపమున గొప్ప శుభముగా నున్న రూపములు గల వీరులను చూచితిరా? వారెవ్వరో కాని మోసగించుమనస్సు గలవారై నారబట్టలను గట్టినారు. వాలికిని, నాకును విడువని విరోధముండుటచే వాలి

పంపగా కపట ముని వేషములతో వచ్చినవారు వారు. కాకున్నచో తాపసులకు ధనుర్బాణములు దాల్చుటెందులకు? అని పల్కగా వారు మంచి విండ్లు, బాణములు చేతులందు దాల్చిన వారలను జూచి గుండెలు ఝల్లుమనగా ఒక శిఖరము మీదనుండి మఱియొక శిఖరము మీదకు అవి అల్లలనాడునట్లుగా దూకుచు వనమున నున్న ప్రాణులు జంతువులు మిక్కిలి భయము చెంది పారిపోవుచుండగా చేతి నుండి జారిన పాదరసము వలె ఒకడు పోయిన దారిలో నొకడు పోక అందఱును వడిగా పరువెత్తుచు ఆ కొండ యొక్క ఆవలి ప్రక్కన గుంపుగా కలిసికొని సూర్యపుత్రుడగు సుగ్రీవుని యొద్ద నిలువగా..

**హనుమంతుడు సుగ్రీవుని భయకారణమడుగుట**

సుగ్రీవుని జూచి వాయుపుత్రుడగు హనుమతుడిట్లనెను. ఓ శాఖామృగరాజా! నీకెందులకీభయము? ఇట్లు పారిపోయెద వేల? వాలివలన భయముచేతనా? ఇది ఋష్యమూకము గదా? ఇచ్చట వాలి భయముండునా? ఇచ్చట వాలి కనిపించుట లేదు గదా? ఏల తొట్రుపాటు చెందెదవు? క్రూరుడును, పాప కర్ముడును అగు ఆ వానరరాజును ఎందుకు చూడనైతిని? నీ భయమున కేది కారణము? వానరుడను పేరు సార్ధకమయినది. లఘుచిత్తుడవగుటచే పూర్తిగా ఆలోచించలేకున్నావు. పరేంగిత జ్ఞానము లేనిచో, రాజు సర్వభూతసంఘము నెట్లు కాపాడగలడు? బుద్ధియందు ఇంగితజ్ఞానమును వీడక పనులను చేయవయ్యా! సుగ్రీవా! యని మంచి మాటలను చెప్పుచున్న హనుమంతుని జూచి సుగ్రీవుడు మంచి మాటలతో నిట్లనెను. హనుమా! తామర రేకులవంటి కన్నులు గలవారును, అతి సుదీర్ఘ బాహువులు గలవారును, గొప్ప విల్లును, బాణములను, ఖడ్గమును దాల్చిన వారును, పొగడదగిన తేజస్సు గలవారును, దేవతాపుత్ర సమానులును అగు వారలను జూచినచో భయము కలగకుండునా? వాలియే పంపుటచే వారిచ్చటికి వచ్చి యుందురని నా మనస్సునందు భావించితిని. భూమి యందలి రాజులందఱు చాలా మంది మిత్రులను

గలిగియుందురు. వారలను నమ్మరాదు. పడనివారు మన మాదమరచియున్న సమయమందు మన లోపములను కనిపెట్టి, తాము పొరపాటుపడక వారికి మృత్యువును గలుగజేయుదురు. పైగా ఆ వాలి ఉపాయశాలి. అపాయములు గలుగకుండా చూచుకొనువాడు. దూరాలోచన గలవాడు. రాజులందరును శత్రువుల నట్లే కదా చంపెదరు. ప్రాకృతుని నొక్కని బంపి వారెవ్వరో యెట్టి వారో ఎట్లైన తెలిసికొనినచో మేలు కలుగును. కనుక ఈ సమయమున నీవు ప్రాకృతుని వేషమును ధరించి వారి యొద్దకు వెళ్ళుము.

## సుగ్రీవుడు హనుమంతుని రామలక్ష్మణుల యొద్దకు బంపుట

ఓ అంజనా పుత్రా! పొమ్ము మాటలతో రూపములతో వారి మనోభావమును, భేదోపాయముతో వారల యభిప్రాయమును, నిర్మలత్వమును నమ్మకముగా తెలిసికొనిరమ్ము. పలుకుల నేర్పుచేతను, భావమును సక్రమముగా తెలియజేయగల కన్నుల యొక్కయు, ముఖము యొక్కయు చేష్టల చేతను వారు నమ్మునట్లుగా పొగడి, వారు నాకనుకూలముగా నుండునట్లు చేయుము. ఇట్లడవులందు విల్లును, బాణములను, ఖడ్గమును ధరించి కలయదిరుగుచున్న కారణమేమియో ప్రశ్నించుము. వాయుపుత్రా! వారు నిర్మలమైన వారని నీకు తోచినప్పటికినీ, మాటిమాటికి వారి మాటలయందును వారి చేష్టలయందును సత్యమున్నదో, అబద్ధమున్నదో తెలిసి కొనుమని చెప్పగా అట్లే చేయుదునని మహాత్ముడైన హనుమంతుడు ఆ రఘువీరులున్నచోటుకు వెళ్ళదలంచుచూ..



# మూడవ సర్గము

## హనుమంతుడు బిక్షువేషమున రామలక్ష్మణుల యొద్దకు వెళ్ళుట

మాయచేయవలెనను బుద్ధిచేత వానర రూపమును విడిచి అచ్ఛమైన బిక్షుకుని వేషముతో ఆ పర్వతము నుండి వేగముగా దూకి ఆ రాజపుత్రు లున్నచోటికి చేరబోయి నిశ్చలమైన మనస్సుతో వినయసంపదతో వారికి నమస్కరించుచు మనోహరమును, సుకుమారమును అయిన మంచిమాటలతో అప్పటికి తగినవిధముగా ఆ రాజులను తృప్తిపరచుచు, సుగ్రీవుడు చెప్పిన మాటలననుసరించుచు తన యభిప్రాయము నిట్లు తెలిపెను. అయ్యా! మీరెవ్వరు? ఈ అడవి ప్రదేశమునకు వచ్చిన కారణమేమి? రాజర్షుల వలెను, దేవతల వలెను నున్నారు. మునిశ్రేష్ఠుల వేషములు ధరించిన వారు. మంచి నయనములు గలవారు. మంచి అందము గలవారు ఈ సరస్సు సమీపమున నున్న చెట్లను చూచుచున్నారు. మిమ్ము చూచి వనమందున్న మృగములును, పక్షులును భయముచేత కళవళపడుచున్నవి. నీ శరీర శోభచేత ఈ నది యందలి పవిత్రమైన జలము మెఱుగు పెట్టినయట్లు ప్రకాశించుచుండెను. మీరు ధైర్యము గలవారలు, పుటముపెట్టిన బంగారము వంటి దేహము గలవారలు. మంచి వయస్సులో నున్నవారలు. ఓ మాన్యులారా! మీరు సింహవీక్షణములు గలవారలు సింహ పరాక్రమములును. ఇంద్రధనస్సు వంటి ధనువులు ధరించిన వారలు. శోభ గలవారు. వృషభేంద్ర పరాక్రమము గలవారలు. ఏనుగుతొండముల వంటి చేతులు గలవారలు. సుందరాకారులు – దేవతా సమానులు. శత్రువులను సంహరించు సామర్థ్యము గలవారలు. ఇట్టిమీరు తిరిగి తిరిగి దీర్ఘనిశ్వాసము లను విడచుచున్నారు. పక్షిసమూహములను భయపెట్టుచున్నారు. ఓ ప్రాజ్ఞులారా!

రాజసింహాసనమున నుండ నర్హులగు మీరు నారవస్త్రములను ధరించి, జడలను దాల్చి యీ విధముగా మునులవలె తిరుగుచున్నారేమి ? ఓ వీరులారా ! దయతో చెప్పుడు. మీ యొక్క తేజముతో పర్వతములను, వనములను ప్రకాశింపజేయుచున్నారు. మీరిద్దఱూ నొకరి నొకరు పోలియున్నారు. విశాలమైన వక్షస్థలము గలవారలు. అర్గళముల వంటి గొప్పబాహువులు గలవారలు. దివ్యమైనకాంతితో ప్రకాశించుచున్నవారలు. ఆకాశము నుండి బయలుదేరి వినోదముగా భూభాగమును జూచి వెళ్ళుటకై వచ్చిన ఆ సూర్యచంద్రులా యనునట్లున్నారు. మీరలెవ్వరో చెప్పుడు. పరిఘములతో సమానమైనవియు, అందమైనవియు, మోకాళ్ళ వరకు నున్నవియు, గుండ్రనైనవియు, మంచిభూషణములు ధరించదగినవియునైన మీ బాహువులయందు నగలనేల ధరింపరైతిరి ? వనములతోడను, సముద్రములతోడను, మేరువు, వింధ్యము మొదలగు పర్వతములతోడను, ప్రకాశించెడు ఈ సమస్తమును ఏలదగినవారలు మీరిద్దఱు. నీ విధమగుదశను పొందనేల? చిత్రములైనవియు, అందమైనవియు, చిత్రములైన విలేపనములు పూయబడినవియు, బంగారముతో నలంకృతమైన ఇంద్రుని వజ్రాయుధముతో సాటి వచ్చునవియు నగు నిట్టి ధనస్సులు భూమియం దెక్కడను కనబడనివి. నీ అమ్ములపొదలు ప్రాణాంతకములయి బుసలు కొట్టుచున్న మహా సర్పములవంటి వైన గొప్ప బాణములతో నిండి యుండి, చూచుటకు మిక్కిలి అందముగను మంగళకరములుగను ఉన్నవి. గొప్ప పొడవుగలిగి వెడల్పుగలిగి, కఠినములై మేలిమి బంగరుతో నిర్మింపబడిన మీ ఖడ్గములు కుబుసమును విడిచిన విషసర్పములోయనునట్లు ప్రకాశించుచున్నవి. ఔరా! ఈ విధముగా నేనింత పల్కినను అదేమిటి మారుమాటాడరేలనయ్యా! ధర్మచిత్తుడైన సుగ్రీవుడను నొక్క వానరరాజు గలడు. ప్రాజ్ఞులచేత నుతింపబడిన శౌర్యముగలవాడగు నతడు, అన్నచే తిరస్కరింపబడ్డ వాడై, భూమండలము నందు భయముతో దీనుడై తిరుగుచుండెను. మీ యొక్క స్నేహమును గోరి

ధర్మాత్ముడైన ఆ వానరరాజు పంపగా మీ యొద్దకు వచ్చినాడను. నేనతని మంత్రిని. వాయు పుత్రుడను. హనుమంతుడను పేరుగల వానరుడను. ఏ రూపమునైన దాల్పగలవాడను. ఎచ్చటికైనా పోగలవాడను. సుగ్రీవుని మంచిని మనస్సునందు తలంచి బిక్షుకరూపమును మాయచే ధరించి ఋష్యమూక పర్వతము నుండి ఇచ్చటికి వచ్చినాడను అనిచెప్పి అతడూరకుండగా, అతడు చెప్పిన మాటలకు మనసు సంతోషమును జెందుచుండగా తన దగ్గర నున్న తమ్ముని చూచి గారవముతో రాముడిట్లనియెను.

## శ్రీరాముడు లక్ష్మణునితో హనుమంతుని ప్రశంసించి చెప్పుట

లక్ష్మణా ! గొప్ప మనస్సుగల సుగ్రీవుని ప్రియమంత్రియే ఇతడు. అనఘా! మనమెవ్వని తలచుచుంటిమో ఆ సూర్యపుత్రుడైన సుగ్రీవుడే తానీవిధముగా మనలను చేరవచ్చెను. స్నేహము, ప్రేమ, నేర్పు ప్రకాశించునట్లుగా మాటలయందు నేర్పరియగు హనుమంతునకు సమాధానము నీవు చెప్పుము. ఋగ్వేదమును చక్కగా తెలియనివాడును, యజుర్వేదమును నేర్వనివాడును, సామవేదమున పాండిత్యము లేనివాడును ఈ విధముగా నెప్పుడు సంభాషింప జాలడు. ఈతడు నిజముగా వ్యాకరణమునంతయు నెన్నిమారులో పఠించెను. ఇంతసేపు మాటలాడినను ఒక్క మాటయైన అపశబ్ధము కాదుకదా ! మాటలాడునప్పుడు కన్నులందుగాని, ముఖమునందు గాని నుదుటియందుగాని, కనుబొమ్మలందుగాని ఒక్క దోషమైనను దోచుటలేదు. లోపములు లేకుండగా ఎక్కువ గాకుండగా సందేహమున కవకాశము లేకుండగా, అతివేగముగా గాకుండగా, మిక్కిలి మెల్లగా కాకుండగా వర్ణోచ్చారణలోపము రాకుండగా, ఎదయందు, కంఠమునందు చక్కగా నెలకొన్నదై మధ్యమ స్వరముతో నీతిని వాక్కు ఒప్పుచున్నది. ఇది మిక్కిలి సంస్కారముగలదై, క్రమముగలదై, శుభప్రదమై వినుటకెంతో ఇంపై ప్రకాశించుచున్నది. ఈతని త్రిస్థలవ్యంజనస్థములైన

చిత్రమైన మాటల విధానము – కోపముతో చంపుటకు కత్తిని పైకెత్తిన శత్రువునైనను శాంతత బొందునట్లు చేయకెట్లుండును? రాజు ఇటువంటి దూతను సంపాదించుకొనకున్నచో పూనుకొన్న పనినేవిధముగా సాధించుకొన గలడు ? కార్యము సిద్ధించినవాడై కీర్తినెట్లుపొందును? ఇటువంటి గుణగణములు గలిగిన దూత యెవని యొద్దనుండునో ఆ రాజు పనులు దూత ద్వారానే నెరవేరును. ఇది నిజము సుమా అని రామచంద్రుడనగా మాటలందు నేర్పరియైన లక్ష్మణుడు వాక్యజ్ఞుడగు హనుమంతునితో వేగముగా నిట్లనెను. పండిత శ్రేష్ఠా! సూర్యపుత్రుడైన సుగ్రీవుని ప్రభాతమును, అతని గొప్ప గుణములు తెలియునట్లుగా వింటిని. ఓ బుద్ధిమంతుడా! అతనిని వెదకుచునే మేమిందు రాగలిగితిమి సుమా. నీవు చెప్పినట్టి ఆ సుగ్రీవుని వాక్యమును మేము సంతోషముతో నీవు చెప్పిన విధముగా చేయగలమని చెప్పగా, వాయుపుత్రుడు సుగ్రీవునకు విజయమును కోరుచు వారిరువురకు స్నేహమును బాగుగా గలుగజేయ దలంచెను.



# నాలుగవ సర్గము

## లక్ష్మణుడు హనుమంతునితో తమ వృత్తాంతమును చెప్పుట

పనిగట్టుకుని సుగ్రీవుని చూడవచ్చినారమను మాటలకు హనుమంతుడు సంతోషముతో పొంగిపోవుచు, సూర్యపుత్రుని దలంచి ఇక అతని కార్యమంతయు చక్కబడును, తప్పదు. ఇట్టివారు అతనిని చూడగోరి వచ్చినవారలట. ఇక సుగ్రీవునకు రాజ్యలాభము తప్పునా? అని తలచి యా వానరుడు, ఆ జగత్ప్రభువుని జూచి, భయంకరములైన అడవులందు, పంపాతీరమునందు అన్నయును, నీవును దిరుగుటకు కారణమేమనగా, రామచంద్రునిచే ప్రేరేపింపబడినవాడై సుమిత్రాపుత్రుడు, హనుమంతునితో మొదటినుండియు రఘోత్తముడగు రాముని కథ యంతయు దెలియునట్లు ఇట్లుచెప్పెను. కాంతిమంతుడును, మహాబుద్ధిశాలియునైన దశరథుడను పేరుగల భూభర్త, ధర్మమునందు ప్రీతిగలవాడై నాలుగు వర్ణముల స్వధర్మముల నెల్లప్పుడును నిలుచునట్లుగా పరిపాలన మొనరించుచుండెను. తానెవ్వరికీ విరోధి కాకుండగా, తనకు పగవాడొక్కడును లేకుండగా, భూతజాలములకు అపరబ్రహ్మయగుచు, నియమము తప్పక, అగ్నిష్టోమము మొదలగు యజ్ఞములను తగిన దక్షిణలతో చేసెను. అతని పుత్రులలో పెద్దవాడు రాముడను పేరుగలవాడు. కీర్తింపబడిన పరాక్రమము గలవాడు. సర్వజీవులకును శరణ్యుడు. తండ్రి మాట ప్రకారము నడచువాడు. రాజలక్షణములు గలవాడు. ఇతడు ధరణీరాజ్యమును గోల్పోయి వనములకు వెళ్లుచుండగా నేను వెనుక వచ్చితిని. ఇతని భార్యయగు సీతాదేవి కూడ, సాయంసమయమున సూర్యుని నతని కాంతులనుసరించునట్లు వెనుకనే వచ్చెను. నేనీ ప్రాజ్ఞుని తమ్ముడను. అతని శ్రేష్ఠమైన బుద్ధికి సద్గుణ

సమూహమునకు వసుడనై ఈతనికి సేవ చేయుచున్నాను. లక్ష్మణుడను పేరుగల వాడను. చేసిన మేలును మరువని వాడును. సుఖములననుభవింపదగిన వాడును, మహానుభావుడును, జీవులను రక్షించుటయందు ప్రీతిగలవాడును, రాజ్యమును విడిచినవాడునగు నీరాముని యొక్క ప్రియ భార్యయగు సీతను, కామరూపుడైన రాక్షసుడెవడో వనమందు వెఱవక అపహరింపగా, మేమాజానకిని వెదకుచు అడవులకు రాగా ఒకచోట..

## లక్ష్మణుడు హనుమంతునితో శ్రీరాముడు సుగ్రీవుని సాచివ్యమును గోరియుండుటను దెల్పుట

శాపముచే రాక్షస రూపమును పొందిన దనుడనువాడు, మాతో గట్టిగా సీతాదేవి జాడ వానర నాయకుడగు సుగ్రీవుని వలన దెలియగలదు యని చెప్పి యతడు సుఖముగా స్వర్గమునకు వెళ్లెను. ఇది నిజము సుమా. నాకును, జనులచే స్తుతింపబడిన రామునకును సూర్యపుత్రుడే యింక దిక్కుగదా. కపీంద్రా! లోకమునకధిపతియై, పూర్వము ప్రఖ్యాతిగా గొప్ప ధనమును దానముచేయుటచే కీర్తింపబడిన రాముడు, సుగ్రీవుని తనకధిపతిగా కోరెనయ్యా! దీనులకు దిక్కైనవాడును, ధర్మకార్యములందు ప్రీతిగలవాడును అగు రాజు దశరథుడు. ఆ రాజుయొక్క పుత్రుడు అందరకు శరణ్యుడైనవాడు, వానరరాజును శరణుజొచ్చెనయా! వాయుపుత్రా! లోకములకన్నింటికీ ప్రఖ్యాతిగా శరణుడైన ఈ కాకుత్థ్స వంశతిలకుడు మా అన్న సుగ్రీవుని శరణు జొచ్చెను సుమా. ఎవని యనుగ్రహముచే ఈ భూవలయమునందలి జనులెల్లరు సుఖము నొందెదరో ఆ భూభర్తయగు రాముడు వినయముగా వానరారాజు యొక్క అనుగ్రహమును గోరెనయ్యా! మంచివైన సర్వలక్షణములతో నిండిన రాజశ్రేష్ఠులు, ఇంపుగా నెవ్వనిచే బహుమానములను గౌరవములను పొందుచుండిరో, అట్టి దాతలలో శ్రేష్ఠుడును, దశరథ రాజపుత్రుడును, లోకమందు ప్రఖ్యాతినొందినవాడును, నీతి శాలియునైన రాముడు ఇప్పుడు వానరరాజును శరణుగోరుచున్నాడు. లోకములచే మంచిగా పొగడబడినవాడగు

రామచంద్రుడు శోకముచే తిరస్కరింపబడినవాడై సుగ్రీవుని శరణుజొచ్చెను. కరుణావీక్షణములతో అతడీతనిని చేకొనుట అర్హమని జాలితో చెప్పుచు కన్నులనుండి భాష్పములు గార్చుచున్న లక్ష్మణునితో వాయుపుత్రుడిట్లనెను. ఈ విధమైన యింద్రియజయమును, ఇట్టి బుద్ధివైభవమును, ఇటువంటి శీలసంపదయు గల మిమ్ము తన భాగ్యవశమున సూర్యపుత్రుడు జూడగలిగెను. సజ్జనులచే నుతింపబడిన శీలముగల రాజకుమారులారా! ఆ వానరరాజుయొక్క వృత్తాంతమును వినుడు. చెప్పెదను. సుగ్రీవుని అన్నయైన వాలి విరోధమును బూని, కష్టపెట్టి పట్టణమునుండి వెడలదన్ని అతని భార్యనధర్మముగా హరించెను. అందుచే అతడా పదవినొంది అడవులలో బాధ నొందుచుండెను. మీ కిప్పుడు జానకీ దేవిని వెదకు కార్యమునందు నా వంటి వానరుల సహాయముండుటచే తప్పక సాయము చేయగలరు అని తేనెలొలుకు మాటలతో రామచంద్రునికి చెప్పి, హనుమంతుడు వారితో మరల సుగ్రీవుని జూచుటకై చనుదెండు అని పలుకగా, లక్ష్మణుడు సంతసము చెందిన మనస్సుతో తగిన విధముగా హనుమంతుని గొనియాడి రామునితో నిట్లనెను. నిర్మలమైన మనస్సుగల వాయుపుత్రుడు సత్యమునే చెప్పెను. వానరరాజగు సుగ్రీవునకు నీవు చేయవలసిన కార్యము గలదు, గాన నీవు మహానందమును బొందుము. తలంచినపని నెరవేరిన వాడవైతివి. రాఘవా! ముఖమునందు ప్రసన్నతయును, సంతోషముతో చెప్పు మాటల విధమును, మెల్లగా తెలియనట్లుగా చేయుచున్న ప్రసంగము తీరును, చూడగా, ఈ కపిరాజునందు మోసమేదియు గనిపించుటలేదు. రామా! మనమిప్పుడు హనుమంతుడు కోరినట్లక్కడకు బోవుదమా? అని అడుగగా రామచంద్రుడు తథాస్తనగా, హనుమంతుడు వేగముగా భిక్షుకరూపమును విడచి, తన నిజరూపమును ధరించి, ఆ ఇనవంశజులను తన భుజములపై నెక్కించుకొని సంతోషించిన మనస్సు గలవాడును, మంచి తెలివి గలవాడును, తీవ్రమైన వేగముగలవాడునునై, ఆ సుగ్రీవుడున్న చోటునకు తొందరగా వెళ్లి వారలను దించెను.

# ఐదవ సర్గము

## హనుమంతుడు రామలక్ష్మణులను సుగ్రీవునొద్దకు గొనిపోవుట

అట్లు వారల నచ్చట దించి, దినకరపుత్రుని యొద్దకు వెళ్లి, ఓ సూర్యపుత్రా! పవిత్రుడును, మతిమంతుడునగు ఈ రాముడు సూర్యుని వంటి తేజస్సు గలిగిన, తన ప్రేమకు పాత్రుడైన తమ్ముడగు లక్ష్మణునితో గూడ నిన్ను చేరవచ్చెను సుమా. వినుము. ఈతడు గొప్పనైన, సత్యమైన పరాక్రమము గలవాడు. మహాత్ముడు. సూర్యవంశము నందు బుట్టినవాడు. తేజస్సుచే ఇంద్రుని జయించినవాడును, దశరథుని పుత్రుడును, అంతులేని ధర్మబుద్ధి గలవాడును, పితృవాక్య పరిపాలకుడును అగు నీ రాముడు భార్యతో గూడి యడవులందు దిరుగుచుండగా, రావణునిచే భార్య దొంగిలింపబడగా, పవిత్రమైన రాజసూయము మొదలైన యాగములను దీక్షతో నిర్వహించునపుడు లక్ష గోవులను దక్షిణలతో నిచ్చి, గొప్పనైన బుద్ధితోడను, సత్యబలముతోడను, తపస్సు చేతను భూమండలమునేలి గొప్ప కీర్తిని పొందిన రాజపుత్రుడీసమయమున ఓ వానరరాజా! నీ శరణు పొందవచ్చెను సుమా. పూజింపదగిన వారును, పురుషశ్రేష్ఠులును మెచ్చదగిన కీర్తిగలవారును అగు రామలక్ష్మణులు, కపీంద్రా! నీ స్నేహమును గోరి నేడిచ్చటికి వచ్చియున్నారు గాన వారల యొద్దకు వెళ్లి పూజించుమనగా..

## సుగ్రీవుడు రామలక్ష్మణులతో సంభాషించుట

పవనపుత్రుని మాటల వలన సుగ్రీవుడు రాముని వలన భీతిని పోవిడిచిన వాడై, సంతోషముతో, పవిత్రమైన మనుజుని రూపముతో వేగముగా వచ్చెను.

అట్లు వచ్చి ఆ రఘువంశీయులకు స్వచ్ఛమైన మనస్సుతో అర్చనలు చేసి అనురాగము హెచ్చుగా కలుగుచుండగా రాముని జూచి ఆ సూర్యపుత్రుడు ఇట్లు చెప్పెను. మీరు వీరులని, ధర్మగుణమే ప్రధానముగా గలవారని, సర్వభూతముల యందును గొప్ప వాత్సల్యముగలవారలని వాయుపుత్రుడు యధార్థముగా మీ ఎన్నరాని సుగుణములను చెప్పెను. ఓ రాజకుమారులారా! మహాత్ములారా! ఈ వానరుని తోడ స్నేహమును విడవకుండగా మీరు చేయదలంచినచో ఇంతకన్న నెక్కువైన బహుమానమును, ఉత్తమ లాభమును ఎందైన నన్ను పొందునా? నేనే ధన్యుడను. రాఘవా! ఒకటి చెప్పెదను వినుము.

## శ్రీరాముడు సుగ్రీవునితో సఖ్యమొనర్చుట

రామచంద్రా! నీతో స్నేహము చేయుట నీకు పూర్ణముగా ఇష్టమైనచో నా చేతిలో చేయివేయుము. స్థిరమైన మర్యాదతో ఇదే నాచేతిని చూచినాడను. ఆ మాటను విని రాముడు మనస్సునందు సంతోషించి తనయొక్క హస్తమును సుగ్రీవుని కరమునందుంచి గౌరవించెను. హృదయపూర్వకమైన మైత్రితో నాలింగనము చేసికొనెను. అంతట వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు భిక్షుక వేషమును విడిచి సాక్షాత్తు వానర రూపముతో ఆ క్షణమునందే ఇధ్మములు సమకూర్చి అందగ్నిని రగిల్చెను. గణగణ మండుచున్న అగ్నికి వనములలో నుండు పుష్పములతో అర్చనలిచ్చి వారి మధ్య హనుమ నిలువగా రాముడును, సుగ్రీవుడును నిండు కుతూహలంతో, భక్తితో ప్రదక్షిణములు చేసిరి. ఈ విధముగా స్నేహమును చేసి, మనస్సులందు విచారమును విడిచి వారానందముతో నిండిన మనస్సులతో, ప్రశస్తమైన, శుభకరమైన చూపులతో నొకరినొకరు చూచుకొనుచు తృప్తినొందిరి. కఱువున బడినట్లు రఘురాముడును, వానరనాధుడును ఇట్లు అత్యధికమైన సంతోషముగా శరీరమునందు పులకలు గలుగుచుండగా, ఒండొరులను జూచుకొనుచుండగా, కపిరాజు రఘురామునితో "నీ స్నేహమును

పొందితిని. మనయొక్క సుఖములును, దుఃఖములును కలిసిపోయినవి" అని పలికెను. ఇట్లు పలికి వానరరాజు చాల ఆకులుగలిగి, గొప్పగా పువ్వులతో నున్న చెట్టు కొమ్మను విరిచి భూమిమీద పడవేసి, దానిమీద మంచి మనస్సుతో రామునితో గలిసి మెల్లగా కూర్చుండెను. హనుమంతుడును అప్పుడొక చందనపు చెట్టుకొమ్మ తేగా, రాముని తమ్ముడు ప్రేమతో తగిన విధముగా అందు గూర్చుండెను. అప్పుడు రామునితో వినయముగలవాడై

## సుగ్రీవుడు రామునితో తనకు వాలి చేసిన యపకారము తెల్పుట

సూర్యనందనుడు ప్రేమతో నిట్లు చెప్పెను. సీతానాథా! నా అగ్రజుడు భయంకరమైన పరాక్రమము గలవాడును నగు వాలి నాయందు ఈర్ష్య గలవాడై, రాజ్యమునుండి వెడలగొట్టి, నా భార్యను హరించి, క్రూరముగా నెట్టివేయగా గొండలయందును, గుట్టలయందును ప్రాణభీతితో నిట్లాడుచున్నాడను. ఓ జనకపుత్రీ ప్రాణవల్లభా! నీ చల్లని కరుణార్ద్రమైన చూపుతో వాలి వలన భయము నాయెదనుండి తొలగి పోవునట్లుగా నాకు ప్రాణదానమును చేయుము అని పలుకగా ధర్మజ్ఞుడును, ధర్మము నందు గొప్ప ప్రీతి గలవాడును అయిన కాకుస్థ వంశజుడు, ముఖమున చిరునవ్వు వెలయుచుండగా వానర రాజునకు సంతసము కలుగునట్లు పలికెను.

## శ్రీరాముడు సుగ్రీవునితో వాలిని చంప ప్రతిజ్ఞ చేయుట

మిత్రతత్వము యొక్క ఫలము ఉపకారమే. కపినాయకా! నేను చక్కగా నెఱుగుదును. నీ భార్యని హరించిన దుష్ట చరిత్రుడగు వాలిని చంపెదను. వెఱవకుము. రాపులుగు రెక్కలు గట్టిన నా బాణముల యోఘములు మిక్కిలి వాడియైన మొనలు గలిగినవి. చక్కనైన కణుపులు గలవి. దుష్టాత్ముని గొప్ప రోషముతోనున్న సర్పముల వలె చంపివేయును. ఇదిగో ఈ ఘోరబాణములచే

చంపబడి మదము నశించినట్లుగా, విరిగిన పర్వతమువలె నేలరాలగా, కన్నులార చూడుము. అని పలుకగా సంతుష్టుడై సుగ్రీవుడు రఘురామునితో నిట్లనెను. నీ ప్రసాదముచేత నా భార్యామణియు, పవిత్రమైన రాజ్యరమయు సంప్రాప్తించినచో సంతోషించెదను. ఏ పద్ధతితో నా విరోధియైన వాలిని చప్పున చంపవచ్చునో, ఆ పద్ధతిని ఓ వేగవంతములగు బాణములు గలవాడా! వేగముగా జేసి నాయొక్క విపరీతమైన దుఃఖములను బాపి, రక్షింపుము అనగా ఆ ప్రసంగము జరుగునప్పుడు పద్మసమానమైన జానకీదేవి యెడమకన్నును, వానరరాజగు వాలి యొక్క బంగారు వర్ణము గల యెడమకన్నును, రాక్షసరాజైన రావణుని యొక్క అగ్నిసమానమైన యెడమకన్నును తక్షణమే అదిరినవి.



# ఆఱవ సర్గము

## సుగ్రీవుడు శ్రీరామునితో సీతను తాను గొనివచ్చునట్లు చెప్పుట

మఱల సూర్యనందనుడు రామునితో సంతోషముతో నిట్లనెను. నాయొక్క మంత్రిసత్తముడగు వాయుపుత్రుడు మీరలడవికి వచ్చినట్టి కారణమును దెల్పెను. మిథిలా రాజపుత్రియైన సీతతోడను, తమ్ముడైన సౌమిత్రి తోడను నీవడవిలో తిరుగుచుండగా, దుర్మార్గుడైన రాక్షసుడు, మీరలు చెంత లేని సమయమును గనిపెట్టి నీ భార్యనెత్తుకొని పోవుచు పక్షిరాజైన జటాయువును జంపి వెళ్లెననియు దెల్పెను. ఓ అనఘా! నీకు భార్యా వియోగము వలన గలిగిన దుఃఖమును నేను పోగొట్టెదను. నీవింక విచారింపనేల? సదాచార పరాయణురాలగు ఆ కృశోదరిని ఆ దుష్టాత్ముడెక్కడనైన దాచుగాక, మరుగున పడిన వేదములవలె నామెను స్పష్టముగా మరల దెత్తును. విచారింపకుమయ్యా! రసాతలమున నుండినను, ఆకాశమున నుండినను ఓ సూర్యవంశదీపకా! ఆ అర్థచంద్రుని వంటి నుదురులుగల సీతాదేవిని తెచ్చి నీకర్పించెదను. నా సత్యవాక్యములను నమ్ముము. రామా! రాక్షసులు, దేవతలు నొక్కటై విరోధము పూనినను భూపుత్రినపహరించి జీర్ణించుకోగలరా? విషము గలిసిన భక్ష్య మెచ్చటనైన జీర్ణమగునటయ్యా? భక్షించిన వారిని వేగముగా వినాశమొందించును గదా. ప్రఖ్యాతి గలిగిన శౌర్యముగల రామా! దుఃఖమును విడిచిపెట్టుము. నీ భార్యని నేను తెచ్చి యిచ్చెదను. వేగవేగముగా పంక్తికంఠుడొక స్త్రీని, లక్ష్మణా! రామా! రామా! యని భయముతో తన యొడిలోనుండి వికృత స్వరముతో విలపించుచుండగా ఆకాశమున పరువెత్తెను. ఆ బిత్తరి సీతయే యని ఈనాడు తెలిసినది. ఓ రాజా! పరువెత్తుచున్న దశముఖుని యొడిలోనుండి ఆడసర్పము

వలే వ్రేలాడుచు వణికి పోవుచున్న స్త్రీని పర్వతముపైనున్న నేనును, మిగిలిన నలుగురము జూచితిమి.

**సుగ్రీవుడు శ్రీరామునకు సీతాదేవి వైచిన భూషణములను జూపుట**

ఆ మీననేత్రయు మమ్ము జూచి తన యుత్తరీయమునందు తన భూషణములను మూటగా గట్టి పారవేసెను. నేను వాటినన్నింటిని పర్వత గుహలలో దాచితిని. అవి నీ భార్యవేమో చూడుము. వాటిని తెచ్చుటకు పంపెదను అని చెప్పగా రామచంద్రుడు ఏలనయ్యా! ఆలస్యము. తొందరగా తెప్పింపుము మిత్రమా! అనగా ఆ సూర్యనందనుడు వెళ్లి భూషణములను దెచ్చి ఇవిగో చూడుమని చూపించెను. చీర చెరగున గట్టిన ఆ భూషణములను చేతితో దీసికొని కన్నీరు మంచు చంద్రుని గప్పినట్లు కన్నులను గప్పగా, చూపుపారని వాడై, హా! రమణీ! ప్రియా! యని పలుకుచు ఆరాటముతో ఆ యలంకారములను రొమ్మునందొత్తికొనుచు రోషముతో బిలములో నున్న పాము వగర్చునట్లు నిట్టూర్చెను. గొప్ప మూర్ఛయందు మునిగియుండి తేరుకొని తమ్ముని జూచి క్రూరాత్ముడైన రాక్షసుడు తన్ను తీసుకొని వెళ్లుచుండగా, లక్ష్మణా! సీత తన శరీరముననున్న అలంకారములు భూమిమీద పడవేసి వెళ్లినది. వీనిని పచ్చికబయలునందు జానకి పడవేయుటచే నిజముగా ఈ సకలమైన విభూషణములన్నియు చెక్కుచెదరక క్రొత్తవానివలె పూర్వమున్నటులే యున్నవి చూడుమా! అని అన్న చెప్పగా లక్ష్మణుడును తన యన్నతో నిట్లనెను. ఓ అనఘా! ఆ సీతాదేవి యొక్క కేయూరములను నేను గుర్తుపట్టలేను. ఈ అందమైన కుండలములను గూడ గుర్తింపలేనయ్యా! ఆ సీతాదేవిని నేను నిత్యము పాదాభివందనము చేయుదును గాన ఆమెవే ఈయందియులు నేనెఱుగుదును.

**శ్రీరాముడు సుగ్రీవుని రావణ వృత్తాంత మడుగుట**

అని లక్ష్మణుడు చెప్పగా ఎక్కువైన ఆరాటముతో సూర్యపుత్రుని జూచి

స్నేహితుడా! నా ప్రాణములకంటెను ప్రియమైన ప్రియురాలిని రాక్షసుడు తీసికొని వెళ్లుచుండగా నీ వెచ్చట జూచితివయ్యా! ఈ దుఃఖము గలుగజేసిన ఆ వంచకుడెచ్చట నుండును? పరివారసహితముగా వానిని నాశనము చేసెదను. జానకిని దొంగిలించి పెద్ద విచారమును గలుగజేసి దోషమును నెక్కువగా పెంచుకొని, తన యౌద్ధత్యముతో తానే తన మృత్యుదేవత యొక్క యింటి ద్వారము గడియమ్రానును తొందరగా దొలగిలించుకొన్న ఆ రాక్షసుని మూలముగా లోకమున దానవులు లేకుండ చేసెదను. సుగ్రీవా! చెప్పుము. వనమునందు దొంగవలె బలవంతముగా నా జానకిని దొంగిలించిన ఆ రాక్షసుని బట్టి యిప్పుడే చంపివేసెదను.



# ఏడవ సర్గము

## సుగ్రీవుడు శ్రీరామునకు ధైర్యము చెప్పుట

అని పల్కగా సుగ్రీవుడు కన్నీటిచే అడ్డగింపబడిన కంఠము గలవాడై అయ్యా! నిజముగా నేనా దానవనాధుని నివాసమును, బలమును, అతని సామర్థ్యమును, శక్తిని, ఆ నీచుని దుర్మార్గమైన కులమును గాని నేయెఱుగను. (రాముని తొందరపాటును, కార్యభారమును, సాధనమార్గమును నాలోచించి సుగ్రీవుడిట్లు సత్యము చెప్పెను. ఇట్టిదిఅసత్యమనబడదు.) గానిమ్ము. అయిన నేమైనది? నీ భార్యా రత్నమేవిధముగా నైనను నిన్ను గలిసికొను మార్గమును కలుగజేసెదను. నన్ను నమ్ముము. నా ప్రతిజ్ఞను వినుము. నీ యనుగు భార్యను వెదకి, ఎందున్నను, ఆ రాక్షసుని బంధువులతోడను, పుత్రులతోడను, మిత్రులతోడను యుద్ధరంగమున జంపి, నీ మనస్సు సంతోషము పొందునట్లుగా నా శౌర్యమును చూపించి శ్రీఘ్రముగా, నీ ప్రేయసి నిన్ను కలియునట్లు చేసెదను. తండ్రీ! నా మాటలను నమ్ముము. దుఃఖించకుమయ్యా! ధైర్యమును విడువకుము. స్థైర్యమును, శౌర్యమును వీడకుమయ్యా! నీ మహత్వము చెడునట్లుగా వేదనతో కృంగిపోకుము. దేవా! నీ వంటి మహాత్ములీవిధముగా కుందుదురా? అయ్యా! నీ మనస్సునందెఱుగవా? విచారమే ఎచ్చటనైనను తేలికతనమునకు గారణము సుమా. భార్యను పోగొట్టుకొని నేనును పెద్ద చిక్కులతో బాధపడుటలేదా? ఇట్లు ఏడ్చుచున్నాడనా? రాజా! ధైర్యమును వీడినాడనా? మూఢుడను వానరుడను నేను. అయినను భార్యకై దుఃఖించుట లేదు. మంచి నీతి తెలిసిన వారిలో ప్రోడవు. ధైర్యము గలవాడవు. ఇట్లుండుట నీకు తగునా మహాత్మా!

కారిపోవుచున్న కన్నీటికి గొప్ప ధైర్యముచే అడ్డుకట్ట వేసి మరలించుట తగునయ్యా! సత్యముగలవాడు ఏ అవస్థయందైనను ధైర్యము విడనాడుట తగునటయ్యా? వ్యసనమునందును, అర్థనాశనమునందును, ప్రాణాపాయసమయమందును, భయమునందును, ధీరుడు తన బుద్ధివైభవముతో ప్రకాశించునయ్యా! ఎప్పుడును దుఃఖించు బుద్ధిహీనుడు బరువైన ఓడ నీటియందు మునిగినట్లు శోక సముద్రమున మునిగిపోవునయ్యా! ఓ పుణ్యచరిత్రుడా! చేతులు జోడించి వేడుకొనెదను. స్నేహమును మనస్సునందు తలచి నన్ను మన్నించవయ్యా! కొంచెమైనను విచారమునకు చోటు నీయకుమయ్యా! జ్ఞానివర్యా! పౌరుషమునే ఆధారముగా గ్రహింపుమయ్యా! ఓ సూర్యవంశోత్తమా! శోకముతోనే యున్న వానికి సౌఖ్యములు లేవు సుమా. శోకమునందు మునిగిన చిత్తముగలవాని గొప్ప తేజమంతయు నశించును సుమా. శోకభారముచే ఆపన్నుడైనవానికి జీవితమే సంశయము సుమా. కావున, ఓ శత్రుసంహారి! శోకమును విడిచి ధైర్యమును వహింపుము. స్నేహభావముచే మంచి నిట్లు జెప్పబూనితిని, గాని రామచంద్రా! సందేహము లేదు. నీకు ఉపదేశము చేయుటకు నేనెంతవాడ నయ్యా! నా స్నేహమును గౌరవించి యిట్లు నేను చెప్పిన మాటలను మన్నించి ఓ రాజనందనా! మోహమును, మనస్సులందలి యీ పరితాపమును విడిచి పుచ్చుము. ఇట్లు స్నేహమును, ప్రేమయును ప్రకటమగునట్లుగా, సూర్యపుత్రుడు పల్కగా కలువల వలె విడువక కారుచున్న కన్నీటిని చెరగుచే వేగముగా తుడిచి సహజమైన చిత్తముతో కోతిరాజును ఆ సూర్యవంశ్యుడు దగ్గరకు దీసిగొని ప్రేమతో గ్రుచ్చి కౌగిలించుకొని యిట్లు పలికెను. వయస్యా! ప్రేమతో మిత్రుడైన వాడు మేలుకోరువాడు. ఏది చేయుట తగియున్నదో, నీవు కపటము లేక ఆ పనులందు పూనికతో ఆ యుక్తమైన కార్యమునే యొనర్చితివి. నను దుఃఖము నుండి తేరుకొన జేసితివి. మిత్రమా! అవసరమైన వేళలందాదుకొనువారే బంధువులు సుమా. ఇట్టి హితుడైన చుట్టము నాకెక్కడ లభ్యమగును? అందులో ఈ విధముగా ఆపదలలో హీనత్వమును పొందినవేళ, అక్కటా నీవు నిజమైన

చుట్టానివి. నీ మాటలచే నా మనస్సు నిర్మలత్వమును బొందెను. జానకిని దుష్టబుద్ధిగలవాడును, క్రూరమైన కర్మలాచరించువాడును అగు రాక్షసుని వేగముగా వెదకుటకు నీవింక ప్రయత్నము చేయుము. ఇప్పుడు నన్నేమి చేయమందువో చెప్పుము. సందేహింపకుము. వానకాలమందున్ని సిద్ధముగా నుంచిన, మంచిదైన మడి విధముగా నన్ను దలంపుము మిత్రమా. ఎక్కువైన అభిమానముతో నేనిప్పుడు చెప్పిన మాటలన్నిటిని ఓ కపివరా! ఏమో లెమ్మని త్రోసివేయకుము. యధార్థమని భావింపుము. ఇది వఱకు నేనసత్యము చెప్పలేదు. ఇప్పుడాడుటలేదు. ఇంక ఎన్నడైనను ఆడబోను. స్నేహితుడా! సందేహమును వీడుము. ఓ స్వచ్ఛమైన చరిత్రగలవాడా! సత్యము మీద శపథముచేసి చెప్పెదను. ఇంపైన రాముని మాటలను, ప్రతిజ్ఞయు విని వానరరాజును, అతని మంత్రులును ఎక్కువైన సంతోషమును పొందిరి. ఈ విధముగా కపినాధుడును, నరనాధుడును, ఏకాంతమున తమతమ అధికములైన బాధలను తలంచుకొన సాగిరి. అంతట సూర్యపుత్రుడు తన మనస్సునందు తన పని నెరవేరినది – నిజంబని మనస్సులో తలంచెను.



# ఎనిమిదవ సర్గము

## సుగ్రీవుడు శ్రీరామునితోడి మైత్రిని గొనియాడుట

సౌమిత్రి వినుచుండగా కపిరాజగు సుగ్రీవుడు జానకీజానితో నిట్లనెను. నీయట్టి మహానుభావుడు మిత్రుడుగా లభించుట కొంచమాలోచించినచో నేను దేవతలకైనను అనుగ్రహింపదగిన వాడనైతిని. నీ సహాయముచేత నాకు స్వర్గరాజ్యమైనను సులభముగా లభించును. ఇక నా రాజ్యము మాట చెప్పనేలా? ఓ రాజోత్తమా! రఘుకులమందు రత్నము వంటి వాడవైన నీతో నేడు స్నేహము కలుగుటచే నేను, నా బంధు సంఘములకును, ప్రాణమిత్రులకును ఓ పూజ్యశీలా! పూజ్యతముడనైతిని. దేవతలచేత నుతింపబడు రామచంద్రా! నేను నీకు తగిన మిత్రుడనని నీవు క్రమక్రమముగా తెలియగలదు. నా గుణములను చెప్పుకొనుటకు నా మనస్సంగీకరించదు. నీ వంటి వారిచే ధన్యులు గావింపబడిన వారికి అత్యధికమైన ప్రీతి జ్ఞానులయందు ధృతివలె నిశ్చయముగా నుండగలదు. సాధువులగు స్నేహితుల గొప్ప ధనసంపదలను, వెండిని, బంగారమును, ఆభరణములను సాధువులగు వారు ఎట్టి భేదము లేని బుద్ధితో భావించెదరు గదా. గొప్ప గుణములు గలవాడా! గొప్ప ధనికుడు గాని, నిరుపేదగాని, గొప్పదుఃఖము గలవాడో, సుఖములను పొందుచున్నవాడో, నిందితములైన దోషములు చేసినవాడో, దోషములు లేనివాడో, ఎట్టివాడైనను స్నేహితుడొక్కడే పరమమైన గతిగదయ్యా! ధనముపోయినను, గొప్పసుఖములు నశించి పోయినను, తన శరీరమే నశించిపోయినను వ్యక్తి తన మిత్రుని కార్యములను చేయదగియుండును. అని ప్రియముగా మాటలాడుచున్న సుగ్రీవుని వచనముల నాలకించి ఇంద్రసమాన కాంతి గలవాడగు సుమిత్రా తనయుడు వినుచుండగా,

అవునయ్యా సుగ్రీవా! యని రామచంద్రుడును పల్కెను. అంత సూర్యనందనుడు అప్పటినుండి చెట్టుకొమ్మపై కూర్చున్న రామలక్ష్మణులను చూచి సుకుమారమైన చెట్టుకొమ్మ కొఱకు నలుదిక్కులను గలయ జూచి కొలది దూరమున పువ్వులచే నిండి యుండి, యాకులెక్కువగా లేకుండా మదించిన తుమ్మెదలతో నున్న చెట్టుకొమ్మనొక దానిని తెచ్చివేయగా రామచంద్రుడు దానిపై కూర్చుండెను. అట్టి కొమ్మను వేరొక దానిని హనుమంతుడు తెచ్చివేయగా లక్ష్మణుడందు గూర్చుండెను. ఇట్లందఱు సుఖముగా కూర్చొని యుండగా సూర్య వంశజునితో సూర్యపుత్రుడిట్లనెను. వైరము చేత నా అన్న నన్ను పురము నుండి వెడల గొట్టి, నా భార్యను హరింపగా ప్రాణభయముచే తలదాచుకొనుటకై ఋష్యమూక పర్వత శిఖరమున దుఃఖముతో నిట్లున్నాడను. జగత్తులకెల్ల భయమును తొలగించు వాడా ! అనాథుడను, దీనుడను అగు నన్ను పాలన సేయుము. అనగా విని రామభద్రుడు చిరునవ్వు నవ్వుచూ ఇట్లనెను. ఓ అనఘా! మేలుచేయుటనన్నది స్నేహితుని లక్షణము. కీడు చేయుటయే శత్రులక్షణ మనబడును. నీ భార్యను దొంగిలించినట్టి మూర్ఖుని ఇదిగో ఇప్పుడే వధించెదను చూడుము. మనస్సు నందు విచారింపనేలా? గొప్ప వేగముగలవి, గొప్ప ప్రకాశము గలవి, భయంకరమైన రూపముగలవి, బంగారు పుంఖములు గలవి, కందవనమున బుట్టినవి, ఇంద్రుని వజ్రాయుధము వంటివి, కోపించిన ఉగ్ర సర్పముల వలె వాడియైన మొనలుగలవి యైన నా బాణములు ఓయీ ధృతిమంతుడా! వాలిని సంహరించును. భయమును మానుము. సూర్యనందనా! పాప బుద్ధిగల వాలి వజ్రాయుధపు దెబ్బచే గూలెడి పర్వతమువలె నేలగూలగా సంతోషముతో ముఖము ప్రకాశింపగా, చూచి ఆనందము పొందెదవు గాక. అని చెప్పుచున్న రాముని వచనములు విని సుగ్రీవుడు సంతోషముతో వికసించిన ముఖము గలవాడై ఆ పద్మాక్షుని మేలు మేలని సవినయముగా ప్రేమతో ప్రశంసించి మఱియు నిట్లనెను. దేవా! శోకము చేత ఆర్తినొందిన వారలకు

నీవే గతివగుదువట. నీవు స్నేహితుడవగుట చేతను, నేను శోక నిహతుడ నగుట చేతను, నీ దైన్యము తెలియుటకై యిట్లు పరిదేవన మొనరించుచున్నాను. అగ్నిసాక్షిగా చేతియందు చేతిని వేసి స్నేహము చేసికొనుటచే ప్రాణదానము చేసెదనని స్పష్టముగా అభయమొసంగుట చేతను ధైర్యముతో దేవరయే ప్రాణమిత్రమని మనస్సునందు నమ్మి, నా యొక్క మనస్సు నందు అగ్నిహోత్రుని వలె నెల్లప్పుడు మాడ్చుచున్న దుఃఖమును చెప్పికొనదలంచితిని. అని ఇంతవఱకు చెప్పి పద్మముల వంటి కన్నులందు భాష్పములు కాలువలై కారుచుండగా ఎక్కువగా గొంతు తడబడగా ఆ వానరరాజు ఒక్కమాటయైనను పలుకలేకుండెను. ధీరుడగు సుగ్రీవుడు కనుల నీరు తుడుచుకొని పెద్దగా నిట్టూర్పులు విడుచుచూ రఘురామునితో తిరిగి తన కథ నిట్లు చెప్పదొడగెను.

## శ్రీరామునితో సుగ్రీవుడు వాలి తనను పరాభవించిన విధము చెప్పుట

రామచంద్రా! వినవయ్యా! ఆ వాలి తాను రాజై రాజ్యమేలుచుండగా నేను యువ రాజునై యుండునప్పుడు అనేకములైన దుష్టపు మాటలతో దూషించి క్రూరాత్ముడై నన్ను వెడలగొట్టినాడు. నా ప్రాణములకంటెను ప్రియమైన ఇల్లాలిని హరించినాడు. నా ప్రియమైన మిత్రులను, బంధువులను తాను చెరసాల యందు పెట్టించినాడు. విడువక నా ప్రాణములు మీద కన్నుంచినాడు. నన్ను చంపుటకై చాలమందిని పంపినాడు. చెడు ఉపాయముల నెన్నింటినో చేసినాడు. అతడు చేయుచున్న కీడిట్టిదని చెప్పరానిది. ఆతడెందరినో పంపగా పంపగా, నేనేందరనో చంపగా చంపగా, రామచంద్ర ! కాలమిట్లు వెళ్ళుచున్నది. అందు చేతనే కదా ఈ వానరులను, నేనును, మిమ్ములను, జూచినంతనే భయముచే తల్లడిల్లితిమి. భయముచే నెవ్వడు కలత చెందకుండును? కేవలము ఈ హనుమంతుడు మొదలగు వానర శ్రేష్ఠులు తగిన సహాయులుగా నుండుటచే అనేక కష్టములతో బాధ పడుచున్నను జీవించి యున్నాడను. నా మంత్రులగు వీరు నేను నడచినచో

నడతురు, నిలిచినచో నిలుచుదురు. ఓ బంధుశ్రేష్ఠుడా ! మంచి చరిత్ర గల వీరు ఇట్లు నా ప్రాణములను కాపాడుచున్నారు సుమా. ఇక నేనేక్కువగా చెప్పుటేలా ? ఓ జగదీశ్వరా! క్లుప్తముగా చెప్పెదను. వాలి గొప్ప పరాక్రమముగలిగినవాడు. సూర్యుని వంటి తేజస్సు గలవాడు. శత్రువుల పాలిట అగ్నిహోత్రుడు. అట్టి వాలి చంపబడి నేలబడిన గాని నా యొక్క దుఃఖములు తగ్గునా? హాయిగా భుజింపగలనా? సుఖముగా నిద్ర పోగలనా? నాకున్న బాధలచే చెప్పితిని గాని భూమి యందు సుఖముగాని, దుఃఖముగాని చెలికానికి చెలికాడే దిక్కు సుమా. అని చెప్పగానే అంతయు విని రాముడిట్లనెను. సుగ్రీవా! వాలితో నీకింత వైరమెందుకు గలిగినది. అంతయును చెప్పుము. విని నేనంతట బలాబలములను ఆలోచించి కార్యమును చక్క చేసెదను. చింతింపబోకుము. ధైర్యము వహించి మొదటినుండి క్రమముగా చెప్పుము. నీకవమానకరమైన కథను విన్నంతనే నా మనస్సునందు విడువని తీవ్రమైన ఆగ్రహము కలిగినది. వర్షాకాలమున వేగముగా పరువెట్టు జలము వలె నా మనస్సు కంపించెను. ఓ వానరరాజా! నీ శత్రువును, నా విరోధియని నిజముగా నమ్ముము. విల్లు నేనెక్కుపెట్టక ముందే నీ విషయమును తెలుపుము. వింటి నారి నుండి నా బాణము వెలువడినచో నీ వైరి నేలగూలెనని నమ్ముము. అని రామ చంద్రుడు పల్కగా సూర్య పుత్రుడు తన మంత్రులతో గూడ సంతుష్ఠుడై తనకు, తన యన్నకును కలిగిన విరోధము యొక్క కథను వినిపించసాగెను.



# తొమ్మిదవ సర్గము

## సుగ్రీవుడు శ్రీరామునితో వాలికి తనకు విరోధము వచ్చిన కారణమును చెప్పుట

గొప్ప గుణములు కలిగిన మా తండ్రికి వాలి జ్యేష్ఠ పుత్రుడు. నేను చిన్న వాడను. పూర్వము మా తండ్రికిని, నాకును వాలి ఎక్కువగా ప్రేమింపదగినవాడై యుండెను. మా తండ్రి చనిపోగానే మంత్రులును, పౌరులును మా అన్నయైన వాలిని గొప్పదైన వానర రాజ్యమందు సర్వ సమ్మతముగా పట్టాభిషిక్తుని జేసిరి. పూర్వ సంపదయైన రాజ్యమును వాలి నీతితోడను, నేర్పుతోడను పాలించు చుండగా, ఆ వాలిని నేను శ్రేయస్సు గోరిన మనస్సు గలవాడినై వినయముతో సేవకునిరీతి తోచునట్లు మెలకువతో ఎల్లవేళలందు సేవించుచుంటిని. రాజపుత్రా! ఈ విధముగా గొంతకాలము జరిగిన తరువాత దుందుభి యను వాని అన్నయు, మయుడను వాని పుత్రుడును అగు మాయావి అను పేరు గలవాడు ఒక స్త్రీని గూర్చి గొప్ప వైరము గల్గుటచే ఒకనాటి అర్ధరాత్రి జనులెల్లరు నిద్రపోవుచుండగా వాలి మీదకు బలగర్వముతో యుద్ధమునకు వచ్చెను. కిష్కింధా పట్టణ ద్వారమున భయములేకుండా ఆ దానవుడు నిలబడి మేఘము వలె ధ్వని చేయగా వాలి దావాగ్ని వలె చిటమటలాడుచు నిద్ర మేల్కొని ఆ ధ్వనిని విని, మండిపడుచూ దిగ్గున లేచి రోషముతో పాన్పుమీదనుండి దూకి వేగముగా అతని మీదకు వెళ్ళగా, స్త్రీలును, నేనునూ వినయముతో మ్రొక్కుచూ నిది సమయము కాదు నిలువుమని చెప్పుచున్ననూ వినక హుమ్మనుచు మమ్మల్ను త్రోసివేసి వేగముగా వెళ్ళెను. ఒంటరిగా వెళ్ళుచున్న వానిని చూచి మనస్సు నందున భక్తిచే నేను వెనుక వెళ్ళితిని. దూరమున నున్న నన్నునూ, మీదకు వచ్చుచున్న వాలిని చూచి మనస్సునందు భయముకలుగుటచే దానవుడతి

వేగముతో పరువెత్తసాగెను. ఆకాశముననున్న చంద్రుని వెలుగుతో దారి కనిపించుచుండగా మేమునూ వెనుకగా తరుముకొని వెళ్ళితిమి. వీరుడైన ఆ రాక్షసుడు అంత, లతలతో కప్పడినదియును, ప్రవేశింపరానిదియు నగు భూమియందలి యొక్క బిలమును చూచి అందు ప్రవేశించెను సుమా. మా యన్న గూడ దాని వెంట బోదలచి నన్ను చూసి ఇట్లు చెప్పెను. నీవిక నా వెంట రాకుము. ఇచ్చటనే నిలువుము. ఈ రాక్షసుని జంపి వేగముగా వచ్చెదను. అని చెప్పగా, నేను కూడా నీవెంట వచ్చెదనని యెంత బ్రతిమాలినను వినడయ్యెను. నీవు నా వెంట వచ్చినచో నా పాదములపై ఆన యని శపథము చేసెను. రాజా! నేనట్లు బిలద్వారమునందే నిలుచుండగా, వాలి మహా పరాక్రమముతో, క్రోధముతో అతనితో పోరుటకై బిలము లోనికి ప్రవేశించెను. నరేంద్రా! అట్లు నేనొక్క యేడాది బిలద్వారమున నుంటిని. వికృతముగా బిలములో నుండి నూరువులతో నెత్తురులు రాదొడగెను. ప్రకటముగా రాక్షసుల గర్జనలు వినవచ్చెను. యుద్ధమునందు మర్ధింప బడినవాడై, వికటమైన కేకలతో అరచుచున్నట్లుగా ధ్వనులు వచ్చెను. ఓ పృధ్వీశా ! బలము నశించి వాలి రాక్షసుని చేతిలో పడి మరణించెనని తలంచి చింతతో మనశ్శంతయూ తపించి పోవుచుండగా, ఆ బిలద్వారమును ఓ కొండతో మూసి గొప్ప దుఃఖముతో ఉదక క్రియలను చేసి మెల్లగా పట్టణమునకు వచ్చి నేను ఆ వాలి చరిత్రను ఎవ్వరికీ వెలుపరింతనైతిని. ఎట్టకేలకు మంత్రులందరును ఎట్లెట్లో ఆ వృత్తాంత మంతయు తెలుసుకొని, నన్ను రాజ్యమునందు నిలిపిరి. నేనునూ న్యాయము తప్పక రాజ్యమునేలుచుంటిని. దైత్యుని సంహరించి గొప్ప బలవంతుడగు వాలి తరువాత వచ్చెను. పట్టాభిషిక్తుడనైన నన్ను జూచి కలతజెందిన మనస్సుతో కోపముతో నన్ను జూచి యిట్లనెను. ఏరా దుర్మతీ ! నీవు తమ్ముడవని తలంచి కదా గృహద్వారమునందు నిన్ను ఉంచితిని. బలవంతుడైన విరోధితో పోరాడు చున్న నన్ను విడిచి, గొప్ప పర్వతముతో బిలమును నేను వెలుపలికి

రాకుండనట్లుగా మూసివేసి వచ్చి ఇచ్చట ఐశ్వర్య భోగములందు లోలుడవై ఉన్నాడవు. నీవు తమ్ముడవా? చెనటీ! యని నన్ను తిట్టి, వేగముగా నాకాప్తులైన మంత్రులందరును మూర్ఛనొందునట్లుపట్టి చెరసాలలో ద్రోసెను. ఆ విధముగా విజృంభించుచున్న యతనిని తగువిధముగా ఎదుర్కొను గల బలము గలిగియుండియు నా అన్న గదా యను భక్తితో పుణ్యమునకు దలంచుటయే ప్రాణము మీదకు వచ్చినది. శౌర్యముతో రాక్షసాధముని మదముసణచి, చంపి పురమునకు వచ్చుచున్న ఆ బలశాలికి నేనెదురు వెళ్ళి భక్తితో నమస్కరింపగా తాను నాతో నొక మంచి మాట అనలేదు. గుర్రని మూతి బిగించుకొనుచు నా వంక జూడనైన జూడదు. మనస్సునందు కొంచమైనను ప్రసన్నత నొందదు.



# పదియవ సర్గము

**తి**రిగి దుర్మార్గమైన ఆగ్రహముతో మండిపడుచున్న వానర రాజుకు మంచి మాటలతో మనవి చేసితిని. భక్తితో అతని పాదములపై కఱ్ఱవలే పడితిని. మహా పరాక్రమశాలీ! మా అదృష్టముచే విరోధి యైన మాయావిని చంపి వచ్చితివా! దిక్కులేని వారికెల్ల దిక్కుగా నీవే ఈ యనాధునకు గూడ నెప్పుడును దిక్కు సుమా. బహు శలాకలు గలిగి చంద్రుని వలె తెల్లగా ప్రకాశించుచున్న గొడుగును నే పట్టెదను. నీవు రాజ్యమును తీసికొనుము. ఓ నిర్మలమైన మనసు కలవాడా! ఓ రాజా! యొక్క యేడాది నేను బిలద్వారము నందార్తితో నుండితిని. అంత నెత్తురులు కాలువలై అంతకంతకు అధికమై పార సాగెను. ఆ రాక్షసుల గోల వినవచ్చెను గాని నీ మాటలు రవంతయయినను వినలేకుంటిని. దుఃఖ సముద్రములో బడి కొట్టుకొను చుంటిని.

కొండనొకదానిని తీసుకొని వచ్చి గుహ ద్వారము నందు పడవైచి దుఃఖముచే తపించి తపించి మనసు కలవరపడు చుండగా కలత జెంది అందు నిలవలేక పురమునకు వచ్చితిని. పురుషశ్రేష్ఠా ! ఇది నిజము. దుఃఖము ముఖము నందు కనిపించుచుండగా వచ్చిన నన్ను జూచి మంత్రులు వలదోయని నేను వారించినను వినక రాజ్యమున నన్నుంచిరి. దేవా! నన్ను దయతో చూడుము. అన్నా! నీవు రాజువగుము. పూర్వము వలెనే నేను యువరాజు నయ్యెదను. ఏ రాజును లేకున్నచో రాజ్యమరాచకము అగునని మంత్రి సత్తములు ఆలోచన జేసి నన్నిట్లు నియోగించిరి. నేనీ రాజత్వమును కోరలేదు. ఇది నిజము. తిరిగి రాజ్యమును తీసుకొనుము. నన్ను క్షమింపుము. అన్నా ! నేను నీ తమ్ముడను. నీ యడల ద్రోహమేదియును తలపబోను. నన్ను మన్నింప దగును. నీ పాదముల

మీద పడదెను. చేతులు జోడించెదను అని నేను పలుకగా ఆ వాలి కొంచమైనను కన్నులెఱ్రజేయుటను వీడడు. ధిక్కారమును మానడు. రామా! అతడు తరువాత నన్ను ఎన్నెన్నో మాటలనెను. ప్రజలను, మంత్రులను పిలిచి సభ చేసి నన్ను చూపించి వారలతో నిట్లనెను. ఒక అర్ధరాత్రి ఒక రాక్షసుడు యుద్ధమును చేయగోరిన వాడై వికృతముగా నన్ను పిలవగా వేగముగా నేనింట్ల వీడి వెళ్ళగా ఈ పాపపు తలపు గలవాడు నా వెనుకనే వచ్చుట మీరెరుగుదురు గదా. మా ఇద్దరినీ చూచి ఆ మాయావి భయము చెందెను. వాడు పారిపోవు చుండగా వానిని విడువక వాని వెనుకనే నేను వెళ్ళితిని. ఈ పాపశీలుడు కూడా నా వెంటనే వచ్చెను సుమా. ఆ విధముగా పరువెత్తి పోయి అడవి మధ్యలో భూమియందలి బిలములోని కా బలవంతుడు ప్రవేశించెను. నేనును మనస్సు నందలి పగను వీడక వాని వెంటనే వెళ్లదలచి ఈ దుష్టునితో నేను రాక్షసుని జంపి వచ్చు దాకా నీవిచ్చటనే యుండుము. నేను శత్రువుని జంపకుండా మన పట్టణమును ప్రవేశింపను అని చెప్పి బిల ద్వారము నందు ఇతనిని నిలిపి ఆలసింపక నేనునూ వేగ వేగముగా బిలము ప్రవేశించి దుష్టుడైన ఆ రాక్షసుని కొరకు చాలా వెదికితిని. ఒక ఏడాది గడిచెను. అంతట వాడు నాకు గనిపించెను. యుద్ధమునందు వానిని, పరాక్రమము గల వాని బంధువులతో గూడ ఓడించి చంపివేసి తిరిగి పట్టణమునకు రాబోవగా బిలద్వారము పర్వతముచే మూయబడి యుండుటచే దారి తెలిసికొన లేనైతిని. పెద్దగా సుగ్రీవా! సుగ్రీవా! యని అరవగా, అరవగా ఓ యని యొక్కడైనను పలుక డయ్యెను. ఈ విధముగా అదలుచు బిల ముఖమున నున్న గుట్టను పదఘాతముచే గూల్చి నేనెట్లో బయటకు వచ్చితిని. ఐశ్వర్యమునకై ఇతనెటు వంటి పాపమును తలపెట్టెనో తెలుసుకొంటిరి గదా. అన్న గదా యనియైన దలంపక ఈ నీచుడు ఎంత చేయదలచెను. వీడు మన్నించుటకు తగిన వాడా? యని నన్ను

కట్టుబట్టలతో నగరము నుండి వెడలగొట్టెను. నా భార్యను చేపట్టెను. నేను ప్రాణ భయముచే అనేక దేశములు తిరిగి ఎట్లెట్లో చివరికీ పర్వతము, అతడు ప్రవేశింపరాని దగుటచే దీనిని నివాసముగా చేసుకొంటిని. ఏ విధమైన అపరాధము చేయకయే విపరీతమైన కష్టములను పొందుచుంటిని చూచితివా! సర్వ భూతములని రక్షించువాడా! దయతో ఈ దీనుని రక్షించి గొప్ప కీర్తిని పొందుము. అని చెప్పగా విని రామచంద్రుడు మిత్రమా! చింతను విడువుము. పదునైన నాబాణములచే నీ పగను తీర్చెదను. ఎంతవఱకా పాపాత్ముడు నా కనులకు కనిపించకుండునో అంతవరకు పర భార్యాసక్తుడై, మూఢుడై సుఖించును గాక. నా దుఃఖము వంటిదే కదా నీ దుఃఖము అని నాకు బాగుగా తెలియును. నీ విచారమును నేను తొలగించెదను. వానర రాజా! సంతోషమును జెందియుండు మనగా ..



# పదకొండవ సర్గము

## సుగ్రీవుడు శ్రీరామునకు వాలి బల పరాక్రమములను దెల్పుట

సంతోషముతో ముఖము ప్రకాశించు చుండగా సూర్య పుత్రుడు, రాజర్షభుడగు రామచంద్రునితో నిట్లనెను. సాటిలేని కీర్తి గలవాడా! ఇది నిజము. కోపముతో నీవు విడిచినట్టి పదునైన శరములు యుగాంతకాల సూర్యుని తీక్ష్ణ ములగు కిరణముల వలె లోకములనెల్ల ఒక్క తృటిలో బూడిద ప్రోవులుగా చేయగలవు. అయిననూ వాలి యొక్క పౌరుషమును, గొప్ప అద్భుతములైన పరాక్రమ ధైర్య సంపదలను ఏమరుపాటు లేక ఏకాగ్రతతో రామచంద్రా! ఆలకింపుము. నీతినెరిగినవాడా ! ఆ పై ఏ విధముగా చేయవలయునో ఆ యుపాయమును చేయుము. ఆ వాలి పెద్ద పెద్ద కొండలను భుజ బలము తో నెత్తి అమ్మనగాయలాడును. తూర్పు సముద్రము నుండి పడమటి సముద్రమునకు, దక్షిణ సముద్రము నుండి ఉత్తర సముద్రమునకు ఆ ఆచారపరుడగు వాలి ప్రతి దినము సూర్యుడుదయించకముందే తాను సంధ్య నుపాసించి వేగముతో ఉస్సని యైన అనకుండా పోయివచ్చు చుండువాడు. తన యొక్క బలమును ప్రకటించుటకై గొప్పవైన అడవి చెట్లను దండములను బోలిన తన కరములచే కొట్టి ముక్కలుగా పడవేయు చుండెడి వాడు అనఘాత్మకా! అతని యొక్క బలమును గూర్చి చెప్పుటకు చిత్రముగా నుండును గదా.

## సుగ్రీవుడు శ్రీరామునకు దుందుభి వృత్తాంతము చెప్పుట

దుందుభి అను పేరు గల మహిషాసురుడొకడు కైలాస శిఖరము వంటి తేజస్సు గలవాడు, శంకరుని వరముల వలన వేయి ఏనుగుల బలము తనకు

లభింపగా, సముద్రమును జూచి, ఓ తోయధి నాథా! నాతో యుద్ధము నకు వచ్చెదవాయని అడుగగా, వీనికి చేటు కాలము మూడినది గాన ఇట్లు పల్కుచున్నాడని సముద్రుడు, అసురేంద్రా! నీతో యుద్ధము చేయ నేనెంత వాడను. ఈశ్వరుని మాయయు, పర్వతరాజును, తాపసులకాశ్రయమైన వాడును, అనేకములగు సెలయేళ్లతో నొప్పు చరియలు గల వాడును అగు హిమవంతుడు నీకు సరివచ్చు వాడు. అని చెప్పుచున్న సముద్రుని భయపడినాడని తలంచి ఆ రాక్షసుడు వింటి నుండి వెలువడిన బాణము వలె అతివేగముగా కలహమును కోరిన వాడై గొప్పవాడగు హిమవంతుని చేరబోయెను. అట్లు వెళ్ళి తన కొమ్ముల కొనలతో పెద్ద పెద్ద గండు శిలలను భూమి మీద పడునట్లు పెళ్లగించుచుండగా, ఆ పర్వతము తెల్లని గొప్ప రూపముతో శిఖరమందు నిలచి ఇట్లు పలికెను. దనుజేంద్రా! నన్నేల నిత్యము బాధించెదవు? ఎంతో ధర్మపరుడవే? నేను మునుల సమూహమునకు ఆశ్రయమిచ్చు వాడను. అనగా, ఆ మోహాంధుడగు రాక్షసుడు హిమవంతునితో "వినుము. నేను నీవు భయమును పొందినవాడ వైనచో, యుద్ధము చేయలేని వాడ వైనచో, నాతో యుద్ధమును చేయగల వీరుని చెప్పుమనగా హిమవంతుడా మాటలకిట్లు బదులు చెప్పెను. దైత్యోత్తమా! కిష్కింధ యందు వాలి యను వానర రాజున్నాడు. అతడు మహా బలవంతుడు. ధైర్యము గలవాడు. ఇంద్ర సమానుడు. గొప్ప విజ్ఞాని. నీకు యుద్ధము చేయ మనసు గలనేని అతడు నీకు ద్వంద్వ యుద్ధమును సంతోషముతో నొసగ గలడు. పట్టుదలతో వానినిప్పుడే చూడ బొమ్ము. సర్వము చక్కబడును. నముచికి ఇంద్రుని వలె ఓ అమరారి! నీకు ఆ నముచిసూనుని పుత్రుడు యుద్ధ భిక్ష పెట్టగలడు అని హిమవంతుడు కోపముతో నిట్లు చెప్పగా.

### దుందుభి వాలి మీదకు యుద్ధమునకు వచ్చుట

గొప్ప విక్రమము గలవాడగు ఆ పాపపు రాక్షసుడు అంతట రోషముతో గూడిన గర్వముచే కన్నులు కనిపించని వాడై పాదములతో తన్నుటచే భూమి

కంపించు చుండగా మహిషాకారముతో కిష్కింధకు వెళ్ళి వాడియైన కొమ్ముల కొనలతో ఏనుగువలె చెట్లను లాగెను. ద్వార ప్రవేశమున జొచ్చెను. వర్షా కాలమందలి పెద్ద మేఘమో అనునట్లు దుందుభియను రక్కసుడు దుందుభి వలె చెవులు చిల్లు పడునట్లుగా మరల మరల శబ్దించుచూ నుల్చుని యుండగా, అంతఃపురమున నున్న వాలి ఆ ధ్వని నాలకించి నక్షత్రములతో గూడిన చంద్రుని వలె తన భార్యలతో గూడవచ్చి దానవునకిట్లనెను. దుందుభివి నిన్ను నేనెరుగుదును. దానవోత్తమా! ఏల మందమతివై ఈ విధముగా నా నగరము యొక్క ద్వారమునందు ధ్వనించెదవు? ఈ భూమి పయి ఇంకను ఊపిరితో నుండ మనసు గలదేని ఎచ్చటికైన బొమ్ము. అనగా, గొప్ప బలము గలిగిన ఆ దైత్యుడిట్లనెను. అమాయకుల ముందు డంబములు పల్కినంతనే మేలు గల్గునా? విక్రమము గలవాడివైనచో యుద్ధమునకు రమ్ము. వాలీ! అప్పుడు నీ భుజబలము తెలియబడును. కాదందువేని తెల్లవారువరకు వేచి యుండెదను. అంతవఱకు నీ ప్రియ భార్యలతో క్రీడింపుము. నీ గృహమునకు వెళ్లుము. అడ్డులేకుండ దానముగా ధనమును నీ మిత్ర సంఘముల కిమ్ము. నీ ప్రియ బంధువులకెల్ల కౌగిలించు కొనుము. విలాసినీ జనమును గూడుము. నీ పురమంతయు తిరిగి చూడుము. రాజ్యమందు నీ సమానుని నిలబెట్టుము. ఆ తరువాత యుద్ధమునకు రమ్ము. నీ మద మణచెదను. ఓ వానర శ్రేష్ఠుడా! మత్తుని, ఏమరియున్న వానిని, నిద్రపోవువానిని, నీవలె కామమోహితుని సంహరించినచో భ్రూణ హత్యచేసిన పాపము గలుగు సుమా. అని దుందుభి పలుకగా విని వాలి మందహాసముతో గూడిన ముఖము గలవాడై తన భార్య యగు తారను, తక్కిన స్త్రీలను గృహమునకు బంపి ఆ రాక్షసుని జూచి నీ యందు పిరికికండ లేనిచో నన్ను మత్తునిగా తలంపబోకుము. ఈ మద్య పానమును యుద్ధమునకు వీరణముగా నెంచుము. చూడుము అని పల్కుచు తండ్రియైన ఇంద్రుడిచ్చిన అందమైన బంగరు మాలికను మెడ యందు ధరించి

శౌర్యముతో రాక్షసాగ్రేసునితో తలపడెను. వానిపై బడి గట్టిగా అదిమిబట్టి పౌరుషముతో వాని కొమ్ములను చేతులతో పట్టుకొని రివ్వురివ్వున వానిని త్రిప్పి వాడు బలహీనుడై లోబడియుండగా నేలపై మోదగా అధికముగా చెవుల నుండి రక్తములు గారగా పడిపోయి కూడ వాడు తిరిగి గొప్పబలముతో ధైర్యము గలవాడై లేచెను. అట్లు లేచిన రాక్షసుని వాలి మోకాళ్ళతోను, మోచేతులతోను, చెట్లతోను, పెద్ద రాళ్ళతోను కొట్టుచుండగా ఆ రాక్షసుడు జంకక ఇంద్రపుత్రు నెదిరించెను. ఒకరినొకరు గెల్చు కోరికతో ఇరువురును యుద్ధము చేయుచుండగా అంతకంతకూ వానరుని బలము పెరిగెను. మహిషాకృతి గల రాక్షసుని బలమంతయు అంతకంతయు క్షీణింప దొడగెను.

**మతంగుడు వాలిని శపించుట**

రామచంద్రా! రాక్షసుని బలము క్షీణించుట తెలుసుకొని వాలియు పిడికిలి పోటులతో వానిని సంహరించి ఆ దానవుని కళేబరమును చేతితో పైకెత్తి వేగముగా ఒక యోజనము దూరమున పడునట్లు విసిరివైచెను. ఆ రాక్షసుని నోట నుంచి స్రవించుచున్న నెత్తురు గాలి వశమున మతంగాశ్రమమున బడెను.ఆ మౌని దానిని చూచి కోపముతో పరమ దుర్మార్గుడును, మూర? జ్ఞానహీనుడును నాపై నెత్తురు వేసిన వాడెవరురా? ఎవడురా ఆ దుష్టబుద్ధి గల పాపాత్ముడు అనుచు బయటకి వచ్చి ప్రాణములు లేక పర్వతము వలె పడియున్న ఆ రాక్షసుని జూచెను. అతడు తన తపఃశక్తిచే ఎవ్వడీ విధముగా చేసెనని చూచి, వానరరాజు బలముచే మదించిన వాడై చేసిన పని ఇది యని తెలిసికొని దీనిని విసిరివేసిన బలవంతుడైన వాలిని గూర్చి గొప్ప రోషముతో, దుష్టబుద్ధితో రాక్షస శరీరమును బలిమి నిక్కడ వైచి ఆశ్రమమునందున చెట్లను విరుగునట్లు చేసి, నేలయంతయు నెత్తురు, మాంసమును బడవేసి వనమును హేయముగా జేసిన పని చెరుపులవాడు ఈ వనమునందు ప్రవేశించినంతనే

ప్రాణమును విడుచు గాక! నా యీ గొప్ప ఆశ్రమము ఒక యోజన దూరము. వానరరాజు వెనుకంజ లేక దీనిని చేరినచో తక్షణమే తప్పక యముని మందిరమును చేరును గాక. ఆ వాలికి సంబంధించిన వారలు వేగముగా విడిచి పొండు. అట్లా పోకుండా రేపు సూర్యోదయమైన పిమ్మట ఇందొక కోతి యైన నాకు కనిపించినచో అబద్ధము కాదు, శపించితిని సుమా. విడువక వేనవేల సంవత్సరములు శిలలై పడియుండెదరు. కన్నబిడ్డను వలె పెంచిన నా ఈ గొప్ప వనమునందు వానరులు దుడుకుతనముచే దుంపలను, పండ్లను, ఆకులను మోటుగా రూపుమాపుట తగునా? అని ఇట్లు ముని శపించగా మర్కట సమూహము భయపడి వాలిని సమీపించిరి. ఆతడును వారిని చూచి మీరిట్లు పరుగెత్తుకు వచ్చితిరేమి? మనోహరమైన మతంగాశ్రమమున నివశించు వానరులారా! మీకచ్చట సుఖముగా లేదా? కారణమేమి? అనుచున్న వాలికి వారలు ముని శపించిన విధమును వివరించిరి. అది విని వాలి భయముతో ముని వద్దకు వెళ్ళి చేతులు జోడించి ఓ దయాశాలి ! నన్ను క్షమింపుము అని మాటిమాటికి వేడు చున్ననూ కోపము వీడక మౌని ఆశ్రమములోనికేగెను. వాలియు ముని శాపభయము చేత తపించుచు అది మొదలిచ్చటికి రాకున్నాడు. ఈ పర్వతమును చూచుటకైనను వెనకాడును. అట్లతడిందు రాకుండుట తెలిసియుండుటచే రామచంద్రా! నేనిచ్చట నిర్భయముగా సంచరించు చుందును.

అదిగో ఆ రాక్షసుని అస్తిపంజరము పర్వత సమానమై నేల బడియున్నది. శత్రువులను నశింప జేయువాడా! గొప్పవైన ఈ ఏడు వృక్షములను చూచితివా? కొమ్మలు వ్రాలుటచే పూర్తిగా చూచుటకు వీలుపడకున్నవి. ఈ గొప్ప వృక్షములను వాసవ సుతుడైన వాలి ఒక్కొక్క దానిని తన భుజ శక్తితో అనేక పర్యాయములు ఆకులు, పువ్వులు లేకుండక, ఎవరి సహాయము లేకుండకనే చేయుచుండువాడు. వాలి యొక్క గొప్ప భుజ బలమును గూర్చి చెప్పితిని కదా. నీవేవిధముగా అతనిని చంపగలవో చెప్పుమనగా, సుగ్రీవునితో లక్ష్మణుడు చిరునవ్వుతో నిట్లు చెప్పెను. కీర్తి గలవాడా! సుగ్రీవా! రఘుకులతిలకు డేమిచేసిన అతడింద్రసుతుని

సంహరింపజాలునని నమ్మెదవు? అనిన సూర్యపుత్రుడు లక్ష్మణా! ఇంద్ర నందనుడు బలముచే నీయేడు వృక్షముల నవలీలగా నొక్కనొక్కటిగా ఛిద్రము లొందునట్లు పలుమార్లు చేసెను. తీక్షమైన ఒక్క బాణముచే రాముడు వీటి యందు ఒక్క చెట్టును త్రుంచినచో గొప్ప బలవంతుడనియు వాలిని చంపుననియు నమ్మెదను. మరియు లక్ష్మణా రాముడు కొండ వంటి రాక్షసుని ఎముకలగూడును కాలితో తేలికగా రెండుమార్ల విండ్ల ప్రమాణపు దూరము విక్రమముతో నెగజిమ్మినచో నమ్మెదను. అని చెప్పియు కొంతసేపు తనలో తానాలోచించి దశరథ పుత్రునితో నిట్లు పలికెను. రామచంద్రా! ఆ వాలి బలవంతుడు. భూమియందు కీర్తింపబడిన బలపౌరుషములు గలవాడు. యుద్ధములందు జయింపరానివాడు. ఆర్యశ్రేష్ఠుడా! గొప్ప బాహుబలము, సాటిలేని విక్రమము గలవాడు. తిరస్కరింపడిన శూర సమూహములు గలవాడు. దేవతలచేత అసాధ్యమని విడువబడిన కార్యములను గూడ వాలి నెరవేర్చెను. రఘూత్తమా ! అందుచేతనే గదా గొప్ప భయమును పొంది నేనిచ్చట దాగి సంచరించెదను. వాని యొక్క గెలువరాని పరాక్రమమును, చెనకని వాని యొక్క పౌరుషమును, తీక్షమైన క్రోధమును, వాని యొక్క మహా జవసత్వ సంపదలను మనస్సునందు తలచి యనుమానముతో, నా వెంట ఈ గొప్ప వానరులు విడువక సేవించుచుండగా ఈ ఋష్యమూకమును విడువ జాలకున్నాను.

మానవనాథా ! సుజనులచే పొగడబడునట్టి నిన్ను బోలిన మహాను భావుడైన మిత్రుని పొందుట చేత, మిత్రులయందు వాత్సల్యము గలవాడా! హిమవత్పర్వతము యొక్క ప్రాపు లభించినట్లు విచారమును విడిచి పెట్టితిని. నీ యొక్క సమగ్ర ధైర్యమును, నీ స్వరూపమును, నీ యొక్క ప్రజ్ఞయును, నీ మాటలయొక్క సొంపును, నీదు గంభీరతను, ఇన్నిటిని చూచినచో నీవు నివురుగప్పిన నిప్పు వలె నున్నావు. అయిననూ రామా! యుద్ధభూమి యందు నీ పరాక్రమమును కనులారా నేనెన్నడునూ చూడలేదు కదా. గొప్ప బలశాలియైన వాలి చేసిన మాహాద్భుత కర్మములనెన్నిటినో నేను చూచితిని. అట్లగుటచే పెద్ద

దిగులు పొంది యుంటినని సుగ్రీవుడు చెప్పగా, రాముడు చిరునవ్వు చిందించు మొగము గలవాడై స్నేహితునితో నిట్లనెను. నా బలమును నీవు బుద్ధియందు ఈ విధముగా నమ్మవేని చూడుము నీవు నమ్మునట్లు చేసెదను.

## శ్రీరాముడు దుందుభి కళేబరమును పాదమున చిమ్ముట

అని సుగ్రీవుని ఓదార్చి యినవంశ దీపకుడు దుందుభి శరీరమును కాలి బొటనవ్రేలితో అవలీలగా దూదిని వలె పది యోజనములు దాటి నేలమీద పడునట్లు చిమ్మెను. సూర్యపుత్రుడది చూచి రామునితో నిట్లనెను. రామా! ఇది వాలి ఎగుర వేసినప్పుడు ఎంతయో మాంసముతో నిండి క్రొత్తగా చంపబడినదై యుండినది, పైగా వాలి యుద్ధము నందు చాలా శ్రమపడి యుండెను. అందునను మద్యపాన మత్తుడై ఉండెను. ఓ రఘురామా! ఇప్పుడిది శుష్కించి యుండుటచే నేను నిన్ను నమ్ముటకు జంకుచున్నాను. అప్పుడది పచ్చిది. ఇప్పుడు ఎండి ఉన్నది. అందుచే మీ ఇద్దరియందు గొప్ప బలము గలవాడెవ్వడో నమ్మకముగా చెప్పలేకున్నాను. నీతో నిజము చెప్పితినయ్యా! ఈ వింటి ఎక్కుపెట్టి బాణమును సంధించి గొప్పబలముతో లాగి భూపాలా! ఒక్క వృక్షమును వేగముగా పడగొట్టితి వేని నీవే యెక్కువైన వాడవు అని నమ్మెదను. రాజకుమారా! నిన్ను పరీక్షించుటకు నేను గోరుటలేదు. నా నమ్మకమునకే సుమా ఇది. ఇంకే విమర్శను చేయను సుమా. ఏనుగు తొండము వలె ఉన్న ఈ వింటిని వేగముగా సిద్ధపరచి కఠినమైన బాణమును దొడగి చెవిదాకా లాగి ఆ చెట్టు పడిపోవునట్లుగా అతివేగముగా విడువుము. గొప్పతేజము గలవారిలో సూర్యుని వలెను, ధరణి యందు గల పర్వతములలో హిమవంతుని వలెను, నాల్గు కాళ్ళ జంతువులలో సింహము వలెను ఓ పద్మాక్షా! మనుష్య సంఘములో నీవే అధికుడవు సుమా!



# పంద్రెండవ సర్గము

## శ్రీరాముడు సాలసప్తకంబును భేదించుట

అని సుగ్రీవుడు పలుకగా రామచంద్రుడు సూర్యపుత్రుని నమ్మచేయుటకై గొప్ప వింటిని వేగముగా తీసుకొని కాంచన పుఃఖము గల బాణమును సంధించి ఆ వృక్షమునకు గురిపెట్టి అల్లెత్రాటి ధ్వనియు బాణపు ఈకల ధ్వనియు దిక్కుల చివరల వరకు నిండగా వదిలెను. ఆ శరము వేగముగా వెళ్ళి ఆ ఏడు వృక్షములను నరికి పర్వతము కదలిపోవుచుండగా దూసుకొనుచు పోయి భూమియందు ప్రవేశించియు తిరిగి వేగముగా వెడలి తన స్థానమును చేరెను. ఆ వృక్షములేడును వాడిగల బాణముచే నేపు చెడి కడు భయంకరముగా నేల వ్రాలగా అది చూచి వానర రాజు రాముని బాణ వేగము యొక్క గొప్పదనమునకు ఆశ్చర్యమును పొంది తన మెడ యందు ప్రకాశ సమానములైన హారములు వ్రేలాడుచుండగా దలతో భూమిని త్రాకుతూ కల్మషములేని ప్రేమతో మ్రొక్కి తిరిగి లేచినవాడై చేతులు జోడించి రామచంద్రునితో నిట్లనెను.

రామచంద్రా ! నీ బాణములచే ఇంద్రునితో కూడిన దేవతల సమూహమును రాక్షస సమూహమును యుద్ధభూమి యందు సంహరింప జాలుదువు నీవు. వాలియు, గీలియు నీకొక లెక్కయా? వారుణినితో, ఇంద్రునితో సమానుడవును. మిత్రులయందు ప్రేమ గలవాడవు నగు నిన్ను చూచుటచే దుఃఖములు తీరినవి. వృక్షము లేడింటిని, గొప్ప పర్వతమును భూతలమున ఒక్క బాణముచే చీల్చి వేసిన నిన్ను ఓ ఆర్త శరణ్యా! యుద్ధ రంగమందు డెవ్వ డెదిరింపగలడు? అంజలి మోడ్చి వేడెదను మహాత్మా! రఘువంశమును ప్రకాశింప చేయు వాడ నా దుఃఖము తీర్చుము. దయ లేనివాడు సోదర రూపమున నన్ను పగవాడును

నగు వాలిని వేగముగా నా కొరకై యముని వద్దకు పంపుము అని దీనముగా వేడగా సూర్యపు(త్రుని స్నేహముతో కౌగిట బట్టి తన సోదరుని సమ్మతితో నిట్లు చెప్పెను.

## సు(గీవుడు తొలిసారి వాలి మీదకు యుద్ధమున కకేగుట

సు(గీవా! కిష్కింధకు పోదము పద. ఇక ఆలస్యము చేయదగదు. హుటాహుటిన వెళ్లి ముందుగా సోదరుని హింసకుడైన నీ అన్నను సంతోషముతో యుద్ధమునకు పిలువుము అని చెప్పి రామలక్ష్మణులు ఆ వానరు సముహముతో వేగముగా వెళ్లి వృక్ష సమూహములతో ఆవరింపబడిన మరుగు చోటునందు దాగి యుండిరి. అంతట వానర(ప్రముఖుడు ముందుగా పోయి ఆకాశము నిండినట్లు గర్జించుచు కఠినాత్ముడు అగు వాలిని యుద్ధమునకు పిలిచెను.

ఆ ధ్వనిని విని ఇం(ద్రనందనుడు పడమటి కొండ మీద కనిపించు సూర్యుని విధముగా తగ్గని కోపముతో మండుచూ వేగముగా యుద్ధమునకు చనుదెంచెను. అంతట వాలి సు(గీవుల కిద్దరకు ఘోరమైన పెద్ద యుద్ధం జరిగెను. ఆయుద్ధము ఆకాశము నందు బుధ్ధునికి, అంగారకునకు జరుగుతున్న యుద్ధము వలె నొప్పెను. పిడుగులను వేళాకోళము చేయ గలిగిన పిడికిళ్ళ తోను, హస్తముల తోను భయంకరముగా వారు ఒకరినొకరు కొట్టుకొని విడువక యుద్ధము చేసిరి. ఇట్లు పిడిగుద్దుల కయ్యము సాగుతుండగా రాఘవుడి చేత విల్లు (పూని అల్లి (తాటి నెక్కించి అశ్వనీ దేవి పు(త్రులట్లు తేజమునందును, అందమునందును, శౌర్యమునందును ఒక్కమాదిరిగా నుండి (ప్రకాశించుచున్న వారలను జూచి వీడు సు(గీవుడు, వీడు వాలి యని వీసమైనను భేదము తెలియనివాడై (వాలి ఇప్పుడు హేమ మాలను ధరించినవాడు గాడు) సందేహించిన మనసు గలవాడై చంపెడు బాణమును విడువడయ్యెను. ఇంతలో సూర్యపు(త్రుడు ఇం(ద్రసుతుని దెబ్బలకు బాధనొందిన వాడై ఆ చుట్టుపక్కలనే యున్న రాముని వంకనైననూ చూడక అలసటతో, రక్తసిక్తమైన దేహముతో పారిపోయెను. అధికమైన

రోషముతో వాలి తరుముచుండగా పరువెత్తి ఋష్యమూక పర్వతమందలి వనమధ్యమును చేరెను. ఇట్లు వెళ్లిన సుగ్రీవుని చూచి వాసవ పుత్రుడు అచ్చటికి వెళ్ళుటకు శాపభయముచే గొంకుచూ అధికమైన కోపముతో ఛీ బ్రతికిపోయితివి పోరాయనుచు పరుగున మరలా తన పురమునకు చేరెను. అచట రాముడు, లక్ష్మణుడును

## వాలిని జంపమికి సుగ్రీవుడు రాముని నిష్ఠూరములాడుట

హనుమంతుడు వెంట రాగా సుగ్రీవుడు ఉన్న చోటుకు వెళ్లి నిలబడగా వారలను జూచి సిగ్గుతో మొగము వంచుకొని సుగ్రీవుడిట్లనెను. నేను నమ్మునట్లుగా నీ పరాక్రమమునట్లు చూపించియు, వాలిని పిలుచుటకు పోపొమ్ము యుద్ధము చేయుటకు నన్ను ప్రేరేపించి, ఓ రాజా! విరోధిచే ఈ విధముగా చంపించుటకు కోరిక గల్గుటకు కారణమేమో? నన్ను విరోధి నోటిలో బడవేసి నీవేమీ లాభమును పొందెదవో? రాఘవా! సత్యసంపన్నా! వాలిని చంపుమని నిన్ని వేడినప్పుడే వాలిని నేనొప్పింపనని ముందుయే చెప్పి యుండరాదా? నేను నెమ్మదిగా పూర్వము వలెనే ఇచ్చటనే పడియుండెడి వాడనే. గొప్ప మనస్సు గల రామచంద్రా! యేమిటికయ్యా నన్ను పంపించుట ? చెప్పు దెబ్బల పాలు చేయుటకా?

## శ్రీరాముడు సుగ్రీవునితో తాను వాలిని చంపకపోవుటకు కారణము చెప్పుట

అని కరుణ పుట్టునట్లు దీనముగా వణుకుచున్న సుగ్రీవునితో రామభద్రు డిట్లనెను. ఓ నాయనా! ఎందులకు కోపించెదవు? నేను దివ్యమైన బాణము విడువకపోవుటకు కారణము వినవయ్యా! ఓ అనఘా! మీరివ్వురును రూపము చేతను, వయస్సుచేతను, పొడవునందు, చూపులోను, వేషధారణమందును నడక తీరు నందును, కాంతి చేతను, కంఠస్వరమునందును, ధైర్యమునందును, నిరూపణముము చేయగా సమానులుగా నున్నారు. కావుననే మీరిరువురిలో ఎవడు వాలియో తెలుసుకొనలేక పోవుటచ ప్రాణములు తీయు క్రూరమైన బాణమును నేను విడువక పోతిని సుమా. మిత్రమా! ఇది నిక్కము. ఓ కపీశ్వరా!

నా చేతి నుండి విడువబడిన బాణము ఎప్పుడునూ వృధాపోవదు. ఇప్పుడు మీ మీద విడిచినచో ఎవ్వరినది సంహరించునో. మూలచ్ఛేద మగునట్లు నిన్నే తగిలినచో కీడు గలుగును కదాయని నేనప్పుడు బాణమును విడువక బొతిని. మిత్రరత్నమా! శాంతిపుము. సరిగ్గా గుర్తించకపోవుటచే లాఘువముతో ప్రయోగించిన నా బాణముచే నిన్ను చంపితినేని ఓ కపీశ్వరా! జగములన్నిటి యందు నా యొక్క గొప్పనైన మూర్ఖత్వము, కుఱతనము, స్థిరముగా నిలచి యుండును. అభయమిచ్చిన వానిని చంపుట గొప్ప పాపమని చెప్పెదరు దానికి ప్రాయశ్చిత్తమే లేదు. స్నేహితులలో శ్రేష్ఠుడా! మనసున దితంతయు తలంపుము. ఓ మిత్రమా! నేనునూ, లక్ష్మణుడును, సీతయు నీ వశమున నున్నారము. సత్యము. ఈ గొప్ప అడవియందు మాకు ఓ గొప్ప గుణములు గలవాడా! నీవే దిక్కు సుమా. మనస్సు నందు నెమ్మదిని పొందుము. ఓ మిత్రమా! నన్ను నమ్ముము. మనస్సునందు సంశయము నుంచబోకుము. నీవు మరియొకమారు ఇంద్రసుతునితో పోరుటకు వెళ్ళుము. ఈ మారు నేను గుర్తించునట్లు నీ శరీరమున నేదైన గుర్తును ధరింపుము. ఈ క్షణము నందే అతనిని నా యొక్క బాణ ఘూతమచే గుచ్చుట నీవు చూచెదవు గాక. విరివిగా ఆ గజ పుష్పలత పూచి యున్నది. సౌమిత్రీ ! నీవు దానిని స్పష్టముగా ఈ వానర రాజు కిప్పుడే కంఠము నందు వేయుము. అని చెప్పగా సౌమిత్రియు దానిని తీసుకొని వచ్చి సూర్యపుత్రుడని కంఠమున వేయగా, ఎక్కువగా గొప్ప నక్షత్రములతో గూడి సూర్యుని వలె సుగ్రీవుడు ప్రకాశించెను. అట్లు గజ పుష్పలతను ధరించి సుగ్రీవుడు సంధ్యా సమయమున తెల్ల కొక్కెరలతో ప్రకాశించు మేఘము వలె ప్రకాశించుచు రాముని మాటలచే ధైర్యము వెలుగొందగా కిష్కింధా పురమునకు రామునితో కలసి వెళ్ళెను.



# పదమూడవ సర్గము

## శ్రీరాముడు సుగ్రీవాదులతో కిష్కింధ యొద్దకు పోవుట

సూర్యపుత్రుడును, సుమిత్రా తనయుడును తనకు ముందు వెళ్ళుచుండగా, నలుడు, హనుమంతుడు, తారుడు అను వానరులు తన వెనుక వచ్చుచుండగా బంగరుచే నలంకరించబడిన గొప్ప వింటిని, సర్వ సన్నద్ధమైన బాణములను చేత ధరించి అచ్చటచ్చట పుష్పముల భారముతో వంగిన వృక్షములను, నిర్మలమైన ఉదకములు గల నదులను, అందముగా నున్న గుహ సమూహము లను, మనోహరములైన పుష్ప సమూహములతో ప్రకాశించుచున్న పొదలను, పక్షుల సమూహములచే ఆకులితములైన పర్వతములను, నునుపుగా నున్న పర్వతసానువులను, మొగ్గలతోడను, వైఢూర్యపు రంగులు గల ఆకులతోడను పద్మములతోడను, చెంగలువతోడను అందమైన కింజల్కముల తోడను, తామర తూడుల తోడను, నొప్పుచున్న కొలంకుల సమూహములను చూచుచూ కన్నెలేడి పిట్టలను జగద్గురు పక్షులను, మమ్ములను వంతు జలకుక్కుటములను, చక్రవాకం రాకములను, పెద్దగా ధ్వని చేయుచున్న జలాశయముల సమూహములను చూచుచు మనసులో కొంచెంకూడా దిగులు లేకుండా కోరికతో గుట్టలందు, మెట్టలందు, లేతపచ్చిక యున్న పట్టులందు, మేత మేయుచు విహరించుచున్న లేళ్ళను సంతోషముతో చూచుచూ వనములందు నడచుచున్న పర్వతముల వలెను, నల్లని మేఘముల వలె నొప్పుచు, చెరువులలో దిగి కల్లోల పరచుచూ తెల్లని తమ దంతములచే ఒడ్డులను ముక్కచెక్కలగునట్లు త్రోయుచూ,

దుమ్మంతయు నెత్తిన జల్లు కొనుచు, ఒంటరిగా విహరించుచున్న గజ శ్రేష్ఠములను జూచుచూ వేగమైన నడకలతో వెళ్ళుచూ  చెట్లతో నిండి యున్న ఒక వనమును జూచి రాముడు తన మనస్సుకది అద్భుతముగా కనిపించగా సూర్య సుతునితో నిట్లనెను. ఆకాశమునందు కారు మబ్బులెక్కువగా కమ్మినట్లు పొడవైన అందమైన అరటి చెట్ల ఆకుల దొప్పలవలె విపరీతముగా నుండి ఎక్కువ కుతూహలమును గలిగించుచుండెను. మిత్రమా! ఈ విచిత్రమేమియో నా కుతూహలము దీరునట్లు చెప్పగదయ్యా! అనినడుగగా నడచుచున్న సుగ్రీవుడిట్లనెను. ఓ అనఘా! ఈ మహిమ గల ఆశ్రమము కథ శ్రమ తొలగించును వినుము. ఇది మున్యాశ్రమము. మంచి ఫలములు నేరములుగలవి గలది. సప్త జనులను పేరుగల ఏడుగురు ముని శ్రేష్ఠులు తలక్రిందులుగా అగ్నితప్తులై వ్రేలాడుతూ ఏడు రోజులకొక్కమారు గాలిని ఆహారముగా గొనుచు ఏడు వందల ఏండ్లు జలము నందు శయనించిన వారై ఉగ్రనిష్ఠతో మహా వ్రతము సల్పి సూర్యుని బోలువంటి కాంతి గలవారై వారు సశరీరముగా స్వర్గమును చేరిరి. వారల మహిమచే వృక్ష ప్రాకారముచే ఆవరింప బడిన ఈ వనము దేవతలైనను, రాక్షసులైనను నిండిన భయముచే చూడనైన జాలదు. ఇందు పక్షులైనను, వానరములైనను, ప్రవేశించినచో అవి అందే సంభ్రమించిన బుద్ధితో తిరుగుచుండును గాని ఎన్ని నాళ్ళకైనను బయటకి రావు సుమా. శత్రువినాసుడా ! రామచంద్రా! దీనినుండి ఆభరణముల యొక్క ధ్వనులను, సంతోషమును కలుగజేయు మంగళ వాద్యముల యొక్క ధ్వనులను, మంచి మాటలను వినవచ్చును. దివ్య సుగంధము గల వాయువు వీచు చుండును. అందు త్రేతాగ్నులు ప్రజ్వరిల్లు చుండును. అదిగో గాలిచే ఎగరగొట్టబడినదై చెట్ల అగ్ర భాగముల నందు పావురముల రంగు వంటి రంగుతో పొగ అధికముగా కనిపించుచున్నది. ఆ పొగలచే అగ్రభాగములు నిండియున్న ఈ

వనవృక్షముల సమూహములు మేఘములతో కప్పబడియున్న వైఢూర్య పర్వతముల వలె నుండెను. ఓ ధర్మశీలా! నీ సహోదరునితో కూడా నీవా మునులకు నమస్కరింపుము. ఈ మునులకు మ్రొక్కు వారికి దేహములందంటి రోగములు సంభవింపవు సుమా. అని చెప్పగా, లక్ష్మణ సమేతుడై రాముడు భక్తితో నమస్కరించి త్వరగా దానిని దాటి చాలా దూరము ప్రయాణము చేసి అచట వాలి పాలించుచున్న కిష్కింధను చూసెను. మంచి మాటలతో నిట్లు లక్ష్మణుడును, సుగ్రీవుడును తన్ననుసరించుచుండగా గొప్పనైన శౌర్యముతో శత్రు సంహారము చేయు నాసక్తితో రాముడు మరలా నచ్చటికి చనుదెంచెను. ఈ విధముగా అందరును ఇంద్రపుత్రుడగు వాలి యొక్క పట్టణపు సమీపము నందు గల దుర్గమారణ్య ప్రవేశమున ఎక్కువగా చెట్లతో ఆవరింపబడిన చోట నిలువగా..



# పదునాలుగవ సర్గము

## శ్రీరాముడు సుగ్రీవునకు భయముపోవ నుత్సాహోక్తులు చెప్పుట

అంతట సుగ్రీవుడధికమైన రోషముతో తలయెత్తి నాలుగదశల చూచి ఝుం ఝూ వాతముల వెంబడి వచ్చు మేఘముల గర్జలను బోలిన గర్జనలు వినిపించి బాల సూర్యుని వంటి కాంతి గలవాడై క్రియాదక్షుడగు రాముని జూచి వానరుల రేడు వాలిచే రక్షింప బడుచున్న కిష్కింధా పట్టణమిదియే రామచంద్రా ఇచ్చటికి వచ్చితిమి. ఓ రామచంద్రా! ఇంద్రుని వంటి వాడా! మునుపు వాలిని చంపెదనని చేసిన నీ ప్రతినను సఫలము చేయు సమయమిదియే సుమా. తీగలకు వసంత సమయము వలె నీకును ఇదియే తగు సమయము. అనగా, రఘురాముడు సూర్యసుతునితో నిట్లనెను. సుగ్రీవా! సౌమిత్రి నీ కంఠము నందమర్చిన గజపుష్ప లతా చిహ్నము వలన నీవు చుక్కల చాళులతో నొప్పుచూ చంద్రునిచే భాసిల్లుచున్న ఆకాశము వలె ప్రకాశించెదవు. వాలిచే నీకు కలిగిన భయమెల్ల నొక్క బాణము చేతనే పోగొట్టెదను. సోదర హింసకుడైన ఆ వాలిని నాకు చూపించుము. అంతటితో వాడంతమగును సుమా. ఈ మాటలెందులకు? వాడు నా కంట బడియు జీవములతో మరల గలిగెనేమి నన్నప్పుడు దూషింపుము. అంత వరకు నన్ను దూషించుట న్యాయము గాదు. మునుపు నీవా వృక్షముల నేడిటినీ నొక్కసారిగా ఒకే బాణముతో నేల బడవేయుట నీవు కన్నులారా చూచితివి గదా. నా యొక్క బాణముచే వాలి ఇచ్చట సంహరింపబడునని ఆ విధమును బట్టి తెలియును. అనఘా! ఎన్ని ఆపదలలో మునిగి యున్నను ధర్మలోపము జరుగుటకు నేనొప్పుకొనను. అందుచేత మునుపెన్నడును నేను కల్లలాడి నెరుగను. ఇకనెన్నడునూ అబద్ధమాడబోను నిజము సుమా. చింతను విడిచి

పెట్టుము. వానచే మడులను సశ్యములతో నిండునట్లు చేయు ఇంద్రుని వలె నేను నా ప్రతిజ్ఞ నెరవేర్చెదను. మనంబునందు జడియకుము. ఎట్టి గర్జనను విన్నంతనే ఇంద్రతనయుడు మండిపడుచు పోరుకి వెడలి వచ్చునో అట్టి గర్జనలను చేయుము. ధైర్యవంతుడును, జయించినవాడును, పరాక్రమవంతుడును అగు వాలి నీ గొప్ప బలముచే మునుపు నొచ్చుకొన్నవాడు గాదు కావున తప్పక వెంటనే వచ్చును. స్త్రీల గోష్టియందున్నచో యెట్టి వివేకవంతులకైనను దురభిమానము, మదము అధికమగును గదా. వానరోత్తమా! శౌర్యముగల వీరులు విరోధులయొక్క తిరస్కారమును తన బలముయొక్క ఆధిక్యముచే ఓర్చుకొనలేరు సుమా. స్త్రీల సమూహమందున్నచో ఇక వారి యొక్క దురాగ్రహమును చెప్పవలెనా? చెప్పుము.

**సుగ్రీవుడు వాలిని రణమునకు పిలుచుటకై సింహనాదము చేయుట**

ఇట్లు ప్రస్ఫుటముగా చెప్పుచున్న రాముని వాక్యములను విని సుగ్రీవుడు దిక్కులు పెక్కుటిల్లునట్లు పిడుగు ధ్వని వంటి గర్జనమును గావించెను. గుండె పగల్చునట్లున్న సుగ్రీవుని క్రూరమైన కంఠనాదముని విని అరాజకమైన భూమియందు గర్వితులైన దుష్టులు పట్టుకొనరాగా స్త్రీలు ఆర్తితో కకావికలై పరువెత్తునట్లుగా, గోవుల యొక్క సమూహము ఒకటి వెళ్ళిన త్రోవలో రెండవది వెళ్ళక దిగ్భ్రాంతితో అతి వేగముగా పరుగెత్తెను. యుద్ధమందు దెబ్బతిన్న గుఱ్ఱముల వలె మృగములు వేగముగా పరువెత్తెను. పుణ్యము క్షీణించిన గ్రహముల వలె పక్షులాకాశము నుండి వీడి భూమిపై బడెను. మేఘముల యొక్క భయంకర గర్జలవంటి కంఠ ధ్వని గల ఆ సుగ్రీవుని గొంతు నుండి వెలువడిన గొప్ప ధ్వని భయంకరమైన వాయువుచే కదల్పబడిన తరంగములు గల సముద్రపు కల్లోలముతో సమానమై యొప్పెను.



# పదునైదవ సర్గము

## యుద్ధమునకు పోవు వాలిని తార అడ్డగించుట

సర్వ భూతములను కంపింపజేయ గలిగిన సుగ్రీవుని గర్జన అంతఃపురము నందున్న వాలి వినినంతనె అతని మత్తంతయు వదిలిపోయెను. భరింపరాని క్రోధముద్భవించెను. అధికమైన రోషముతో కూడిన సర్వాంగములు గలవాడై సంధ్యకాలపు రెర్రదనమును దాల్చిన ఇంద్రనందనుడు అప్పుడు తేజో విహీనుడగుటచే గ్రహణము పట్టిన సూర్యుని వలె నుండెను. వికృతములైన కోరలచే, భయంకరుడును, ఉదయించిన కోపభారముచే మండుచున్న అగ్నివలే వెలిగి, తామరపువ్వులు పీకివేయగా కాడలతో నున్న మడుగు వలె కాంతి దొరగి కన్పట్టెను. భరింపరాని ధ్వని తన చెవుల నందించుక సోకినంతనే పటపటా పండ్లు కోరుకుచూ పాద ఘట్టనలచే భూమి బ్రద్దలై ముక్కలగునట్లుగా వాలి వెళ్ళుచుండ అతని భార్యయగు తార అడ్డుపడి స్పష్టమైన ప్రేమాతిశయము మనస్సునందు నిండి తొలకుచుండగా అతనిని కౌగలించుకొనును. శుభ ప్రదములైన మాటలతో ఆ కళ్యాణి భీతితో, అధికమైన సంభ్రమముతో ఇట్లు వచించెను. ఉషఃకాలమునందు రాత్రి ధరించిన పూలమాలనువలె నదీవేగము వంటి వేగముతో వచ్చిన ఈ క్రోధమును విడువుము. అరుణోదయము అయిన వెంటనే నీవు వెళ్లవచ్చును గాని, యుద్ధమునకు నీవిప్పుడే వెళ్లకపోవుట వలన నీకవమానము గలుగదు. శత్రువునకు గౌరవమును గలుగదు. బుద్ధియం దాలోచింపుము. యుద్ధము చేయుటకిప్పుడే వెళ్ళుట మంచిది కాదు. నేనిట్లనుటకు కారణమిదియని చెప్పుచున్నాను. సూర్యపుత్రుడింతకు మునుపే నీయొక్క

పరాక్రమము చేత చిక్కుపడిన వాడై సత్తువను గోల్పోయి పారిపోయి గూడా ఇంతలోనే భయపడక నిన్ను యుద్ధమునకు ధైర్యముతో పిల్చుట చూడగా సంశయము గలుగుచున్నది. ఆ గర్జించు తున్న విధము చూడగా గొప్ప బలమును గొప్ప ప్రయత్నమును, సామాన్యముగా దోచుట లేదు ఏదో పెద్ద కారణముండి యుండును సుమా. సహాయకుడెవ్వడు లేకుండా ఇట్లు విక్రమముతో రాదని తోచుచున్నది. గొప్ప సహాయము దొరకకున్నచో ఈ విధముగా గొంతులో ధ్వని చేయునా? సుగ్రీవునకు పుట్టుకతోడనే తెలివియు, నేర్పును కలిగియున్నవి. కాన బాగుగా పరీక్షించబడిన శౌర్యము గలవానితో గానీ పెరవానితో గలసి అతడు యుద్ధమునకు రాడు సుమా. ప్రాణేశ్వరా ! ఆ కథ యంతయు ఇంతకుమునుపే నేను మన యంగదుని వలన విని ఉన్న దానను అతడరణ్యము నకు వెళ్ళి వచ్చుచూ వేగులవారు చెప్పగా విన్నాడు. వినుము. అయోధ్యాదీపుని పుత్రులు రఘువంశజులు, వీరులు, యుద్ధమునందు అజేయులు రామలక్ష్మణు లను వారలు నీకు చొరరానిదైన ఋష్యమూక పర్వతమునకు నీ తమ్మునకు తోడ్పడుటకు వచ్చినారట.

వారిలో రాముడు శత్రు సమూహమును సంహరించువాడును, విలయ కాలమునందలి సాటిలేని అగ్ని వంటివాడును, పొగడబడిన గొప్పకీర్తి గలవాడును, ఉచితానుచితములను తెలిసినవాడును అని తెలిసినది. అధిపా! అతడు సాధువులకు నివాస వృక్షము వంటివాడు. ఆర్తకోటికి ప్రశస్తమైన గతియైన వాడు. బాధితుల సమూహమున కాశ్రయము. గొప్పనైన కీర్తికి పాత్రుడు. శాస్త్రములన్నింటిని అభ్యసించిన లౌకిక జ్ఞానము తెలిసిన గొప్పవాడు. నాధా! ఎల్ల ధాతువులకు పర్వతము వలె గుణములకెల్ల నునికిపట్టయినవాడు. తండ్రిని సత్యవాదిని చేయుటకై అడవులకు వచ్చినాడట. అట్టి గొప్పవానితో, బలవంతునితో యుద్ధమునందు జయింపరాని వానితో మహాత్ముడైన రామునితో విరోధమును వహించుట మోసము గాదా. మీ తప్పులనెత్తి చూపుటకై నేను

చెప్పెడు దాననుగాను. నీవు కోపగించుకొనకుము. నా మాటలను వినుము. నా మాట వెంట నడువుము. నీకు చాలా మేలు కలుగును సుమా. ఓ వీరశ్రేష్ఠుడా! రామునితోడి విరోధము నేరము సుమ్ము. మేలుగాదు. ఆలోచించి నాకు తోచిన ఉపాయమును చెప్పెదను. వినుము. తరువాత నీకేది మంచిదని తోచిననది చేయుదువుగాని. ప్రేమతో ఆ సూర్యపుత్రుని యౌవరాజ్యమందు నిలుపుము. గొప్ప బలవంతునితో విరోధమెందులకు? నా ప్రార్థనను వినుము. సీతానాథుని తోడి స్నేహము నీకు శ్రేయము. ఓ ఇంద్రపుత్రా! బుద్ధిమతుడైన నీ తమ్మునిపై మాత్సర్యమును విడిచి పెట్టుము. నీకు తమ్ముడొక్కడే గదా. అతడు సద్గుణములు గలవాడు. వానితో సమానుడగువాని నిందొక్కనినేని చూపించుము. నీయెడ వినయము గలవాడు అక్కడ ఉన్నను, ఇక్కడ నున్నను నీ వంక బంధువతడొక్కడే కదా చూడుము. ఈ కాఠిన్యము పనికిరాదు సుమా. అతడిని బుజ్జగింపుము. అతడు నీకు తమ్ముడు గాదా? శత్రువా? నీవును అతడును ఒక గర్భమునందే పుట్టితిరి గదా. అందుచేత అతడు నీకు బంధువేయని నా నమ్మకము. అట్లగుటచే అతనిని నీ తరువాత నీ యంతటివానిగా మన్నించి దానమానాది కార్యములచే గౌరవించి, నీ సమీపమున నుంచుకొమ్ము. నీకు నేను హితురాలనని మనస్సునందు నమ్మెదవేని, నాపైని నీకు స్నేహముండుటయు, నేను నీకు ప్రియము జేయుట నీకిష్టమైన వైనచో ఈ ద్రోహమును విడిచి పెట్టుము. తమ్మునియందధికమైన స్నేహమును జూపించుము. ఇది వ్యర్థమగు తప్పుభావన కాదు. నీకిదియొక్కటే మార్గము. ఇంకనేదియునులేదు సుమా. ప్రాణవల్లభా! నా మాటలాకింపుము. క్రోధము విడువుము. చేతులు జోడించి వేడెదను. అమేయపరాక్రమము గలవాడును, ఇంద్ర సమాన తేజుడును అగు రఘుముఖ్యునితో విరోధము పెట్టుకొనుట నీకు కీర్తికరమును, హితమును, మేలును గాదు శాంతింపుము. అని ఈ విధముగా చంద్రవదనయగు తార ఎంతగా హితము చెప్పినను ఆ ఇంద్రనందనుడు చెవిని బెట్టడయ్యెను. ఔరా! దైవముచే చేటు మూడిన వాడు మంచిమాటలనేల వినును?

# పదునాలవ సర్గము

## వాలి తారకు సమాధానము చెప్పి యుద్ధమునకు బోవుట

తన ప్రియ భార్యయు, గొప్ప మేధాశక్తి గలదియు, గోళ్ళచే జయించబడిన తారకలు గలదియు (నక్షత్రములను జయించునట్టి గోళ్ళు గలది). గొప్ప నీతికళ తెలిసినదియగు తార ఇట్లు చెప్పగా ఇంద్రనందనుడు నిందించి కోపముతో ఆమె ఇట్లనెను. ఏమే! చంద్రముక్షీ! ఇట్లాడదగునటే? వాడు నాకు తమ్ముడా? అంతులేని గర్వముతో విజృభించిన వాడగుచు, సింహమువలె గర్జించుచు, శౌర్యముతో విరోధియై యుద్ధమునకు నన్ను బిలవగా నేనేమని క్షమింతును? ఇంతీ! శూరులకు ప్రాణములు తీపియా? తారా! అపజయమెరుగని వారికని, యుద్ధమందు వెనుకంజ వేయని పరాక్రమవంతులకును, విరోధులుచేయు పరాభవమును సహించుట కంటే మరణమే శ్రేయస్కరము సుమా. వానట ఇట్లు వదలక యుద్ధమునకు నాకు రమ్మని యౌధ్ధ్యత్యముతో గర్జించు శూరుడట. నేనట అట్లన్న వానిని క్షమించు హీనుడనట. ఆహా! ఏమి వ్రాతలు వచ్చెను. ఓ భామిని! రాముడు నాకపకారము చేయునని భయపడకుము. ధర్మమునందాసక్తి గలవాడును, కృతజ్ఞుడును అయిన అతడు నన్నేమని నిష్కారణముగా హింసించును? మీ స్త్రీ సమూహమంతయును తిరిగి అంతఃపురమునకు వెళ్ళుడు. ఓ మానవతీమణి! నీవు నాపై గల స్థిరమగు భక్తి సంపదచే నింతయు దెల్పితివి. నేనెరుగుదును. నేను యుద్ధమునకు వెళ్ళి నీ మఱిది యొక్క గొప్ప గర్వమునణచి వచ్చెదను. తరుణి ! వాని ప్రాణములు తీయను. కర్రలచేతను,

ముష్టి ఘాతముల చేతను నొప్పించెదను. శౌర్యము క్షీణించిన వాడగు సుగ్రీవుడు చేయుచున్న గర్జనలను సహింపజాలను. ఓ భామిని! నా ప్రాణముల మీద ఒట్టు పెట్టుచున్నాను. జయమును గోరుచు వెడలుము. అనగా ఆ తెలివిగలది యగు తార వాలికి ప్రదక్షిణము చేసి కౌగలించుకొని మంత్రపూతముగా స్వత్స్యయనము చెప్పి స్త్రీలతో గూడ అంతఃపురమున కేగెను. ఇట్లు పెద్దగా నేడ్చుచూ తార మరలి గృహమునకు యేగగా వానరరాజు అధికమైన క్రోధముతో పురము దాటి వెడలెను.

## వాలి సుగ్రీవుల ద్వితీయ యుద్ధము

అధికమైన రోషముతో నిట్టూర్పులు నిగిడించుచు, శత్రువును చూచు కోరికతో అన్ని దిక్కులను వెదకి చూచుచూ, ప్రజ్వలించుచున్న అగ్నివంటి కాంతిగలవాడును, యుద్ధమునకు సంసిద్ధుడైయున్నవాడును, బంగారము వలె పచ్చని వర్ణము గలవాడును అగు సూర్యపుత్రుని చూచెను. చూచి అధికమైన ఉత్సాహముతో బట్టను గట్టిగా గట్టి చాలా క్రోధముతో పిడికిలి పైకెత్తి ఎదురుగా వెళ్ళగా, తనకెదురుగా వచ్చుచున్నవాడును, బంగారు మాలికను ధరించిన వాడును అగు వాలిని సూర్యపుత్రుడు చూచి అదురు బెదురు లేకుండ ఎదురు నడచెను. అట్లు తనకెదురు వచ్చుచున్న తమ్ముని జూచి అసూయ అధికమగు చుండగా వాలి ఇట్లనెను. ఇదిగో సుగ్రీవా! వేళ్ళు దగ్గరగా బిగిసిన నా ఈ పిడికిలిని చూడుమురా. పిడుగో యనునట్లు నీపై బడి నిన్నిప్పుడే చేధించి వైచును. తప్పుకొని వెళ్లకుమనగా, సుగ్రీవుడు ఇదిగో నా పిడికిలిని చూడుము. దీనితో మహా పరాక్రమముతో నీ తలను ఒక్క పోటుతోనే చితుక గొట్టెదనని మారు పలుకగా వాలి క్రుద్ధుడై సమీపించి గొప్ప ముష్టితో యట్టే కొట్టగా, శరీరమున కొండ యందలి సెలయేరు వలె విపరీతముగా నెత్తురు కారగా,

సూర్యనందనుడు ఒక వృక్షమును పెరికికొని కడు వేగముగా గిరగిరా తిప్పి గొప్ప బలశాలియైన ఆ వాలి శరీరము కంపించుటచే కలత చెందునట్లు మోదెను. గొప్ప భారముతో నిండియున్న నావ పెనుగాలి తాకిడిచే చలించు విధముగా సుగ్రీవుడు కొట్టిన చెట్టు దెబ్బకు మిక్కిలి వికలుడై ఇంద్రనందనుడు వణకెను. వాయువు యొక్కయు, గరుడుని యొక్కయు వేగముల వంటి వేగములు గలవారును, మహాబలశాలురును, అంతకంత కుప్పొంగుచున్న ధృఢశరీరము గలవారును, జయించుటకు శక్యముగాని వారును, శత్రువులను సంహరించు వారును అగు వాలి సుగ్రీవులు ఒకరికొకరు తీసుపోక, భయపడక, ఓటమి లేక యుద్ధరంగమున ఆకాశమునందు సూర్య చంద్రులవలె ప్రకాశించిరి. గొప్ప బలము, పరాక్రమము గలిగిన ఇంద్రసుతుని బలమంతకంతకు అధికమగు చుండెను. సూర్యపుత్రుని శౌర్య సార మంతకంతకు పటుత్వము గోల్పోయి తగ్గ జొచ్చెను. ఇంద్రపుత్రుని చేత దర్పము భగ్నమైన వాడయ్యెను. శౌర్యమును విడచిన వాడయ్యెను. రోషముతో పెచ్చుపెరిగి లాఘవముతో అనంతమైన శక్తితో సూర్య నందనుడు పోరాడుచుండెను. యుద్ధమునందు జయము పొందవలెననెడు కాంక్షతో పిడికిళ్ళను పిడికిళ్ళతో, చేతులను చేతులతో, చేవగల చెట్లను చెట్లతో, పాదములను పాదములతో, గోళ్ళను గోళ్ళతో కొట్టుచూ స్థిరులై ఆయిరువురు హేమాహేమీలు పోరాడిరి. ఒకరినొకరు వేగముగా సమీపించి తన్నుకొందురు. మహాక్రోధముతో ఒకరినొకరు చెట్లతో క్రింద పడగొట్టి పిడికిలి పోట్లచే నొప్పించుకొందురు. గొప్పపరాక్రమము గలవారై ఒకరినొకరు ముఖాముఖీగ ఔధ్యత్యముతో దొక్కుదురు. ఈ విధముగా వారిరువునకు ఇంద్రునకు, వృతాసురునకు వలె యుద్ధము జరుగుచుండెను. క్రమక్రమముగా వాలిచేత దెబ్బ తిని బలము నశియించిన వాడై సుగ్రీవుడలసిపోయి మరల మరల నలుదిక్కులు పరికించెను. బాధ నొందుచు నేల చూచుచుండెను.

## శ్రీరాముడు వాలిని నేల గూల్చుట

అట్లు గొప్ప ఆర్తితో బాధపడుచున్న సుగ్రీవుని దుఃస్థితిని చూచి, తీక్ష్ణమైన తేజముచే, అందముగా ప్రకాశించువాడును, శత్రు సంహారణ సమర్థుడును అయిన రామచంద్రుడు వాలిని వధించుటకు దాగిన ఘోర శరమును తీసి అల్లెత్రాడు శబ్దించుచుండగా వేగముగా వింటి సంధించెను. ఆ ధ్వనిచే భూమ్యాకాశముల సంచరించు అడవి జంతువులు, పక్షులు అధికమైన భయమునొందినవై తమ గతులు దప్పి నేలబడెను. పిడుగు బాటు వంటి భయంకర శబ్దముతో పిడుగోయనునట్లు బయలు వెడలిన బాణము వాసవ నందనుని యొక్క భుజ పరాక్రమమంతయు నణగిపోవునట్లుగా అతని వక్షస్థలము నందు నాటెను. ఆ శరమట్లు తన హృదయ మధ్యమున నాటగనే పూర్ణిమనాటి రాత్రి నాశనము చేయబడిన యింద్ర ధ్వజమనునట్లు సత్వహీనుడై శతమఖసూనుడు కూలెను.



# పదునేడవ సర్గము

**గొ**ప్పనయిన గొడ్డలి దెబ్బలచే నేలగూలిన వృక్షమువలె వాలి ఆ క్రూరమైన బాణపు దెబ్బచే నేలపై వేగముగా చాపకట్టుగా కూలగానే, భూమి, చంద్రుడు లేని ఆకాశము వలె, తేజము గోల్పోయెను. ఆ వీరుడు నేలబడియును, తేజమును, విక్రమమును, ప్రాణములను విడువడయ్యెను. ఇంద్రునిచే నీయబడినదియు, ప్రకాశవంతములైన మణులు పొదిగినదియును నగు బంగారు హారము తేజస్సును, ప్రాణములను, పరాక్రమలక్ష్మిని వాలి శరీరమున నిల్పి ప్రకాశించునట్లు చేసెను. మెడ యందున్న ఆ బంగారు మాలిక శరీరమున వెలుగుచుండగా పరాక్రమశాలియగు వాలి ఆ సమయమున సంధ్యవేళ కెంపు వర్ణముతో ప్రకాశించు మేఘముతో సాటియై ప్రకాశించెను. బంగారు మాలికతోడను, మర్మచేధన మొనరించిన బాణముతోడను, నిర్మలమగు దేహముతోడను ఇంద్రసూనుడు మూడు రంగులతో ప్రకాశించెను. వీరుడును, శతృసంహారుడును అయిన వాలికి స్వర్గ మార్గమును చూపించు ప్రభావము గలదియగు రామచంద్రుని వింటి నుండి వెలువడిన బాణమే ఆ యుద్ధరంగ మందు పరమపదమునకు కారణమయ్యెను. జ్వాలలు తొలగిన అగ్నిహోత్రుని విధముగను, కల్పాంతమున పడిపోయిన భాస్కరుని విధముగను, పుణ్యము నశించి స్వర్గలోకము నుండి భూమిపై పడిన యయాతి వలె ఉన్నవాడును, మహేంద్రుని వలె చెనకరాని వాడును, శుక్రుని వలె ఓర్వరాని బలము గలవాడును, ఇంద్రుని వలె విశాలమైన వక్షస్సు గలవాడును, ఇంద్రుని వలె విశాల లోచనములు గలవాడును, ప్రకాశించుచున్న ముఖము గలవాడును, మిక్కిలి పొడవైన బాహువులు గలవాడును, తనను గూల్చినట్టి దర్పము గలవానిని మెచ్చుకొనుచూ అతనిని చూడవలెనన్ను కోరికతో మెల్లమెల్లగా దిక్కులు

చూచుచున్న వాడును, ధృఢమైన పరాక్రమము గలవాడును అయినట్టి వాలిని, రామ విభుడు తమ్మునితో గూడి సమీపించెను.

### వాలి శ్రీరాముని దూషించుట

ఇట్లు సమీపించిన రాముని, గొప్ప పరాక్రమము గల లక్ష్మణుని చూచి వాలి స్ఫుటముగా ధర్మముతో గూడినదియు, మెత్తనిదియు, కఠినమును అగు విధముగా నిట్లు పలికెను, రామా! నీవు రాజపుత్రుడవు. శాస్త్రజ్ఞానము తెలిసిన వాడవు. స్థైర్యనిధివి. మంచి వంశమందు పుట్టిన వాడవు. గొప్ప శౌర్యము గలవాడవు. కీర్తికి నెలవైనవాడవు. ఇట్టి వాడవై ఉండియు యుద్ధరంగము నందు నేను మారు మొగమై యుండగా నన్ను త్రుంచుట మంచిదేనేమో ఆలోచించి చెప్పుము. రాముడు కరుణ, జ్ఞానములకు నిలవైన వాడు. జనులకు మేలు చేయువాడు. ఎంతో దయకు స్థానమైన వాడు. సమయజ్ఞుడు అని నీ మహిమాతిశయమును భూతజాలములన్నియు పొగడుచుండునే! దమము, శమము, ఓరిమి, ధర్మము, ధైర్యము, సత్యము, పరాక్రమము, మరి యపరాధుల యందు తగిన దండమును ఇవి యన్నియు భూపతుల యందుండు తగిన సద్గుణములని నేను నమ్మి, రాఘవా! తార వలదనుచున్నను వినకుండా యుద్ధము నకు వచ్చితిని. ఇచ్చట చచ్చితిని. రాముడు మంచి వంశమునందు జన్మించిన వాడు. రమ్యములైన గుణములు గలవాడు. నేనింకొకనితో పోరుచుండగా నాపై కేమని వచ్చువాడు ? ఏమని నన్ను వధించును? నే నీవిధముగా తలచి, నీ మొగమెట్టిదో నేను చూచియుండక పోవుట చేతనే పై విధముగా తలంచి యుద్ధము చేయుటకై వచ్చితిని. ఇచ్చట ప్రాణములను ధార పోసితిని. రామా! పచ్చగడ్డిచే కప్పబడిన నూయి వంటివాడవును, బూడిదలో నున్న అగ్ని వంటి వాడవును, ధర్మ వేషమును దాల్చిన అచ్చపు పాపకర్ముడవును అగు నిన్ను మాయలమారివి అని నేను మనస్సు నందు తలంపనైతిని, నా మతిహీనతచే నిట్లైతిని సుమా. రాఘవా! వినుము. నీ మొగము నేనెరగను, ఎప్పుడైనను నీ పురమందైనను, నీ రాజ్యమునందైనను చేసిన వాడను గాను. అడవులందు ఇష్టము తీరునట్లు గా ఏవియో కాయలు, కూరలు తినునట్టి వృక్ష సంచారినగు

మృగమును గదా. నేను వేరొకనితో పోరుచుండగా నన్ను చంపుటకు కారణమేమి? రాజుల సద్వంశమునందు భూమిపై జన్మించి, వేదాధ్యయనమును చేసి, తేజోవంతుడై, ఏ సందేహంబులు లేకుండునట్లు అన్నియు తెలిసికొని ఎవ్వడైన ఈ విధముగా ధర్మవేషమును ధరించి, అధర్మ ప్రవృత్తి గలవాడై, భూజనులకు కీడు గలుగునట్లు క్రూర కార్యమును జేయబూనునా? రాజా! నీవు రాజ వంశమున పుట్టిన వాడవు, ధర్మాత్ముడవను కీర్తిని పొందినవాడవు. ఇట్టి క్రూరమైన నడవడి గల వాడవేమిటికయ్యా ? పెద్దమనుష్యునివలే గొప్పదనము ప్రకటించుచూ తిరిగెదవు? సామము, దానము, సౌర్యోద్ధావత, సత్యము, క్షమ, ధర్మము, ధృతి, అపరాధులను దండించుట అను వాటిని రామా! బుద్ధిమంతులలో శ్రేష్ఠులు రాజు గుణములని యందురు. మేమన్నచో, వన సంచారులము. ఫలములను, దుంపలును తిని జీవించు మృగములము. వినుము. మరినీవో? పురుషుడవు మనుష్యులలో శ్రేష్ఠుడవు. ఇంత బుద్ధిమాలితి వేమీ? రామా! వింటివా? భూమియో, బంగారమో, వెండియో కలహించుటకు కారణములగు చుండును గదా. నా వనములందలి ఫల, మూలములపై ఆశ పడితివా? వాని కొరకా? నన్ను చంపితివి. వినుము. భయమును, బుద్ధి వినయమును, అనుగ్రహమును, నిగ్రహమును అనునవి వరుసగా సజ్జనులను, దుర్జనులను అను రాజు లందు వేరు వేరుగా గోచరించుచుండును, రాజులు ఇష్టము వచ్చినట్లు సంచరింపరాదు, నీవో ఇంద్రియములకు ఉద్వేగము గలిగించు కామ ప్రధానమైన వేళయందు కోపముతో యుద్ధమునకు కాలు దృవ్వి ధర్మహీనుడవగుటచే, మర్యాదను తలంపవైతివి ? ధనమును సంపాదించుట యందు మర్యాద లేదు. ధర్మములందు శ్రద్ధలేదు. కోరికలకు లొంగినవాడవై, నిగ్రహములేని ఇంద్రియములు తీసుకొని వెళ్ళినట్లంతయు వెళ్ళువాడవు.

రాజపుత్రా! అపరాధము చేయని నన్ను వికటమైన బాణముచే ధర్మ విరుద్ధముగా వధించి ధర్మాత్ముల సభలో ఈ అపరాధము తొలగుటకేమి చెప్పెదవు? దొంగయు, ప్రాణములను హింసించువాడును, కొండెములు చెప్పువాడును, గురుపత్ని గమనము చేసినవాడును, రాజును చంపినవాడును,

పిసినిగొట్టువాడును, మిత్రులను, బ్రాహ్మణులను వధించిన క్రూరాత్ముడును, నాస్తికాధముడును, గోహత్య చేసిన వాడును, అన్నగారి కంటే ముందు వివాహమాడిన తమ్ముడును నిజముగా వీరందరును నరకవాసులు సుమా. నీవంటి సుజనులు నా చర్మమును కప్పుకొనరు. నా ఎముకలను కూడా తాకరు. మాంసమును తినరు మరియు వెంట్రుకలను నుపయోగింపరు గదా. నన్నెందులకు చంపివేసితివి? ఐదు గోళ్ళుగల జంతువులందు ఆళువయు(ఒక విధమగు పంది) ఏదుపందియు, తాబేలును, ఉడుమును, కుందేలును అనునవి మాత్రమే బ్రాహ్మణులకును, రాజులకును తినదగినవి సుమా. నా ఎముకలను, నా చర్మమును బుద్ధిమంతులు అసహ్యములని పారవేసెదరు. నా మాంసమును ముట్టరు. రామా! ఇట్టి పంచనఖమును జంపుట నీకు న్యాయమా? అక్కటా! సర్వము తెలిసిన తార చెప్పిన సత్య వాక్యములను, హితమును, లక్ష్యపెట్టక తెలివిమాలి వచ్చి తత్ఫలితమును నిదిగో అనుభవించుచున్నాడను. సూర్యకుల తిలకా! నీవు భర్తవు కాగా ఈ భూమి ధూర్తుడైన భర్త దాపురించిన పరమ పవిత్ర శీలవతియగు, అనాధయై యొప్పుచున్నది. రాజశ్రేష్ఠా! వంచనపరుడవు, శేతుడవు, నీచమైన బుద్ధి గలవాడవు, జంభముచే లొంగదీయబడిన ఇంద్రియములు గలవాడవు నీవు. ఆ దశరథ మహారాజు పరమ శీలము గలవాడు. గొప్ప మహానుభావుడు. ఓ కఠినశీలుడా! అతని కడుపుచెడనెట్లు పుట్టితివి? నడవడియెడు బంధనమును త్రెంచుకొన్నదియు, శీలముచే పొగడదగిన ధర్మమార్గమనెడు మార్గముల నుల్లఘించినదియును, ధర్మమనెడు అంకుశము లేనిదియు నగు రాముడనెడు గజముచే చిక్కి, నా కర్మ వశమున యముని చూడవలసి వచ్చెను. పెద్దలందరు ఛీ ఛీ యనునట్లు గొప్పదనము పోగొట్టునట్టి ఇట్టి అశుభము, అయోగ్యమునైన పనిని చేసి ఏ మొగముతో సుజనులైన వారి ఎదుట పడెదవు? ఇట్టి పనికి ఏమి సమాధానము చెప్పుదువు? నీతో తగవులకు దిగని తటస్థునిపై మగదనమును చూపితివి గదా. పగబూనిన విరోధులయందా మగతనము లేదే? ఎట్టి మగాడవయ్యా? నా కన్నుల యెదుట గనిపించి నీవు యుద్ధము చేసి యున్నచో, ఓ పోకలమారి! తృటిలో నీకు

మహిష వాహనునిచే (యమునిచే) గౌరవమును చేయించియుండనా? నేను శౌర్యము గావదినయ్యెను. చాటున నన్ను నీచేత తనివి దీరా డ్రావి నిద్రించిన త్రాగు బోతు చచ్చినట్లు చావ వలసి వచ్చెను. ముందుగా నీకథ నాకు కొంచమైనను చెప్పకపోయితివి గాని, నీవే కారణముచేత సుగ్రీవుని ఇష్టము దీర్చుటకై నన్ను వధించెను? ఆ కపటాత్ముడగు రావణుని యుద్ధమందు చావ గొట్టి కంఠమును పాశముతో గట్టి గొప్ప పరాక్రమముతో ఇచ్చుటికి తేకుందునా? ఒక్క పూటలో భూపుత్రిని తోడ్కొని రాక పోదునా? పాతాళమున దాచినను, సాగరమున మరుగుపరచినను భూపుత్రిని పూర్వము శ్రీహయగ్రీవుడు శ్వేతాశతరిణి తెచ్చినట్లు త్వరగా తెచ్చియుండనా? నేను స్వర్గస్థుడను కాగా, సుగ్రీవుడు రాజ్యమేలుటకు ఎంతో దగినవాడు. దాయాదుడగుటచే అతడు నన్ను చంపుట తగును. గానీ నీవీ విరుద్ధమైన పద్ధతిలో నన్ను హింసించితివి. ఓ భూపతీ! ఇట్టి పని ఉగ్రము, అధర్మము నగుటచే యుక్త కార్యమనదగదు. పుట్టిన వారెప్పుడో ఒకప్పుడు చచ్చుట సహజము. దానికి విచారింపను. నీవు చేసిన ఈ దుర్మార్గపు పనికి సమాధానమేమి చెప్పెదవో? ఏదేని యుక్తిని చూడుము. అని పల్కుచూ నోరెండిపోచుండ శరాఘాతముచే శరీరమంతయూ బాధ వ్యాపించుచుండగా భరించలేకపోవుటచే తేజస్సు తొలగిన వాడై, వాలి రామునూరక చూచుచుండెను.



# పదునెనిమిదవ సర్గము

## శ్రీరాముడు వాలి దూషణములకు సమాధానము చెప్పుట

తెలివిని కోల్పోవుచు ధర్మార్థసహితముగను, హితముగను, పరుషముగను, వాలి పల్కగా, కాంతి తొరగిన సూర్యుని విధముగను, జలములేని మేఘము వలెను, చల్లారిపోయిన అగ్నిచందముగను భూమిపై బడియున్న ఆ వానర రాజును జూచి ధర్మార్థగుణ సహితముగా రాముడిట్లు పల్కెను. ఓ వానరేంద్రా! ధర్మార్థకామ విధమును గాని లౌకికాచార విధమును గాని తెలిసికొనలేక బాల్యచాపల్యమున నన్ను దూషించినచో ఫలమున్నదా? ఆచార్యులను, వృద్ధులను, బుధులను, ఆర్యులను అడిగి తెలిసికొనక యిట్లు కోతి చాపల్యముచే బలుకనేల? పర్వతములు, అరణ్యములు, వనములు అను వానితో గూడ ఈ భూమి యెంతయు ఇక్ష్వాకులదని నీవు తెలిసికొనుము. ఇందలి మనుష్యులను, మృగములను, పక్షులను పాలింపను, చంపను వారే అధికారులు. ధర్మకామార్థ తత్వజ్ఞుడును, ఋజువర్తనుడును, నిగ్రహానుగ్రహములందు నైపుణ్యము గలవాడును, ధర్మరక్షకుడును అగు భరతుడు దీనిని నేడు పాలించుచున్నాడు సుమా. వాలీ ! సత్యమును, న్యాయమును, విషయమును, శౌర్యమును గలిగి దేశకాలముల నెఱిగిన రాజు భరతుడే. అట్టి భరతుని యాజ్ఞచే జగమందు ధర్మమును రక్షించు కోరికతో అడ్డు లేకుండగా నేనును మఱికొందఱు రాజులును సంచరించెదము. ఇట్లా నిశ్చలధర్మశీలుడైన భరతుడు రాజ్యమేలుచుండగా నేనట్టి ధర్మమునకు హాని చేయజాలను. మేము స్వధర్మమును వీడక భూమియందున్న ధర్మహీనులైన పురుషులను భరతుని యాజ్ఞను పొంది దండించెదము. దీనియందు దోసమేమున్నదో తెలియజెప్పుము. నీవు ధర్మమును విడిచి, క్రూరమైన నింద్యమైన పనులను చేయుచు అసహ్యమైన కామతంత్రమునే

ముఖ్యమని నమ్మి రాజధర్మమును తప్పిన వాడవైతివి. నీకిది తగియున్నదా ? నీ చరిత్రను నీవు ఆలోచించుకొనక గర్వముతో ఇతరులను దూషింపనేల? తండ్రియు, అన్నయు, ఇష్టముతో విద్యను చెప్పినవాడును ఈ ముగ్గురును ఓ వానరవీరా ! ధర్మపథమందు నడచువారికి తమ తండ్రులే సుమా. తమ్ముడును, సద్గుణములు గల తన శిష్యుడును, తన పుత్రుడును, తనయుని యట్టివారే సుమా. ఇది ధర్మప్రమాణము. ఓ వానరా ! ధర్మసూక్ష్మ విధానమును తెలిసికొనుట మహాసుధీవరులకైనను కష్టతరము. హృదయములలోన ఉండునట్టి సమస్తచరాచరాత్మయే పరమమైన శుభాశుభములను బాగుగా తెలిసికొనజాలును. ధర్మతత్వమును మూలముట్టుగా యథావిధిగా తెలిసికొనుట నీ తరమా ? వినుము. నీవు చపలుడవు. నీకు మూఢులును, చపలచిత్తులునైన కోతులు మిత్రులు. పుట్టు గ్రుడ్డివానితో జేరిన పుట్టు గ్రుడ్డివానివలే నీవు ధర్మమును తెలియగలుగుదువా? నేను చెప్పు మాటలను వినుము. స్పష్టముగా చెప్పెదను. మనస్సునందు కేవలము కోపముతో నన్ను తిట్టబోకుము. నిన్ను చంపిన కారణము నేను చెప్పెదను వినుము. పూర్వమునుండియు వచ్చుచున్న సనాతన ధర్మమును విడిచి తమ్ముడు జీవించి యుండగానే అతని భార్యను, నీకు కోడలి వంటి దానిని, రుమాంగనను నీవు కామవృత్తివై పాపపు పద్ధతితో కూడితివి. దీనిని కాదని చెప్పెదవా ? చెప్పుము. ధర్మ మార్గమును విడిచిన వాడవై కేవలము దుష్కాయముగలవాడవై అడ్డులేక తిరుగుచు స్వంత తమ్ముని భార్యను పట్టుటచే నేనీవిధముగా నిన్నిచ్చట దండింప వలసివచ్చెను. ధర్మమును వీడి జనులకు హితకరమగు పనులకు ఆచారములకు చాలా దూరమై మర్యాద లేకుండా తిరుగునట్టి దుర్మార్గునకు చివరకు దండనమే తగిన విధము సుమా. గొప్పవైభవముతో శోభించుచు కీర్తి గాంచిన రాజవంశమునందు క్షత్రియుడనై పుట్టితిని. అట్టి రాజపుత్రుడను ధర్మమును తలంపక అతిపాపము చేసిన కామవృత్తివగు నిన్ను చూచి ఎట్లు సహింతును. శాంతి నొందుదును నీవే చెప్పుము. తన కుమార్తె తోడను, తన చెల్లెలి తోడను, తన తమ్ముడి భార్య తోడను గూడిన వానికి వానరరాజా ! వధించుట యొక్కటే శిక్షగా దండనీతి

శాస్త్రమునందు నియమింపబడియున్నది సుమా. భరతుడు రాజు. మేమేమో ఆ రాజు ఆదేశానుసారము భూమియంతయు దిరిగి ధర్మము తప్పిన వారిని వెదికి ఆర్యజనులు సమ్మతించునట్లు శిక్షించెదము. దుర్జనులను శిక్షించుటయు, ధర్మమునార్జించుటయు భరతుడు చేయుచుండును. కనుక మేము కూడా ఆ మార్గమును వదిలి కర్తవ్యమునుపేక్షించుట తగిన పనియేనా ? పవిత్రమైన స్నేహమునకు సుగ్రీవుడును, లక్ష్మణుడును ఓ వానరరాజా ! నామనస్సున కొక్కటియేసుమా. ఆ స్నేహము యొక్క ఫలము రాజ్యసంపదలును భార్యలును లభించుటే. ఈ మహాపరాక్రమశాలి నాకు మేలు చేయగలడు. నేనేవిధముగా ఏ కారణముచే నీతనితో స్నేహము చేయక ఉపేక్షింతును ? వానర శ్రేష్ఠులయొక్క సమక్షమందు పరిపూర్ణమైన మనస్సుతో నేను ప్రతిజ్ఞ చేసితిని. గొప్ప బలము గలవాడా ! శపథము చేసియు నాయట్టివాడు తిరిగిపోవుట తగునా ? నీవు పాలించునట్టి ఈ వనములు పర్వతములు గల భూములన్నియు ఇక్ష్వాకులమైన మావే అగును కదా? దుష్టులను శిక్షించుటయు, శిష్టులను రక్షించుటయు రాజులకేంద్దైనను విధాయకమే కదా. నీవు తమ్ముని భార్య, గృహము మొదలగువానినన్నింటిని తీసుకుని వానిని కట్టుబట్టలతో పంపలేదా ? తమ్ముని భార్యని పొందినవానికి శిక్ష విధించటయేయని చెప్పబడలేదా ? అతనితో నేను అగ్ని సాక్షిగా స్నేహము చేసి అతనికి మేలు చేసేదనని ప్రతిజ్ఞ చేయలేదా ? పల్కి బొంకదగునా ? ఈ మాటలలో ఏది అబద్ధమో తెలియునట్లు చెప్పుము. సజ్జనులచే మెచ్చుబడునట్టి ధర్మముతో గూడిన ఇన్ని కారణములచేత ఓ వానరేంద్రా నిన్ను వధించుటే ధర్మము. ఓ మహాబలశాలి ఆ విధమును తలచి చూడుము. ధర్మము తెలిసిన మిత్రుడు ధర్మప్రకారం నడచుకొను వానికేప్పుడును సాయపడదగును. నీవును ధర్మజ్ఞుడవు. ఇది నీవు చేసిన పాపమునకు ప్రాయశ్చిత్తమని మనస్సునందు భావింపుము. నడవడినందు ప్రేమగలవియు, శాస్త్రజ్ఞులు సమ్మతించినవియు సజ్జనులైనవారు ఆచరించునవియు నగు మునుపు చెప్పిన వాక్యములు ఓ వీరా! నాకు ప్రమాణములు, వానిని చెప్పెదను వినుము.

## శ్రీరాముడు వాలికి ధర్మశాస్త్రములు చెప్పుట

పాపములు చేసిన జనులు రాజులచేత దండింపబడిన వారై తాము గొప్పపుణ్యము చేసినవారివలె స్వర్గలోకమునకు వెళ్ళుచుందురు. దొంగ దొంగతనము చేసినచో అతడు రాజుచే శిక్షింపబడియో కాదేని శిక్షింపబడక విడువబడియో ఓ వెరశ్రేష్ఠా పాపమునుండి విముక్తుడగుచున్నాడు. కానీ దోషము చేసినట్టి వారిని శాసింపలేని రాజు ఆ దోషమును తాను బొందును. ఇంద్రతనయా ! ధర్మవిధానము నీకు తెలియవచ్చినదా ? గొప్ప విఖ్యాతి గలిగినవాడును, మా వంశమున జన్మించినవాడును అగు మాంధాత యనునతడు శ్రమణుడొకడు ధర్మభంగమగునట్లు నీవలెనే పాపమొనరింపగా అతనిని భయంకరముగా దండింపలేదా ? కొందఱు రాజులారంభమునందే ధర్మమును తెలిసికొనలేక మత్తెక్కినవారై యుండియు న్యాయవిచక్షణ చేయు సమయమున పూర్తిగా జాగ్రత్తవహించి పాపజనసమూహములను తగిన విధముగా దండించి పాప సంచయములను తొలగింప చేయలేదా ? కపీశ్వరా! కాన నీవు పరితాపమును పొందకుము. నిన్ను వధించుట ధర్మమార్గ మాలోచింపగా తప్పక చేయవలసినదే. వానరేంద్రా ! మేము శాస్త్రబద్ధులమగుట చేత ఈ విషయమున మాకు స్వాతంత్రయము లేదుసుమా. అదియును గాక ఇంకొక గొప్ప కారణము గలదు వినుము. దానిచే నీ మనస్సునందు గల సందేహమును అధికమైన కోపము తీరిపోవును. నీవు తెలియక పోవుటచే నిందించుచు కఠినమైన వాక్యములాడుట వలన నామనస్సునందు కొంచమైనా కోపముగాని చింతగాని కలుగుట లేదు. వానరరాజా ! నా మాటలు నమ్ముము. వలలు పన్నియో, వురులొడ్డియో, నదులనుతవ్వి గోతులనేర్పాటుచేసియో, ఎన్నెన్ని విధములుగానో, నేమృగములనైనను, ఎదురుగానుండిగాని, మాటుననుండిగాని, అనుకూలముగా నమ్మి నిలిచియున్నగాని, ఇంకొక దిక్కుగా మొగముపెట్టి ఏమరుపాటుగానున్నగాని, మాంసమందాభిలాషగల మనుష్యులు చంపుచుండుట చూచుటలేదా? దానివలన పాపములుగలుగునా? ఎంతో ధర్మకోవిదులైన వారు వేటకు వెళ్ళుట లేదా? నీవు కోతివి. నేను క్షత్రియుడనుగాన యుద్ధము చేసినను,

చేయకున్నను చంపవచ్చును. గొప్ప వ్రణముచే బాధపడుచున్నవానికి శస్త్రచికిత్సకునివలే భూపాలుడు దుర్లభమైన ధర్మ పద్ధతిననుసరించి జీవులను రక్షించి క్షేమము కలుగజేయుచుండును. వారలు దానిని వొల్లకుండినను పాలించుటకు ప్రభువు పాల్పడియుండుటయే ధర్మము. వానరోత్తమా ! కావున రాజును చంపరాదు, తిట్టరాదు, విపరీతపు మాటలేవిధముగను పల్కరాదు. అవహేళనము చేయరాదు. ఆ రాజొక మాట చెప్పినచో పనిగట్టుకొని తిరస్కారపు మాటలాడరాదు. ఈ భూమియందు దేవతలే మానవరూపమున ధర్మరక్షకై త్రిమ్మరుచుందురు. కేవలము కోపమే ప్రధానముగా జేసికొని ధర్మసూక్ష్మము నించుకనైనా నాలోచింపక అడ్డులేక నోటికివచ్చినట్లెల్ల నన్ను తిట్టితివి. వానరరాజా ! వినుము. నేను తాతతండ్రుల ప్రశస్తమైన ధర్మమును విడువనైతిని. ఇక నీవు నాలుకతీట పోవునట్లుగా నన్ను తిట్టుదువేని తిట్టుము. మెచ్చెదవేని మెచ్చుకొనుము. అని రామచంద్రుడిట్లాడిన వాక్యములాలకించి ఆ వానరరాజు రామనృపాలునియందు దోషము లేకుండుటను గుర్తించి ఆ అనఘుని గొఱమాలిన మాటల నెన్నింటినో ప్రేలితినేయని మనస్సునందు చాల విచారించెను. ధర్మ విధానమందు నిశ్చయము నొందినవాడై ఇట్లు చెప్పెను.

## వాలి రామ వాక్యములకు సమాధానపడి తన్ను క్షమింప వేడుట

ఓ రామచంద్రా ! నీవిపుడు చెప్పినదంతయు యదార్థము. అందు సందేహ మేమాత్రమును లేదు. నా వంటి హీనులా, నీవంటి బుద్ధిమంతులలో శ్రేష్ఠులకు మాఱు చెప్పుటకు శక్తి గలవారలు? నేనజ్ఞానినై యెమేమో పల్కినాడను. తండ్రీ! నమస్కరించెదను. నన్ను మన్నింపుము. నీవు సామాన్యుడవా? వినయవంతుడవు. పరమార్థ తత్వము తెలిసినవారిలో నుత్తముడవు. అకుంఠితములైన కారణములు కార్యసిద్ధులు అనువాని విషయమున నీ శ్రేష్ఠమగు బుద్ధి చక్కగా నిశ్చయింపగలది. కడు ప్రసన్నమైనది. దేవా ! నా బోటివారలు బుద్ధియందు నిన్ను తప్పుపట్ట నేర్పరులా? నేను ధర్మముల నేమియు జేయక అధర్మముల నేన్నిటినో చేసి అధర్మ దుష్కర్ముడనైతిని. ఓ శర్మదా ! (శుభము నొసగువాడా !) కరుణతో నన్ను ధర్మపుమాటలచే శాంతింప జేయుమయ్యా ! రామచంద్రా!

నేనిట్లు వధింపబడుటకై మనస్సునందు విచారించుటలేదు. ప్రియురాలైన తార కోసమై చింతించుటలేదు. బంధువులకై అంగలార్వను. బంగారు బాహుపురులు గలవాడగు నా ముద్దు కుమారుని అంగదుని మనస్సునందు తలంచినచో నాకు గలుగుచున్న దుఃఖము రఘురామా ! ఏమని చెప్పగలవాడను.

## వాలి యంగదుని శ్రీరామునకు నప్పగించుట

నా కతడొక్కడే పుత్రుడు. అతడుత్తమ గుణములు కలవాడు. నేనతని నెంతో ప్రేమతోను గారాబముగాను పెంచితిని. ఇప్పుడిట్లు నేను దిక్కులేక నేలబడుట చూచి దీనతతో పోయితివా తండ్రీ ! యని నీరింకిపోయిన సరస్సువలె నెంత వికృతిజెందునో యని తల్లడిల్లుచున్నాను. నాయొద్ద బాగుగా చనవు మరగినవాడు. నన్నువిడిచి యొక్కడు నుండువాడుకాదు. నాకు చూడగా నత నొక్కడే కుమారుడు. అతడైనను బాలుడు. తను తప్పులను తనంతతానెఱుగడు. ఇక వాడేగతి పట్టిపోవునోగదా. రామా ! నీవేయింక వానికి దిక్కు. తల్లివి, తండ్రివి నీవే సుమా. అంగదుని యందును సూర్యపుత్రుని యందును సమమైన అనురాగము నుంపుము. పవిత్రమైన గుణములు గలవాడా ! వానిని త్రుంచినను, పాలముంచినను, ఏ కార్యములనైనను వినియోగించినను నీవే సుమా. భరతునిపై లక్ష్మణునిపై ఎట్టి ప్రీతి చూపెదవో అట్టి అధికమైన ప్రేమను రామభద్రా ! భాస్కర పుత్రునిపైనను, అంగదుని పైనను చూపించుము. మంచి గుణములు గలిగిన తార పరమ యోగ్యురాలు. నేను చేసిన ఈ దోషముచేత సుగ్రీవుని పట్ల తానును దోషము చేసినదైనది. దానికై ఈర్ష్య చేత సూర్యసుతుడు హీనముగా జూచుచు నా భార్యను అవమానింపకుండునట్లు దయాపరుడవై అతని నియమింపుము. మీ ఆజ్ఞలనందు నడచుచు మీ మనస్సెరిగి సేవించినచో మీ దయాబలముచే ఈ భూమినేలుట చెప్పవలెనా ! ఆ స్వర్గపదమైనను సంపాదింప గలిగియుండును. ఓ శ్రీకరా ! పంకజాక్షా ! ఇది సిద్ధము – సత్యము. నేనెఱుంగుదును సుమా. రాముడు జయింపరానివాడు. వలదు పోకుము పోకుమని తార అనేక విధములుగా విడువక చెప్పినను రఘోత్తమా ! నీ వలన

యుద్ధమున చావవలెనని యాశ చేతనే గదా ! నేను సూర్యపుత్రునితో యుద్ధము చేయుటకై వేగముగా వచ్చితిని ! జానకీనాథా ! (శ్రీరాముడు తప్పు వాలిని చంపువాడు లేడు. శ్రీరామునిచే వాలి యుద్ధమున వీరమరణము కోరెను. యెదుటబడిన వాలి శరణమోయని పాపమునకు శిక్ష లేకపోవునేయని చాటుగ నుండి ఇంగితమెఱిగిన శ్రీరాముడు కొట్టెను). అని మ్రొక్కి యూరకుండగా విని రఘురాముడు ప్రఖ్యాతమైన ధర్మముతో ప్రకాశించు వాక్యముల నావనచర నాయకుని శాంతింపజేయుచునిట్లు పల్కెను. ఓ వనచరాధీశ్వరా ! ఈ విషయమున నించుకైన దగవకుము. మా నిమిత్తముగా నైనను చింతింపకుము. నీ గుఱించియైనను విచారింపవలదు. నీవు చేయగూడని పని యందాసక్తుడ వగుటచే నేను ప్రాయశ్చిత్తము చేయవలసివచ్చెను. కారణము లేకుండా నేకార్యము జరగదుకదా. అకార్యమును చేయుటచే నీవే కారణమవు. నిన్ను దండించుటచేత నేను కార్యమునైతిని. దండింపబడిన దంద్యుడును, దండనీతి ననుసరించి దండించినవాడును ఇంద్రపుత్రా ! ఇరువురును నరకమార్గమున పోరు సుమా ! నీవకార్యమును చేసితివి. నేను దానికి సరియైన దండనము చేసితిని. నీవు పాపములను పోగొట్లుకొనిన వాడవై ధర్మ పద్ధతిననుసరించి నిర్మలమైన పరిశుద్ధరూపమును తప్పక పొందెదవు. దీనికై యింక ఆయాసమును, ఈర్ష్యను, రోషమును పొందకుము. వానరరాజా ! విధిని దాటసఖ్యమా ? అంగదుని గూర్చి నీ మనస్సునందు చింతనొందబోకుము. నీ పుత్రుడు నీ కేట్టివాడో నాకును సుగ్రీవునకును అట్లే పరమ ప్రీతిపాత్రుడు సుమా ! అని పల్కగా ధర్మ మార్గమందు నడుచు రాముడు పల్కిన వాక్యములను విని ఆ వానరవీరుడు మనస్సునందు సందేహమును విడిచి “ మహానుభావా ! నీయొక్క వాడియైన బాణము నాయందు ప్రవేశించి కాల్చుటచే తెలివిని గోల్పోయి నిన్ను తిట్టితిని. ఇంద్ర సమాన విక్రమా ! రఘునందనా ! నన్ను క్షమింపవయ్యా ! “ అని పల్కెను.

# పందొమ్మిదవ సర్గము

## వాలి మృతిని విని తార కిష్కింధ వెడలి వచ్చుట

ఈ విధముగా ఆ రాజపుత్రుని సహేతుకమైన మాటలకు ప్రత్యుత్తరమేమియు చెప్పలేక పెద్దగా మూర్ఛగ్రమ్మగా వానరనాధుడు వ్యధతో నేల బడియుండెను. విపరీతముగా రాళ్ళ చేతను, వృక్షములచేతను గొట్టబడి కీళ్లన్నియు నెక్కువగా నొచ్చి బాణము నాటిన శరీరము గలవాడై కాళ్ళయందు శక్తి తగ్గిపోవగా బాణవేదనచే రాలిపడియుండెను. అక్కడ తార రామబాణహతిచే తన భర్త మరణించుట విని గొప్పశోకము భారముచేతను భయవేగముచేతను పుత్రినితో గలిసి కిష్కింధాపట్టణమును వెడలివచ్చెను. అంగదుని పరివారమైన వానరులు విల్లు ధరించిన రామచంద్రుని జూచి బెదరి నాల్గు దిక్కులకును చెదరి పారిపోయిరి. తమ గుంపు యొక్క నాధుడు మరణింపగా అందలి మృగములు బెదరి పారునట్లు రామబాణముచే వెంటాడబడుచున్న వారి వలె పరువెత్తుచున్న వారలను చూచి తార యిట్లు పలికెను. తమ్ముడు రాజ్యము కొఱకుగా అన్నను దూరముననుండి వచ్చు బాణములచే చంపిచ్చెను. భీరువులారా! ఇన్నాళ్ళును మీరందఱు ఆ యింద్ర పుత్రుని నిత్యమును విడవక సేవించియు నిప్పుడిట్లు పర్వత గుహలకు పారిపోవుట తగునా?

## వానరులు తారకు వాలిపాటు తెలుపుట

అనుచున్న ఆ తార మాటలను విని వారందరూ యుక్తి యుక్తముగా నిట్లనిరి. ఓ జీవించియున్న పుత్రుడు గలదానా! ఇట్లువచ్చుటర్హమూకాదు పొమ్ము. నీ పుత్రుని రక్షించుకొమ్ము. అక్కటా దండధరుడే యిట్లు రామరూపియై దూరము

నుండి పడునట్టి బాణముచే వనచరనాథుని చంపెను. ఓ రాజపత్నీ ! గుండ్రాళ్ళతో నడచియు, చెట్లచే తీవ్రముగా మోదియు వాలి ధైర్యముతో శబ్దించుచుండగా రాముడు తీక్ష్ణములైన వజ్ర సన్నిభములైన బాణములు వేయుచు పడగొట్టెను. ఇంద్రసమానతేజుడు వాలి యిట్లు కూలుట చూచి వారింపరాని మహా భయముతో కోతులన్నియు పురాభిముఖముగా తడబడుచు పరుగెత్తిరి. కోట ద్వారములందంతటను కాపుంచుము. జాగ్రత్తగా నుండుము. వైభవముగా అంగదునకభిషేకము జరిపించినచో ఎల్లశాఖామృగములు నతనిని సేవించును సుమా. ఓ తారాదేవీ! ఇచట నుండుట నీకిష్టమైనచో దానివలన ప్రమాదము సంభవించును. ఎట్లాంటివేని, భార్యలు లేనివారలును, భార్యలున్నను పర భార్యలను గోరు వారలను అగు వానరులు ఇంతకుమునుపు వాలిచే పురము నుండి వేడలగొట్టబడిన వారు వచ్చి పురమున నిండెదరు. వారికిని, ఊరివారికిని నివారింపరాని కలహము లెప్పుడును జరుగుచుండును. అని వారికి తోచిన విధముగా అల్పులైన వానరులనుచున్న మాటలను విని ఆ చారుహాసిని (వారి మతిలేని మాటలు విని అంత దుఃఖము నందును ఆమెకు నవ్వు వచ్చెను) గర్వము నరసి తనకు తగిన విధమును వాడిపోయిన మొగముతో బాష్పములు వరదలు కట్టుచుండగా పైటచెంగుతో తుడుచుకొనుచు వానరులతో నిట్లనెను. అక్కటా! ఇట్టిభర్త మహితాత్ముడు, వానరసింహుడునగు వాలియే నాకు దక్కకుండా బోయెనట. అయ్యో ! ఇక ధారుణి రాజ్యమేల? నాకు ఇంకెక్కడి పుత్రుడు? శరీరమేమిటికి ? ఇవా నన్నుద్ధరించెడివి? ఆ రాజు బాణముచే కొట్టబడిన నా భర్త పాదమూలమునకు చక్కగా పోయెదను.

**తార వాలిం జేరబోవుట**

అని విలపించుచు చేతులతో తన ఱొమ్మును మోదికొనుచు వచ్చి దానవుల సమూహములకు యముని వంటివాడును, యుద్ధమున వెనుదిరుగని వాడును,

ఇంద్రుడు వజ్రాయుధములతో కొండలను బోలె పర్వతముల నెగమీటువాడును, గాలిని మించు వేగముగల వాడును, మేఘమువలే గర్జించు వాడును, ఇంద్రునితో సమానమైన పరాక్రమము గల వాడును, శూరునిచే పడగొట్టబడిన వాడును, శూరుడును, వైరుల శబ్ధమునణగించు భయంకర కంఠధ్వని గలవాడును, అగు ఆ వానరవీరుని అంత అంత దూరమున నుండి చూచుచు కీళ్లుపట్టు తప్పుచుండగా తూలి పడుచు అతనిని చేరవచ్చెను. పెద్దగా వర్షము కురిసిన పిమ్మట నుండు మేఘము వలె నున్న వాడును, పెద్దపులి మాంసము కొఱకై సంహరింపగ నేలపైబడిన సింహమోయనునట్లుగా గూలిన వాడును, సర్పమును పట్టుటకై నాగవిరోధియగు గరుడునిచే గూల్చబడిన మనోహర వేదికగల చైత్యమువలే నున్నవాడును అగు వాలిని, గొప్ప వింటి నాలంబనముగా గొని నిలిచియున్న రాముని, అతని తమ్ముడగు లక్ష్మణుని, ఆ రాజులయొద్ద నిలిచియున్న వాలి సోదరుడగు సుగ్రీవుని పతివ్రత యగు తార చూచెను. వారిని దాటి తన భర్తను జేరి బాణము చేత కొట్టబడి నేలమీద పడిపోయి యున్న భర్తను జూచి భరింపరాని ఆర్తితో దుఃఖభారముతో భూమి పై నొరగి కొంతవడికి నిద్రలేచిన దాని వలె లేచి ఓ ప్రియనాధా! మనోహరా! అని యెడ్చుచు, దూరమైన మృత్యుపాశములచే గట్టబడిన పెనిమిటిని మాటిమాటికి చూచి యేడ్చుచున్న వదినను, సుకుమారుడైన కుమారుని అంగదుని చూచి సూర్యపుత్రుడు భరింపరాని మహార్తితో వేడిబాష్పములు పైపైకి వచ్చుచుండగా దుఃఖ సముద్రమునందు మునిగెను.



# ఇరువదవ సర్గము

## తారా విలాపము

క్రూరమైన బాణముచే గొట్టబడినవాడును, మదించిన ఏనుగువంటివాడును, ఇంద్రసమానుడును అగు హృదయేశ్వరుని యొక్క దుఃఖభారము చేత తపింపజేయబడిన మనస్సుగలదై సమీపించి తార కౌగిట బొదివిపట్టుకుని చెట్టు సమూలముగా తెగిపడినట్లు అతని శరీరము మీద విలపించుచు హా యని పడిపోయెను. ప్రాణనాథా ! ఎటువంటి యుద్ధములందైనను జయము నొందగలిగిన నీకు నేడిట్టి పాటు కలిగేనా ? ఏ అపరాధము చేయని నేను హా యని విలపించుచుండగా బదులు మాటాడవేల ప్రాణనాథా ? నా దోసమేమైన నున్నదా స్వామీ ! నన్నిట్లు విడిచి పోవుటకు కారణమేమి ప్రాణనాథా! ఏ మాత్రమైనను మీకెప్పుడూ నెదురుచెప్పి యెఱుగనే ఇది నా పాపమా ? లేక నా పై కోపమా ప్రాణనాథా ! వానరనాయకా ! లేలెమ్ము ! శ్రేష్ఠమగు శయ్యయందు శయనింపుము. రాజు లెచ్చటైన కటికి రాలమీద పరుండుట చూచితిమా ? నీవీవిధముగా నున్నచో నేనెట్టు లోర్చుకొనుదానను ? ఓ ధరణినాథా ! నీకు భూకాంతపై నెంతటి ప్రీతీయో కదా? నీ కాంతను నేను దగ్గర నుండగానే ధరణీకాంతను కౌగిలించుకుని మరణించి కూడా విడువకున్నావే ? ఇది నీకు అర్హమైన పనియా ? ఓ ధర్మనిష్ఠుడా ! స్వర్గమార్గమునందు కిష్కింధను పోలిన శ్రీపురమేదైన దొరకెనా ? కాదేని శుభాస్పదమైన దీనిని విడువదలంతువా? ప్రాణనాథా ! ఇంక నెవ్వరిగూడి అందమైన వనములందు విహరింతును? అందముగా సువాసనలతో నున్న పుష్పముల నింక నాకెవ్వరిచ్చెదరు ?

ప్రాణనాథా ! ఓ సుకుమారమైన రూపముగలవాడా ! ప్రాణేశ్వరీ ! యని నన్ను మన్ననతో ప్రేమతో నింకెవరు పిలిచెదరు ? ప్రఖ్యాతమైన కీర్తి గలవాడా ! నా ప్రాణేశ్వరు డెప్పుడు వచ్చునా యని ప్రేమతో నింక నెవ్వరికై యెదురుచూచు దానను ? నా ఆశలన్నియు నాశనమయ్యెనే. సంతోషమంతయు నశించెను.

అయ్యో ! దేవా ! నిన్ను విడిచి దిక్కులేని దీనురాలనై నేను మూలయింటి యందు మూలుగవలసి వచ్చెగదా. అందమముతోనూ సొగసులతోనూ నీతో గలిసి విహరించు నటులు నేటితో తీరిపోయేనా ? తీయని మురిపెపు మాటలను నీతో మాటలాడుటలెల్ల నేటితో తీరిపోయెనా ? అందమైన నీ రూపమునకై మదిలో పొంగిపోవుట నేటితో నశించెనా ? సాటి స్త్రీలందరి చేత గౌరవింప బడుటలెల్ల నేటితో ముగిసెనా ? స్త్రీలలో నా సమానులెవ్వరని గర్వించదానను. ఇట్టులగునని యెఱుగనైతినే ! నా నాథా నా గర్వము నణుచుటకై పాడుబ్రహ్మ నీకిట్టిపాటును గలుగజేసేనేమో గదా ! నా యొక్క సుఖమును దుఃఖమును తనవిగా నెంచి ఇంకనెవ్వరు పాలించెదరు ? నా నాథా ! నా మనస్సునందున్న ఆలోచనలు మనసారా ఇకనెవ్వరితో చెప్పుకొనెదను ? ఎవ్వరిని జూచి నన్నందఱు నికమీద నెల్లప్పుడు మన్నించెదరు ? ఎవ్వని సహాయము చూచుకొని నేనింక జీవింతును ? ఏమి సుఖపడుటకై ఇక జీవించియుందును. ఎన్నెన్నో ఆశలు ఏవేవియో ఉండెడివి. అవియన్నియు నేటితో నేలగలిసెనే. నీవంటి భర్త నన్ను విడిచి ఇట్టి గులకరాళ్ళపై బడియుండగా నా హృదయము వెయ్యి ముక్కలై పోకున్నది. ఇదెప్పుడు నశింపకుండునా ? ఓ సుకుమార రూపము గలవాడా! నీ సోదరుని పురమునుండి వెడలగొట్టి వాని భార్యను బలవంతముగా వశపరచుకొన్నావు. దాని ఫలితమిట్లు నీవనుభవింపవలసి వచ్చినది. నీ మేలుకోరి నేను మంచి మాటలు చెప్పలేదా? వానరరాజా ! వాటిని చెవిబెట్టితివా? వ్యామోహమున బడి నన్నే, ఛీ మాటలాడకుమని మందలించితివే. అందమైన రూపము గలవాడా యవ్వనముతో గూడి మంచి ప్రౌఢలైన దేవకాంతలను నీ

అందమైన శరీరకాంతి చేతను, విలాసచేష్టల చేతను వశమొనర్చుకొని ఇష్టముతో నేలుదువుగదా. ఓ వానర నాథా ! ఇన్నినాళ్ళు నన్నేలి ఇప్పుడిచ్చట నొంటరిగా విడిచిపోవుట తగునా ? ఓ గజబలము గలవాడా ! పోవలదు పోవలదని నేను సారె సారెకు బతిమాలుచున్నను వినక పిశాచము పట్టినట్లుగానూ, బలాత్కారముగా ఈడ్చుచున్నట్లుగానూ నీవు యుద్ధమునకు వచ్చినప్పుడే నీకిది అంత్యకాలమని నేను తలంచితిని సుమా. నీవు నాయందు చూపిన మన్ననచేత నేనింతవఱకు దుఃఖమనుమాట మానసమునందెఱుగను. దైన్యమిట్లుండునని తలంచి యెఱుగను. ఓ వానరనాథా! ఇకనెల్లకాలమును దీనతతోనూ తీరని దుఃఖము తోనూ కృశించుచూ దిక్కులేనిదాననై విధవత్వమునెట్లు భరించెదను? రా రా కుమారా ! రమ్యమైన గుణములు గలవాడును ధర్మమునందాసక్తి గల వాడును అగు నీ జనకుని కన్నులారా ఇప్పుడే చూడుము. హా ! ఇదే కడసారి చూపు సుమా. ఇక నీవు కోరుకొన్నను నీ తండ్రిని జూచు భాగ్యము కలుగదు రన్నా! నీ వింక నెవ్వరిని నాయనా ! యనుచు పిలిచెదవురా కుమారా ! ఓ శూరకులాగ్రణీ ! వీడే నీ పుత్రుడైన అంగదుడు. చూడుము. సౌఖ్యములనెన్నడును విడువనివాడు. అన్నివేళలందును గారాబముతో బెంచగా పెరిగినవాడు. నీ దగ్గర నే మాటాడనేరనివాడు. అయ్యయ్యో ! కాదు కోపము గల్గిన పినతండ్రి నేవిధముగా సేవించు వాడో కదా. కపిసత్తమా ! ఏ గతి పట్టిపోవునోగదా. అని పల్కుచూ తార భర్తమీదపడి వానరరాజా ఇతడే నీ పుత్రుడు నీ కన్నులొకింత విచ్చి చూడరాదా ? ఇటులేల నేడ్చెదవు నాయనా ! యని యూరదింపరాదా? శిరస్సును ప్రేమతో మూర్కొన రాదా ? ఇక దూరముగా వెళ్ళుచున్నావు గదా. కడసారిగా ఒక్క మాటనైనను చెప్పరాదా ? కటకటా ! నిన్ను జంపి రామచంద్రుడు ఘనకార్యము చేసెను. ఇచ్చట సుగ్రీవునకు చేసిన ప్రతిజ్ఞను పూర్తిచేసి స్పష్టముగా అప్పు తీర్చికొనినాడు. ఓ సూర్యపుత్రా ! నీ పగ తీరునట్లు అన్నను జంపితివి. ఇంక నిచ్చట భయము లేకుండా హాయిగా రుమాదేవితో

గూడ రాజ్యరమ నేలుకొమ్ము. ఓ ప్రాణవల్లభా! ఇదిగో నీ యొక్క పెక్కురు భార్యలు వల్లభా ! యనుచు నేడ్చుచున్నారు. ఓ చతురమైన బుద్ధి గలవాడా ! వారితో పల్లెత్తి యొక్క మాటనైనను సంభాషింపరాదా అని తార పల్కగా తక్కిన వానర స్త్రీలు అంగదుని కౌగలించుకొని హృదయనాథుడగు వాలితో నిట్లనిరి. వానరేంద్రా ! నీ ముద్దుల పుత్రుని అంగదుని గుణముల ప్రోవైనవానిని విడిచి పోవదగునా ? వనచరనాథా ! నీవు దేశమేగుచో నీకిది భావ్యముకాదు. తలంచిచూడుమా అనగా తారాసతి వీరా ! పుత్రుని, నన్ను విడచి దూరదేశము లకు పోవుట నీకు తగియున్నదా ? అట్లు చేయుటకు మేమేమి తప్పు చేసియుంటిమి ? నేనైను నీ పుత్రుడైనను తప్పేమైనా చేసితిమా ? ఓ నిర్మలాత్మా! పొరపాటున ఏమైనా తప్పు చేసి యున్నచో నన్ను క్షమింపుమయ్యా ! ఓ చారుశీలా! ఇదే నేను నీ పాదముల మీద వ్రాలెదను. నన్ను కరుణించుచూ కపీంద్రా ! అని శోకముతో తక్కిన వానర స్త్రీల సమూహముతో గూడ తార ఏడ్చుచూ అలమటించి ఆ పరమ పతివ్రత తన ప్రాణనాథుని సమీపము నందే ప్రాయోపవేశము చేయ దలంచెను.



# ఇరువది యొకటవ సర్గము

## హనుమంతుడు తారను నూరార్చుట

ఆకాశమును విడిచి నేల వ్రాలిన తార వలె ఆ చంద్రుని వంటి ముఖము గల తార నేల మీద పడిపోగా హనుమంతుడామెతో నిట్లనెను. ఓ మానినీ! యేల యేడ్చెదవు. యేడుపు మానుము. యేదేని తెలిసి చేసినను తెలియక చేసినను అతడు చేసిన కర్మమే హేతువై వదలక మేలు కీళ్ళను తగిన విధముగా అనుభవింపవలసి యుండును. అవి అనుభవించి పిదప పరలోకమున కేగును. ఓ తారాదేవీ ! ఈ దేహమేల్లరకును నీటిబుడగలతో సమానము. నీకై విచారించ వలయును గాని ఇతరుల కొఱకేల యేడ్చెదవు. తలచి చూడగా దీనురాలవైన నీవు ఇతరుల దైన్యమునకై తపించెదవేల. ఓ బుద్ధిమంతురాలా ! జగత్తు నందు యెవ్వడెవ్వనికై విచారింప దగియున్నది ? అంగదుడు బాలుడు. వానికి నీవే పాలకురాలవు. బాలికా ! నీవు బ్రతికియున్న పుత్రుడు గలదానవు. వాని రాబోవు కాలమున శుభములెల్ల గూర్పవలసినదానవు. ఇంతమాత్రము మనసునందు తలంచుట మాని ఇట్లెందులకు శరీరమును విడువ దలంచెదవు. దుఃఖము తెలివిని పోగొట్టెనా ? ఈ భూమియందు ప్రాణులన్నియు పుట్టుటయు చచ్చుటయునను రెండును అనిత్యములే. ఓ పుణ్యమైన బుద్ధి గలదానా ! యెఱుగవా ? అందువలన ఇప్పుడు ఔర్ధ్వదైహికములైన పవిత్ర కార్యములనే చేయదగును. పరలోక సౌఖ్యమును గూర్పదలచు వారికి ఇహలోక క్రియలను చేయరాదు. వేలు లక్షలు కోట్లునైన వానర కోట్లను పాలించెను. తనవారిని పెక్కు విధముల గారవించెను. ధర్మ తత్పరుడై శాస్త్రవిధి ననుసరించి శుభతత్త్వము

నెఱిగి సామదాన శాంతుల యందాసక్తుడై ఈ రాజ్యమును పాలించి కపినాధుడు భూమిని వదలి వెళ్ళెను. విచార మెందులకు? అంగదునకును, వానర భల్లూక శ్రేష్ఠులకును కపి రాజ్యమునకును ఓ తారా ! ఇక నీవే దిక్కు సుమా ! ఈ భారమంతయు నీ యందే నిలిచియున్నది. ఓ మానినీ ఇక మెల్లగా శోకమును మానుము. నీ సాయమున నీ పుత్రుడు తగిన విధముగా రాజ్యము చేయగా గొప్ప ఆనందము నందగల్గుదువు. ఇట్లు విచారింపకుము. తారా ! పురుషుడే నిమిత్తమై భూమి యందు సంతానమును కన దలంచెదరో అది నేడు సమకూరినది. కాన వానర రాజునకు పుత్రుడైన అంగదుడు పరలోక క్రియులు చేయుగాక. వానరనాధునకు సంస్కారములు చేసి పుత్రుని రాజ్యమందు నిలిపి దుఃఖములను దూరముచేయుదువు గాక అని చెప్పగా తార హనుమంతునితో తానిట్లనెను.

**తార హనుమన్తునకు సమాధానము చెప్పుట**

హనుమా ! వినుము. అంగదుని వంటి నూరుగురు పుత్రులకంటెను శౌర్యధనుడై యుద్ధము నందు మృతి జెందిన నా ప్రాణనాధుని శరీరమును కౌగిలించుకొనుటే శ్రేష్ఠము సుమా. ఇది సత్యము. నేనెవ్వతనయ్యా ! వానరనాధునకు సంస్కారము తీర్చుటకు ? నేనెవ్వతేనయ్యా ! అంగదుని వానర రాజ్యమునందు నిల్పుటకు ? ఆ విధులన్నియు తీర్చునట్టి సమర్ధుడు ఇక అంగదుని పినతండ్రియే. చూడుము. నా ప్రాణనాధుడే స్వర్గమునకేగగా ఈ క్రియలన్నియు నా కెందుకయ్యా ! ఆంజనేయా అంగదుని విషయమై నేను యోచిందగిన దేదియును లేదుసుమా. కొడుకునకు తండ్రియే ప్రియబంధువు గాని చూడగా తల్లిగాదు. ఓ కపీశ్వరా ! పరమునసైనను, ఇహమునసైనను ఇంద్రసుతుని ఆశ్రయము కంటే అత్యుత్తమమైనది ఎంచి చూడగా నాకేదియు లేదు. నా ఎదుట చంపబడియున్న నా పతి శయ్యయందే నేను పరుండదగును. అని పల్కగా..

# ఇరువది రెండవ సర్గము

## వాలి సుగ్రీవునితో తాను జేసిన యపకారము మరువుమని చెప్పుట

అంతట కొనయూపిరితో యున్నవాలి మెల్లగా శ్వాస విడుచుచూ తన చెంతనే యున్న అంగదుని, నతని సమీపముననే విజయము పొందియున్న సూర్యపుత్రుని జూచెను. చూచి స్నేహపూర్వకముగా స్పష్టమైన మాటలతో సుగ్రీవునితో నిట్లనేను. సుగ్రీవా ! నీపై పగ వహించితినని నన్ను దూషింపకుము. ముందు రాబోవు ఫలితమే ఆ విధముగా బలాత్కారముగా పట్టిలాగి తెలివిని కోల్పోవునట్లు చేసెను. మనమిద్దరము ఒక్క మాటుగా సోదర ప్రేమతో సుఖబడి యెఱుగమైతిమి. తమ్ముడా ! యిది దైవకృతము. దీనిని దప్పించుట మనకు శక్యమా ? నేనింక జీవించి యుండజాలను. ఈ వానర రాజ్యమును సంతోషముతో నీవు స్వీకరింపుము. నిమ్మళముగా పాలించుచూ నుండుము. నేను జీవితమును, రాజ్యమును, శ్రీ వైభవమును, భూమిని, ముల్లోకములయందు పొగడబడిన సత్కీర్తిని విడిచి ఓ సుగుణభూషణా ! స్వర్గమున కేగుచున్నాను.

## వాలి సుగ్రీవున కంగదుని నప్పగించుట

ఈ దురవస్థయందున్న నేనేది చెప్పినను అది ఎంత దుష్కరమైనను నీవు కాదనక చేయదగి యున్నది. సుగ్రీవా! బాలుడును, బుద్ధిమంతుడును, రోదనము చేయుచున్నవాడును, భాష్పములతో వికారమైపోయిన ముఖము గలవాడును, సౌఖ్యములు పొందవలసిన వాడును, సంతోషముతో నేనెప్పుడును ముద్దుగా పెంచిన చిన్న బాలకుడును అగు అంగదుని చూచితివా ? నా ప్రాణములకన్నా నెక్కువైన నా పుత్రుని అన్నా నీవు నీ కన్న పుత్రుని విధముగా చూడగదయ్యా !

అన్ని దశలయందును, దయతో నిచ్చువాడవును, రక్షించువాడవును, నా పుత్రునకు నీవే సుమా. వాడు భయము చెందినచో ఆ వెరపును దొలగింపుము. అమితమైన పరాక్రమమున నీకు సమానుడు సుమా. యుద్ధమున రాక్షస సంఘమును చంపుట యందు జంపరానివాడై నీ ముందరనే యుండును. నీ కనుకూలమైన విధముగా అన్నీ కర్మలను వీడు చేయుచుండును. యుద్ధమునందు నేర్పరి. కొంచమైనను జంకు లేనివాడు సుమా. ఓ అనఘా ! సుషేణుని పుత్రిక యగు నీ తార సూక్ష్మముగా ఆలోచించి కార్య నిశ్చయము చేయునట్టిది. శకున శాస్త్రమునందు పండితురాలు. ఈ తార ఏ పని మంచిదని చెప్పినా ఆ పని తప్పక జంకక చేయవలయును. ఇంత చెప్పుటేలా ? ఈ యింతి చెప్పిన దేదియును తప్పదు సుమా. ఇంకొక్క మాట చెప్పెదను. దానిని నీ మనసునందు పదిలముగా నిలుపుము. రాముని కార్యమెప్పుడైనను నీ కవశ్యకర్తవ్యము. సందేహ మిసుమంతైనను లేకుండగా నీవు చేయుము. చేయకుండుట అధర్మము. మరియు అవమానము చేసితివని నిన్నతడప్పుడే చంపును. వానరరాజా ! నేను మరణించిన వెంటనే దీని మహిమ తగ్గిపోవును. గాన ఈ దివ్యమైన హారమును ఇప్పుడే ధరించి నీ శత్రువులను వధింపుము. ప్రభావమును, శ్రీయును, విశేషముగా గలిగిన బంగారు మాలిక ఇది. అని చెప్పగా ఆ సూర్యనందనుడును గ్రహణముపట్టిన చంద్రునివలె దీనుడై తన యన్నయగు వాలి మాటలచే గొప్పదైన శాంతమును పొంది అతని యనుజ్ఞతో కాంచన మాలికను స్వీకరించెను. అంతట వాలి తన పుత్రుడైన అంగదుని జూచి తగు విధముగా నిట్లు పలికెను.

## వాలి యంగదునకు నీతి బోధించుట

కుమారా ! దేశమును కాలమును గుర్తించి ప్రవర్తింపుము. శాంతి వహించి ప్రియమును, అప్రియమును సౌఖ్యమును, దుఃఖమును సమముగా భరించి ఆ సమయములను బట్టి అవసరమైనట్లు సుగ్రీవునకు వశవర్తివై యుండుము. నా యెడ నీవు చనువు చూపించి నడచుకొనినట్లు సుగ్రీవుని యెడ చనువు

చూపి చరించినచో నా వలె నిన్ను లాలించి మన్నింపడు సుమా. అతని విరోధులతోడను, ఇతని శత్రువుల మిత్రువుల తొడను వరుస దప్పి స్నేహము చేయకుము. ఇతని కార్యములను శ్రద్ధతో చేయుచుండుము. ఎప్పుడును నేక్కువ స్నేహమును గాని, విరోధమును గాని చేయకుము. ఈ రెండును చాలా చేడ్డవి సుమా. మనసులో జాగరూకతను వీడక మధ్యస్థమార్గముగా సంచరింపుము నాయనా.

## వాలి మరణించుట

అని చెప్పుచూ కనుగ్రుడ్లు గిరగిరా త్రిప్పుచూ తీవ్రమైన బాణపు దెబ్బచే పీడింపబడినవాడై భయంకరముగా పండ్లు వెలువడి కనబడగా వానరరాజపుడు ప్రాణములు విడిచెను. వానర సమూహమంతయు హా యని ఏడ్చేను. భూమిపై కిష్కింధా పట్టణము శూన్యమై కనిపించెను. పర్వతములు, ఉద్యానవనములు ఆ వానరరాజు పోవుటచే ప్రకాశము తప్పి పాడు పడినట్లు తోచెను. ఎవని యొక్క వేగముచే పుష్పములతో నిండిన చెట్లు అడవుల నుండి వెడలి వెనువెంట వచ్చుచుండెనో, అట్లు చేయగల ఘనుడింక నెవ్వడు గలడు ? గోలభుడను గంధర్వ కుంజిరునితో ఒక్క పదునేను సంవత్సరములు పగలు రాత్రి యనక యుద్ధము చేసి పదునారవ సంవత్సరమున ఆ అవినీతుని చంపివేసి మాకందఱకును దిగులు మానిపించి రక్షించెనే అట్టి వీరు డక్కటా ఇప్పుడింక లేడు గదా. ఒక్కసారియైనా ఆ శూరకులాగ్రణి నింక జూడజాలము గదా యని ఆబోతు మరణించగా గోవులు దిక్కులేనివై సింహములతో గూడిన భయంకరమైన అడవిలో దైన్యము నొందు విధముగా క్రోతులందఱును వానరరాజుకై దుఃఖించిరి. మరణించిన భర్త మొగమును జూచుచు తార భరింపరాని దుఃఖ సాగరమున మునిగి విలపించుచూ ఆ పతి నాలింగనము చేసికొని నఱుకబడిన చెట్టుతోపాటుగా నేలబడిపోయిన లత వలె పడిపోయెను.

# ఇరువది మూడవ సర్గము

## వాలి మరణమునకు తార యేడ్చుట

ఇట్లు వాలిమీద పడి అతని ముఖము మీద ముఖ ముంచి విచారించుచూ నిట్లు పలికెను. నాథా ! నా మాటలను వినక ఈ కఠినములైన రాళ్లపై శరీరము చేర్చగలిగితివి గదా. వానరనాథా ! నాకంటే ఈ భూదేవి నీకెంత ప్రియురాలో గదా ! నా కన్నులయెదుటనే ఆమెను కౌగిలించుకొని మాటలాడకున్నావు. ఔరా ! విధికూడా సుగ్రీవుని వశమయ్యెను గదా. ఓ వీరుడా ! సాహసిక ప్రియా ! భూమియందు శూరవరుడనగా ఆ సూర్య సుతుడే గాక ఇతరు లెవ్వరు నిన్నెదుర్కొని బ్రతుకగల బలశాలురు ? వానర గోలాంగూల సమూహములును, నేనును, అంగదుడును ఎంతో ఏడ్చుచున్ననూ మా దీనాలాపములను విని చెవిని బెట్టవేటికి ? ఇది నీకు తగియున్నదా ? పూర్వము నీచేత పగవా రెందు నశించిరో అట్టి వీర శయనమునందే నీవు కూలితివా ? యుద్ధములందు ప్రీతిగలవాడా ! పరిశుద్ధ వంశమున బుట్టిన వాడా ! నాథా! నన్ననాథగా జేసి యెందు బోయితివి ? మంచి తెలిసిన వారెవ్వరును శూరులకు కన్యలనీయరాదు సుమా. చూచితివా ! మహాశూరుని భార్య నైన నేను ఏ విధముగా నింద్యమైన వైధవ్యము ననుభవింపక తప్పనిదాన నైతిని. అభిమానము తరిగి పోయెనే. పరమపవిత్రమైన సద్గతి వట్టి దయ్యనే. ఎంతయో అగాధమైన దుఃఖసముద్రములో మునిగిన దాననైతిని గదా. నిజముగా రాతితో జేయబడినదేమో నాయీ హృదయము. ఇట్లందమైన దేహముగలవాడగు భర్త

చనిపోగా చూచుచుండియు నూరు వ్రక్కలుగా పగిలి పోకున్నది గదా. నా స్నేహితుడు, నా దైవము, నా భర్త, నా మంచి కోరువాడు, నా ప్రియుడు, నా పెన్నిధి, నాతో గలిసి తిరుగువాడు, హా ! నన్ననాధను జేసి స్వర్గమునకు వెళ్ళెనే. ఆరుద్ర పురుగు రంగు గలిగి అతి మృదువైన శయ్యయందు వలె ఈ రక్తపు మడువు నందు వీరుడా నీవు పరుండవలెనని విధి నిర్ణయించెనా ? శరీరమంతటను నెత్తురులు గారుచుండగా పైపైని మెత్తినట్లు దుమ్మంటుకొనగా కాంతి తరిగిన మెత్తని నీ శరీరమును ఏ విధముగా నేనిప్పుడు కౌగిలించుకొందు నయ్యా ! సుగ్రీవుడు ధన్యుడయ్యా ! క్రూరమైన మహా విరోధమును రాఘవ రాజన్యుని ఒక్క బాణము చేతనే శూన్య మగునట్లుగా నేర్పరి తనముతో చేసికొనెను గదా. ప్రాణములు విడిచిన నిన్ను చూచుచుండుటేగాని గట్టిగా ఔమ్మున నాటిన బాణము మూలముగా కౌగిలించుకొన వీలు కాకున్నదయ్యా అయ్యయ్యో ! అని యిట్లు తార ఏడ్చుచుండగా పర్వతమందలి గుహలో నున్న సర్పమువలె ఇంద్ర తనయుని శరీరమున నాటిన బాణమును నీలుడు తీసివేయగా, అస్తగిరి కూటములందు చిక్కువడిన సూర్యుని వీడి వచ్చుచున్న గొప్ప తేజమో యనునట్లు గొప్పనైన యెఱ్ఱని రంగుతో ఆ వానర రాజు యొక్క గాయమునుండి కొల్లలుగా నెత్తుఱులు వెడలి కాలువలై, పర్వతాగ్రమునుండి పారుచున్న గైరికాది ధాతువుల ఎఱ్ఱని నీటి ధారలో యనునట్లు స్రవించేను. బాణపు దెబ్బచే నెలగూలిన వానర రాజు శరీరమునన్న ధూళిని తార తన కన్నీటి ధారాలచే సర్వావయములను కడిగెను. అంగదుని దగ్గరకు దీసికొని తార ఇట్లనెను. పుత్రా నీ తండ్రిని కన్నులారా చూచితివా ? పాప కర్మచే ఏర్పడిన వైరమంతయు నేటితో శరీరముతో పాటు నేలగూలి తీరిపోయినది. కుమారా ! ఇదియే కడసారిగా తండ్రికి నీవు నమస్కరింపుము. ఉదయ

భాస్కరునివంటి శరీరముగల నీ తండ్రి యొక్కడే యమ పురమున కేగుచున్నాడు. అనగా అంగదుడు విడువని భక్తితో వాలి పాదముల మీద బడి అంగదుడను నేను మ్రొక్కుచున్నాను గైకొనవే యని నమస్కరించెను. తారయు నాధా ! ప్రియపుత్రుడిట్లు మ్రొక్కగా చూడవేల ? ధీర్ఘాయువు గమ్ము పుత్రకా యని దీవించవేల ? నాధా! నేనును పుత్రుడును సింహముచే హింసింపబడిన వృషభమును విడువలేని దూడతో గూడిన ఆవు వలె హడలుచున్నను మమ్ము చూడవేలా ? భయంకరమైన సంగ్రామమనెడు యజ్ఞమును చేసి నీవు జానకీ నాధుని బాణమనెడు జలములందు పత్ని నగు నన్ను విడిచి నీవొక్కడవే అవబృధ స్నానము చేయుట అర్హముగా నున్నదా ? ప్రాణనాధా ! పూర్వము యుద్ధమున నిన్ను మెచ్చి ఇంద్రుడిచ్చిన ఆ బంగారు హారము నీ యెదయందు అందము లొలుకుచూ ఇప్పుడు లేదేమి ? అస్తమించుచున్న సూర్యుని ప్రశస్తమైన శోభ మేరు పర్వతమును విడువదు. ఆ విధముగనే అస్తమించిన నిన్ను రాజ్యశోభ విడువకున్నది గదా. అక్కటా ! హితమెంత చెప్పినను వినకపోయితివి గదా. నొక్కి చెప్పియు నిన్నడ్డగించుటకు సమర్థురాలిని కాలేకపోయితిని గదా. పుత్రునితో గూడా నేను దిక్కుమాలిన దాననైతిని. నాధా ! నిన్ను గూడి లక్ష్మియు నన్నొక్కమారే వదలివెళ్ళినది గదా.



# ఇరువది నాల్గవ సర్గము

## సుగ్రీవుడు వాలికై దుఃఖించుట

అని అంగదునితో గూడి తార విపరీతముగా దుఃఖించుచు అంగలార్చుచున్న విధమును, చనిపోయి భూమిమీద పడియున్న సోదరుని స్థితిని కన్నులారా చూచి సూర్యనందనుడు ఇది యంతయు నా వలననే కదా గలిగెనని తలంచుచూ బాష్పములు కన్నులవెంట దొరగుచుండగా దుఃఖముతో నిండిపోయెను. ఆ తార మోము జూచి హృదయము కలత జెందుచుండగా మెల్ల మెల్లగా ఆ సుగ్రీవుడు సర్ప సమానమైన బాణమును వింటిని ధరించియున్న రాముని తన యాశ్రితులతోగూడి దీర్ఘమైన నిశ్వాసములను విడుచుచూ సమీపించి రఘురాముని జూచి ఇట్లనెను. ఓ రాజచంద్రమా నీవు చేసిన బాస తీరినది. ఈ కపి రాజ్యమంతయు నాకు సమకూరెను. కానీ రాజ్యసుఖములందును జీవిత మందును ఉన్న ఆశ నశించినది. ఓ భూవరా ! నన్ను క్షమింపుము. ఇక నిక్కడ నేను నిలువనొల్లను. అన్నకు తోడుగా వెళ్ళెదను. మా అన్న పట్టపురాణి యొక్క దుఃఖమును పురమున నున్న వారందఱి విచారమును, అంతటి వాడైన మా యన్న ప్రాణములను విడచి భూమిమీద పడుటయు, బాలుడైన అంగదుడింక బ్రతుకునో బ్రతుకడో యను సంశయమును ఇవి యన్నిటినరసి చూడగా రాఘవా! యదార్ధముగా నా మనస్సు రాజ్యభోగములందాశ పొందుటలేదు సుమా. రోషము చేతను, కోపము చేతను, అతి తీక్ష్ణమైన తిరస్కారముచేతను నా సోదరుని మృతి పూర్వము నా కిష్టముగా కనిపించెను గాని ఇప్పుడు నా మనస్సు నందు దుస్సహమైన తాప మధికమైనది. అన్నగారిని చంపి ఇంద్ర

పదవి నైనా పొందగోరను. మునుపున్నట్లే ఋష్యమూక పర్వతముపై స్వవృత్తితో వుండెదను. "నిన్ను చంపను నీవు యదేశ్చగా వెళ్లుము" అనెడు మహాత్ముని పల్కు ఆ మహానుభావునికే తగినది. ఇట్టి క్రౌర్యము నాకే తగినది. నా సోదరుడనగా సామాన్యుడా ! శూరులలో ఉత్తమమైనవాడు. అటువంటి మహాత్ముని చంపుకొంటిని. రాజ్య లాభముచేత గలుగు సంతోషము, సోదరుని చంపించుటవలన కలుగు దుఃఖము అను నీ రెండింటిలో నేది అధికమో కామ మోహితుడనై తలంపలేక పోయితిని. యుద్ధరంగమందు తాను శక్తిగలిగియుండి కూడ తన గొప్పదనమును గౌరవమును పరాక్రమమును తలంచుకొని దానికి తగినట్లుగా నన్ను చంపడయ్యెను. నేను తెగించినవాడనై , దుర్మార్గుడనై ధర్మనీతిని తలంపక యెట్టివానిని చంపించితిని. బాలిశుడనై ధర్మవ్యతిక్రమము చేసితిని. తాను బలమైన చెట్టుకొమ్మతో నన్ను మోదగా నేను నేలవ్రాలి ముహూర్తకాలము గిలగిల తన్నుకొంచు విలపించుచుండగా ఆ వీరుడు నన్ను చూచి యింక ఇటువంటి పనులు చేయకుమని ఊరడించి వెళ్ళబుచ్చెను. అట్టి గొప్ప గుణములు గలవానిని కోపించి యముని సన్నిధికి బంపితిని. నిందకొడుగట్టితిని. సోదర వాత్సల్యమును, ఆర్యులయొక్క పద్ధతియును, అధికమగు ధర్మమును, ఈ ధన్యాత్మునిచేత రక్షింపబడెను. క్రోధమును, కామమును, వానర స్వభావమును నాయందు స్పష్టముగా కనిపించెను గదా. రామచంద్రా ! సాటిలేనిదియు, తలపరానిదియు, విడువదగినదియు, చూడదగినదియు, కోరదగనిదియునైన మహా శాపమును, విశ్వరూపుని జంపి ఇంద్రుడు ఒడిగట్టికొన్నట్లు అన్నను వధించి నేనీవిధముగా సంపాదించినాడను. ఇంద్రుని ఆ పాపమును భూమియు , జలమును, వృక్షములను, స్త్రీలను తామంత తాముగా పంచుకొనిరయ్యా ! ఈ క్రోతి యొక్క పాపమునెవడు పంచుకొనును? పాపశీలుడను, నీచుడను. మంచివారిచేత గర్హింపదగినవాడను. లోకమున కపకార కార్యము చేసినవాడను. వాన నీళ్ళు పల్లమును ముంచినట్లు నన్నీ

ఘోరమైన దుఃఖము ముంచెనయ్యా ! కోవిదవర్యా ! అధర్మమైనదియు, వంశనాశనకరమైనదియు నగు నిట్టి యకృత్యమును చేయుటచే పౌర సత్కారమును గాని యువరాజత్వమును గాని పొందుట కనర్హుడుగ నున్నచో, ఓ ధర్మతత్పరా ! ఇంకా నేను రాజ్య రమకు తగువాడనా ? ఓ పుణ్యచరిత్రుడా! భ్రాతృవధమనెడు వాలము గలదియు, తపభారమనెడు శిరస్సును, దంతము లును, తొండమును, కన్నులును గలదియునగు మహాపాపమనెడు ఏనుగు అంతకంతకు పెరిగినదై ఏటిగట్టును వలె నన్ను కూల్చుచున్నదిసుమా. ఓ పురుష వరేణ్యా ! బంగారమును చక్కగా కాచినచో వివర్ణమై తనయందున్న మాలిన్యమును విడనాడినట్లుగా నా మనసునందున సాధుప్రవృత్తి ఈ పాపముయొక్క సంబంధమును రోసి వెలువడివచ్చుచున్నది. ఓ చారుశీల! నేను చేసిన ఈ పాపపు పని వలన కలిగినట్టి భరింపరాని అంగదుని యొక్క దుఃఖమును జూచి వీరులైన ఈ వానరులెల్లరును సగము ప్రాణాలతోనున్నారు సుమా. అందఱకును కుమారులు కలుగుదురుగాని సుజనుడై, సుమతియై చెప్పినట్లు నడచుకొనువాడైయున్న అంగదుని పోలిన పుత్రుడు లోకమున గలడా? సోదరుని సంపాదించి పెట్టగల దేశమున్నదా? తారాకుమారుడగు నంగదుడు జీవించియుండుచో తారయు నతనిని రక్షించుటకై బ్రతికియుండును. తన తనయుడు బ్రతుకనిచో తారయును బ్రతకదు. ఇది నిక్కము సుమా. రామా! అన్నతోను, పుత్రునితోడను నాకున్న స్నేహముచేత ప్రజ్వరిల్లుచున్న అగ్ని యందు దేహము విడిచెదను. సీతను వెదకుటకును, ఆమెవార్త నీకు చెప్పుటకు ఇదిగో ఈ వానర వీరులెల్లనున్నారు. నేను మరణించినను నీపని నిలిచిపోదు. నే నెఱుగుదును. రామా! నీవు సర్వమును సుకరముగా చక్కజేసికొనగల సమర్థుడవు. వంశనాశనకుడనై నేనేమని యీ శరీరమునందు ప్రాణములను నిల్పుకొందును? అయ్యా! గొప్ప తప్పిదము చేసినవాడను. రఘురామా! నాకనుజ్ఞనిప్పింపుము. అని చెప్పుచున్న వానరరాజు మాటలను వినుచు శత్రువులను మర్దించుటయందు

సమర్థుడైన రామచంద్రుడు కనులవెంట బాష్పములు కార్చుచుండగా ఒక ముహూర్తకాలము ఆ పవిత్రుడగు సుగ్రీవుని వలెనే ఆర్తినొందెను.

## శ్రీరాముడు తార నూఱార్ప బోవుట

భూదేవివంటి ఓర్పుగలవాడును, మూడులోకములను రక్షించువాడును నగు రాముడు ఆ సమయమున తనను మాటిమాటికి చూచుచున్నదియు, శోకమునందు మునిగియున్నదియు నగు తారను ఓదార్పనెంచినవాడై చేరనేగెను. మంత్రి ముఖ్యులును ఆమెను సమీపించి తారను వాలిని విడదీసిరి. ఆ పద్మాక్షి, పద్మదళములవలె విశాలమయిన కన్నులు గల వాడును, భయంకరమైన విల్లును, బాణమును హస్తములందు దాల్చినవాడును, సూర్య సమానమైన సహజ తేజముతో ప్రకాశించు శరీరముగలవాడును, సాధుప్రవర్తనము గలవాడును, రాజ లక్షణములు గలవాడును, పురుషశ్రేష్ఠుడును, ఇంతకుమునుపు చూడబడనివాడును అయిన రామచంద్రుని చూచి పవిత్రమైన శీలము గల ఆ తార తన మనస్సునందు ఇతడా ! ఆ రామభద్రుడని తలంచుచు ఇంద్ర సమానుడును సమీపించుటకు సఖ్యముకానివాడును, గొప్ప మహాత్ముడును అయిన రామభద్రుని తార దుఃఖపీడితురాలును, మిక్కిలి కలతనొందుచున్నది యునై అతి వేగముగా చేరనరిగెను. గుఱితప్పని విల్కాడగు ఆ రాముడితో శోకముచే సంభ్రమించిన మనస్సుగలదియు శుద్ధసత్వము గలదియు, దృఢమైన మనస్సు గలదియునగు తార భర్తను చంపుటవలన గలిగిన సంతాపాతిశయము చేత ఇట్లు పల్కెను.

## తార తన్ను జంపుమని శ్రీరాముని జూచి ప్రేలాపించుట

రామచంద్రా! నీవప్రమేయుడవు. సమీపింపరానివాడవు. ఇంద్రియ జయమును పొందినవాడవు. ప్రఖ్యాతిగలిగిన ధార్మికుడవు. అక్షయమైన కీర్తిగలవాడవు. వివేకవంతుడవు. క్షమయందు భూదేవితో సాటియగువాడవు.

రక్తము వంటి యెఱ్ఱని కన్నులుగలవాడవు. సాటిలేని ధనుర్బాణములు హస్తము లందు గలవాడవు. మహాబలము గలవాడవు. ఉత్తమమైన దేహముగలవాడవు. మానవ విగ్రహలక్షణములు విడిచి దివ్య విగ్రహలక్షణములతో నీవు వెలయుచున్నావు. ఓ అనఘా! నా భర్తను జంపిన ఆ ఒక్క బాణము చేతనే నన్ను కూడా చంపివేయుము. రామచంద్రా ! నా భర్తను చూచెదను. వాలి నన్ను విడిచి యెందును సుఖింపడయ్యా ! ఆర్యులలో శ్రేష్ఠుడా! తామరరేకుల వంటి కన్నులు గల ఆ వాలి స్వర్గమునందు అలంకారము చేసికొనుటలో నేర్పరులును, పుష్ప సమూహములచే అలంకరింపబడిన శిరములు గలవారును అయిన స్త్రీలు మహా స్నేహముతో తన్ను సేవించినను, నన్ను గానకపోవుటచే హాయిగా శయనింపడు సుమా. రామచంద్రా ! భార్యను భర్తను గలిపిన మంచి కీర్తిని పొందగదవయ్యా ! స్వర్గమునందు నివసించియు నా భర్త నన్ను విడిచి యుండుటచే శోకమును, దైన్యమును పొంది తపించుచుండును. ఇది నిజము. దేవా! నీవేవిధముగా మనోహరమగు పర్వతప్రదేశమున సీత నెడబాసి అత్యధికముగా శోకించితివో అట్లే ఇతరులకైన వేదనలు కూడా అని తెలిసి కొనుము. రామభద్రా ! యౌవనమున నున్న పురుషుడు తన ప్రాణసఖిని విడిచి యుండునట్టి ఆ అధికమైన దుఃఖభారమంతయు నీవెరిగినదే కదా. ఇప్పుడు వాలి నన్ను విడిచి ఎంతగా తపించుచున్నాడో గదా. రాఘవా ! ఆ బాణము తోడనే నన్నును గొట్టుము. నేను వేగముగా వెళ్ళి నా వల్లభుని చూచెదను. మహానుభావా ! స్త్రీని చంపుట పాతకమని చింతింపకుము. నేను నా భర్త యొక్క ఆత్మనని భావించి దయగల బుద్ధి గలవాడవై నా భర్తని చంపినట్లే నన్నును వధింపుము. రఘునాయకా ! వేదములు శాస్త్రసంఘములు భర్తకు భార్యయే ఆత్మయని అధికముగా మ్రోయుచున్నవి సుమా. ప్రియమైన భార్యను భర్తకు కూరిచి దానము సేయుట కంటె ఎందును విశేషమైన దానము లేదని

జ్ఞానులునే చెప్పుదురు. ధర్మమును మనస్సు నందు తలంచి నన్ను నా ప్రియుని గలిపితివేని నీకు పుణ్యమే కలుగ గలదు. రాజచంద్రా ! నన్ను సంహరించిన పాపము నిన్నంటదు సుమా. ఏ దిక్కును లేని దానను, దీనురాలను, నా భర్తయు నన్ను విడిచిపోయెను నీ వొక్క బాణమును విడిచి ప్రాణములు తీయుము. నీకు నమస్కరించెదను. దిగ్గజములవంటి నడకగలవాడును, మంచి ధీమంతుడును, బంగారు మాలికను ధరించువాడును అయిన వాలిని విడిచి, అక్కటా ! నేను చాలా కాలము జీవములను దాల్చి యుండగలనా ?

## శ్రీరాముడు తార నాశ్వాసించుట

అని విలపించు తారను జూచి రామచంద్రుడు దుఃఖము శమించునట్లు ఈ విధముగా పలికెను. ఓ అనఘాత్మికా! వీరపత్నివై యుండియు నీ కిట్టి విరుద్ధమైన ఆలోచనలు తగునా ? జగములన్నియు విధాతచే నిర్మింపబడినవి. ఓ తరుణీ ! సుఖ దుఃఖ యోగములన్నియు బ్రహ్మ చేతనే కలుగుచుండును గాన దుఃఖము, సుఖము బ్రహ్మ చేసినవేయని జనులు అందురు. బ్రహ్మ విధించినట్లే సమస్తమును జరుగును గదా. ఆ విధాత చేసిన విధమును కొంచెమైనను దాటశఖ్యమా ? తారా ! వీరపత్నులీ విధముగా దుఃఖము పొందుదురా ? యువరాజైన పుత్రుని జూచి ప్రీతిని పొందెదవు. అని రాముడు చెప్పగా తార దుఃఖమును వీడెను.



# ఇరువది యైదవ సర్గము

**అ**ట్లు హెూరుమని యేడ్చుచున్న అంగదుని, తారను, సుగ్రీవుని చూచి వారితో సమానమైన శోకము గలవాడై లక్ష్మణునితో గూడి, రాముడు వారలను సాంత్వన వాక్యములతో ఓదార్చెను. చచ్చిన వారలకై ఏడ్చుట చేత వారి కేమైనా మోక్షము లభించునా? చెప్పుడు. మనస్సు నందు తరువాత చేయవలసిన కార్యమును వేగముగా చేయదలంచుట మంచిది గదా ? లోకముతో పాటు ఈ విధముగా ప్రేతమునకై యేడ్చుటిక చాలును. ఏడ్చినందువలన లాభ మేమున్నది ? కాలము మీరిపోయిన తరవాత మీరేమి చేయగలరో చెప్పుడు. నియతియే లోకమునకు గారణము. నియతియే క్రియాసాధనము. (నియతి – కాలము – స్వభావము, ఇవి మూడును ఈశ్వర పర్యాయ పదములు.) నియతియే ప్రాణికోటులను నియమించుటకు కారణము. వానరులారా ! ఒక్కడేపనినైనను కర్తయై చేయజాలడు సుమా. యెవ్వడైనను ఒక కార్యమును చక్కగా చేయునట్లు యెవ్వనినైన ప్రేరేపింపను జాలడు సుమా. ఇది నిజము సుమా. లోక మెల్లప్పుడును స్వభాము ననుసరించి తప్పక ప్రవర్తించు చుండును. ఆ స్వభావము ఎల్లప్పుడును కాలాధీనమై యుండును. కాలమును కాలము దాటదు. కాలమునకు క్షేయమనునది గలుగదు సుమండీ! కాలము స్వభావము ననుసరించియే యుండును. అది నియమము నెప్పుడు తప్పి నడవదు. కాలము చుట్టము నెరుగదు. కాలమునకు కారణము గల్గదు. పరాక్రమముచే కాలము చిక్కదు. కాలమునకు స్నేహితులు లేరు. అది ఆత్మలకును వశము గాదు. కాల పరిణామమును బట్టి కార్యసమూహము జరుగుచుండునని బుద్ధిమంతులైన

వారలు తలంచుట అర్హమెప్పుడైనను. ధర్మమును, అర్థమును, కామమును తనంతట తానే కాలక్రమమున గలుగుచుండును. ఎట్లును తొలగదు. కావున వాలి పూర్వము తను చేసినట్టి ధర్మార్థకామఫలముల ననుభవించుటకై యిక్కడ నుండి సాటిలేని తన పరిశుద్ధ కాంతిని గనుచు స్వర్గమునకు వెడలెను. తన యొక్క ధర్మ గుణముల బలము చేత పూర్వము సంపాదించు కొనబడిన స్వర్గమును గైకొనుటకై ప్రాణములను వీడి వాలి వెడలెను. ఇటువంటి శౌర్యశాలి యైన వాలికై విచారించుట తగి యున్నదా ? ఈ పౌరుషనిధికి అత్యుత్తమ స్థానము లభించినది. ఇక మీరందరేల తాపము నందెదరు? వేగముగ ఈ సమయమునకు దగిన విధాయక కృత్యములను చేయ నుపక్రమింపుడు.

## లక్ష్మణుడు సుగ్రీవునితో వాలిని సంస్కరింప ప్రయత్నింప జెప్పుట

రామచంద్రుడిట్లు చెప్పగా లక్ష్మణుడును దుఃఖభారమనెడు సముద్రమున మునిగి యున్న సూర్యసుతుని జూచి హితమైన సానువాక్యములతో సుమయోచితముగా నిట్లనెను. లే లెమ్ము సుగ్రీవా ! ఇక వాలికి ప్రేత కార్యమును చేయ నుపక్రమింపరాదా ! తార తోడను, అంగదుని తోడను గూడి దహన కార్యమును జరిగింపుము. చాల గంధపు చెక్కలు నిచ్చుటికి దెచ్చునట్లుగా ఆజ్ఞాపింపుము. సుగ్రీవా! అంగదుడెట్లు దీనుడై యున్నాడో చూడుము. అతనినోదార్పుము. వస్త్రములును పుష్పమాల్యములును కావలిసిన నెయ్యి, నూనె, గంధములను తెచ్చుటకై అంగదుని పంపుము. ఇప్పుడు పట్టణ మంతయు నీ యధీనము సుమా. ఈ మూర్ఖత్వమును విడిచిపెట్టవయ్యా వీరవరేణ్యా. తారుడా! నీవు వేగముగా శిబికను తీసికొనిరమ్ము. ఇటువంటి సమయములందు తొందరయే మేలందురు. వాహనము మోయనర్హులైన వారలను వేగముగా నడుచుట యందు సమర్థులైన బలశాలురను జత గూర్పుము. దుఃఖమును మానుము అని సుగ్రీవునితో జెప్పి లక్ష్మణుడు రాముని సమీపమునకు వెళ్లెను.

అంతట తారుడు సుమిత్రాపుత్రు నాజ్ఞను విని అతి వేగముగా గుహను ప్రవేశించి శుభ్రమైన ఆసనములు గలదియు పక్షి ఈకలచే గట్టబడినదియు, చెట్లకొమ్మలచే నలంకరింపబడినదియు, అందమైన చిత్రములు గలదియు, కిటికీలు గవాక్షములు గలదియు, చిత్రహారములతో గూడినదియు, విశ్వకర్మచే నిర్మింపబడినదియు, పవిత్రమైన సిద్ధ విమానమువలె నున్నదియు, దారు నిర్మితమైన కృత్రిమ పర్వతములు గలదియు, రక్తచందనపు పూతగలదియు, పుష్పములయొక్కయు, పద్మములయొక్కయు హారములచే గప్పబడినదియు, ఉదయించుచున్న సూర్యుని వర్ణము గలదియు అయిన శిబికను తీసికొని వచ్చి అచ్చట నిలబెట్టెను. దానిని జూచి రాముడు తమ్మునితో నిట్లనెను. లక్ష్మణా! వేగముగా వాలినిందు ఉంచుడని చెప్పుము. ప్రేతకార్యమును వేగముగా జరిగింపజేయు మనగా ఆ మాటలాలకించి అధికమగు దుఃఖముతో భూమిపై తూలుచు అంగదుడును, సుగ్రీవుడును వాలిని శిబికయందు పరుండబెట్టి, పుష్పములను, వస్త్రములను, నగలను వేగముగా అర్పించి, వానరరాజు విలువైన మణులు, వస్త్రములు మొదలుగా సమస్త దానములు చేయుడు వనచరులారా! శిబికకు ముందుగా నడువుడు. సాటిలేని సంపదలు గల భూపతుల సమూహములు ఔర్ధ్వదైహికములు చేయు విధముగా లోటు లేకుండా ఒనర్పుడని వారలకాజ్ఞాపించెను. అంతట తారుడు మొదలైనవారు కుమారుడైన అంగదుని చుట్టుచేరి గొప్ప శోకధ్వనులతో విపరీతమైన వ్యధతో వాలియున్న శిబిక యొద్దకు గుంపులుగా నేగిరి. తార మొదలుగాగల స్త్రీలందఱును వీరా ! యను నాదములతో పలుమారులు రోదించుచు ఇంద్రపుత్రుని శిబిక వెంట ఆర్తితో వెళ్ళుచుండిరి. ఆ వానరస్త్రీల నాదములచేత అడవులు, కొండలు మారుమ్రోగుచు అవియే యేడ్చుచున్నట్లుండెను. జన సంచారములేని యొక యేటి నీటియొద్దు నందలి యిసుకలో వానరులు అప్పుడు చితిని పేర్చిరి. వాహనము మోయుచున్న

వాహకులు వాలి శవము నచ్చట దించి ఆర్తితో దూరముగ వెళ్లిరి. అంతట తార శిబిక యందు శయితుడైన వాలిని సమీపించి తన తొడయందు భర్త శిరము నుంచుకొని యిట్లు దుఃఖించెను.

**శిబికయందున్న వాలిని జూచి తార యేడ్చుట**

హా! వానరేంద్రా! మహారాజా! హృదయేశా! హా మహాశూరుడా! మహార్హా! దేవా! నన్ను మన్నిచ్చునట్టి ఆ మన్నన యేమాయెను ? కన్నెత్తి నన్నేల చూడవిప్పుడు ? ఇంతమందియు నీకై యిట్లు శోకించుచున్నారు. సుందరాంగా! వారలను జూడుము. జీవములు విడిచిన వాడవైనను నీ యందమైన మొగము కళకళ లాడుచు కాంతులు చిమ్ముచున్నది. అస్తమించుచున్న సూర్యుని యొక్క అందమైన కాంతివంటి కాంతితో బ్రతికియున్న వానివలెనే ఒప్పుచున్నది. అయ్యో! ఎప్పుడు చూతునయ్యా! నిన్ను కఱవుతీరునట్లు? అరణ్య మధ్యమందొక్క బాణముచే నీ స్త్రీలందఱకును ముత్తైదువ శోభలనపహరించి యముడే రాముని యాకృతి ధరించి నిన్ను తీసికొని వెళ్ళుచున్నాడయ్యా! నీయందెల్లప్పుడును ప్రేమగలవారై నీ ప్రేమకు పాత్రములైన నీ ప్రియురాండ్రయ్యో! కాలినడకతో ఇంత దూరము నీ యొద్దకు వచ్చుట నీవేల యెఱుగకున్నావు? ఈ చంద్రముఖు లందఱును నీ రమణులే కదా వానరేంద్రా! పలుకరింపవేలా? నీ తమ్ముడదిగో యేల వాత్సల్యము తొల్కాడునట్లేల పలుకరింపవు. ఓ పురుషవర్యా! నీకిది తగియున్నదా? మహారాజా! వీరలే తారులు మొదలుగాగల నీ మంత్రులు. మంత్రాలోచనములు సలుపరాదా? వీరే పురమునందలి జనులు గుంపులై నిన్ను చుట్టి నిలిచియున్నారు. వారలకు తగిన విధముగా సెలవియ్యవయ్యా! అందగాడా! వీరలందఱు వెడలిపోగా వేడుకగా మనము చెలరేగి అధికమైన మదన వ్యాపారముతో అందమైన వన మధ్యమునందు విహారము సలుపుచుందము. ఓ నాథా! యేల నీవూరకుండుట ?

## అంగదుడు వాలిని సంస్కరించుట

అని ఈ విధముగా విలపించుచున్న తారను స్త్రీలు పట్టి లేవనెత్తగా దుఃఖించుచు సుగ్రీవునితో గూడి అంగదుడు తన తండ్రిని తగు విధముగా చితిపై జేర్చి చాలాకాలము ప్రవాసముగా పరలోకమున కేగుచున్న వానరరాజునకు కరుణముగా నేడ్చుచు అగ్ని ముట్టించెను. సూర్యనందనుడు అపసవ్యముగా ప్రదక్షిణము చేసెను. ఇంద్రసుతుని ఈ విధముగా అగ్ని సంస్కారము చేసి విధివిహితముగా ఉదక ప్రదానము చేయుటకై చల్లని నీరు గల మంచి నదిని జేరి సుగ్రీవుడును, తారయు, అంగదుడును వాలికి ఉదక దానము చేసిరి. ఈ విధముగా వారితో సమానమైన దుఃఖము గలవాడగు రాముడును తన మనస్సు బాధనొందుచుండగా సూర్యపుత్రునిచే ప్రేత కార్యములను సక్రమముగా జరిపించెను. యుద్ధమందు మరణించిన తన అగ్రజునకు దహనాది సంస్కారమంతయు పూర్తికాగా మనస్థిమితము లేని వాడై సూర్యపుత్రుడు రామచంద్రుని సన్నిధికి వచ్చెను.



# ఇరువది యాఱవ సర్గము

## హనుమంతుడు శ్రీరాముని సుగ్రీవునకు పట్టాభిషేకము చేయ వేడుట

మాసిన వస్త్రములు గలవాడును, గొప్ప దుఃఖమున మునిగినవాడును అయిన సుగ్రీవుని, నతనిమంత్రి సమూహము సేవింపగా అతడు మునులచే సేవింపబడుచున్న బ్రహ్మ వలె నుండెను. అంత మేరుపర్వత సమానుడును, ఉదయించుచున్న సూర్యబింబము వంటి ముఖము గలవాడును, అయిన మారుతి చేతులు జోడించి రామచంద్రునితో నిట్లనెను. ఓ రాఘవ వంశవర్ధనా! నీ కరుణ, కలిమి చేత చింతలు దీరి ఈ వానరరాజు ఏ విధముగా నైనను పొందరానిదగు రాజత్వమును పొందెను. నీ వనుమతించినచో సుగ్రీవుడు వానరసమూహముతో కిష్కింధకు వెళ్ళి దివ్యౌషధులతో పట్టాభిషేకమును పొంది కార్యములు నిర్వహించును. మీరచ్చటికి వచ్చినచో మనోహరములగు మణులతోనూ, పరిమళముగలిగిన పుష్పములతోనూ విశేషమైన భక్తితో పూజలను చేయును. అదే గుహ. రండు పోదము. అందు మీరీతనిని పట్టాభిషిక్తునిగ జేసి వానర కోటులకు సంతోషమును కలుగజేయుడని చెప్పగా ఆ కోవిదశ్రేష్ఠుడు హనుమంతునితో నిట్లనెను.

## శ్రీరాముడు సుగ్రీవుని పట్టాభిషేకమున కనుమతినిచ్చుట

ఓ హనుమా! నా జనకుని యాజ్ఞ వలన నేను పట్టణమున గాని, పల్లెను గాని ప్రవేశింప జాలను ఈ పదునాల్గేండ్లును. కావున సూర్యపుత్రుడు హాయిగా పట్టణమును ప్రవేశించి వేగముగా యథావిధిగా పట్టాభిషేకమును బొంది వానర రాజ్యము నేలుగాక అని చెప్పి రఘురాముడు సుగ్రీవునితో నిట్లనెను. సుగ్రీవా! ఈ అంగదుని యువరాజుగా జేయుము. ఇతడు నీతో సమానమైన బలము

గలవాడు మఱియు మీ అన్న యొక్క పెద్ద కుమారుడు గాన నేవిధముగా చూచినను యువరాజపదవి యీతనికి దగియున్నది. వాన కాలము నందు ముందుగా వచ్చు మాసము శ్రావణ మాసము. వార్షికములను సంజ్ఞ గల నాలుగు మాసములును వచ్చినవి. ఏ ప్రయత్నములు జేయుటకును ఇది తగిన సమయము గాదు. నీవు పట్టణమునకు వెళ్ళుము. నేను లక్ష్మణునితో గూడ ఈ పర్వత గుహ యందు నివసించెదను. ఇది అనుకూలముగా నున్నది. మంచి గాలి యున్నది. అందముగా రమ్యముగా విశాలముగా నున్నదీ ప్రదేశము. కాలువలతో పద్మములతో గూడి యున్న విచ్చుటి సరస్సులన్నియును. కార్తీక మాసము వచ్చునప్పుడు రావణుని వధించు ప్రయత్నము చేయుము. నీవు పురమునకు వెళ్ళి నీ స్నేహితులు సంతోషపడునట్లుగా రాజువగుము.

## సుగ్రీవ పట్టాభిషేకము

ఇది మన యొప్పందము. అని చెప్పగా అనుజ్ఞను పొందిన వాడై సుగ్రీవుడప్పుడు కిష్కింధకు వెళ్ళి వానర సమూహములభివాదములు చేసి వెనుక గుంపులైరాగా, పురజనులేల్లరు సాగిలపడి నమస్కరింపగా, వారలను లేవనెత్తి మనోహరములగు వచనములతో ఊరడించి తనయన్న అంతఃపురమును ప్రవేశించి తార యొక్క దుఃఖమును నివారించి బయటికి రాగా వానర వీరులందఱును దేవతల సమూహ మింద్రునివలె సంతోషముతో అభిషేకము చేయగా, సూర్యసుతుడు దివ్యమైన తేజస్సుతో ప్రకాశించెను. బంగారు భూషణములతో నలంకరింపబడిన తెల్లనైన గొడుగును, బంగారు దండములు గల చామరములును, వివిధములగు రత్నములును, సర్వౌషధులును, క్షీరముగల వృక్షములు యొక్క చిగుళ్ళును, పుష్పములును, ధాన్యములును, తెల్లని వస్త్రములును, సుగంధలేపనములును, సుగంధయుక్తములైన భూమి పైనను, జలమునందును బుట్టిన పుష్పసమూహములును, అగురుచందనము మొదలగు దివ్యగంధములును, అక్షతలును, బంగారమును, పెద్దపులి చర్మమును, నెయ్యియును, అడవి పంది తోలుతో చేయబడిన చెప్పులును, గసగసాలును,

మేలైన పెరుగును, తేనేయును సమకూర్పగా మణిశిల గోరోజనము కలిపిన ఉత్తమమైన విలేపనములు పుచ్చుకొని పదునాఱుగురు కన్యలు సంతోషముతో రాగా, భక్ష్యములతో, మణులతో, వస్త్రములతో, బ్రాహ్మణులను యథావిధిగా తృప్తినొందించి, దర్భలు పరిచిన స్థలమందు అగ్నిహోత్రుని ప్రజ్వలింపజేసి, పవిత్రమైన మంత్రములతో తగు విధముగా హోమము చేసి, రంగురంగుల పూలమాలలతో నలంకరింపబడిన భవనమునందు అందమైన సింహపీఠియందు తూర్పు ముఖముగా వానర వీరశ్రేష్ఠుని కూర్చుండబెట్టి అనేకములగు నదీనదముల జలములను, సముద్ర జలములను తెచ్చి బంగారు కడవలందు నిండుగా పోసి కలశములను, యెద్దు కొమ్ములను ముంచి విధివిహితముగా మైందుడును, ద్వివిదుడును, గంధమాదనుడును, గాజుడును, గవయుడును, గవాక్షుడును, హనుమంతుడును, జాంబవంతుడును, నలుడును, శరభుడును, సంతోషముతో దేవతలింద్రుని నభిషేకించినట్లు విపరీతమైన పరిమళము గల జలముచే వానర నాయకుని నప్పుడధికమైన ప్రేమతో నభిషేకించిరి. సుగ్రీవుడును సంతోషముతో రామచంద్రుడు చెప్పినట్లుగా అంగదుని యువరాజుగా చేయగా వానర శ్రేష్ఠులందఱును సంతుష్టితో మేలు మేలని పొగడిరి. రాముని, లక్ష్మణుని మెచ్చుకొనిరి. సౌధములంతటట జెండాలను, తోరణములను వానరులెత్తగా నగరమంతయు తేజస్సుతో నెంతయో శోభించెను. తన పట్టాభిషేక వార్తను విష్ణుసన్నిభుడగు రామచంద్రున కెరిగించి తన భార్యయైన రుమతో అభిమతమైన సుఖముల ననుభవించుచు వైభవమున సుగ్రీవుడు ఇంద్రునితో సమానుడై ప్రకాశించెను.



# ఇరువది యేడవ సర్గము

## శ్రీరామలక్ష్మణులు ప్రస్రవణ గిరి గుహను జేరుట

రామచంద్రుడంత సౌమిత్రితో గూడి పెద్దపులులు, సింహములు మొదలగు మృగముల ధ్వనులతో గూడినదియు, వివిధములైన పొదలతో, తీవలతో నిండియున్నదియు, అనేకములైన గొప్ప వృక్షములతో నిండియున్నదియు, వానరములు, ఎలుగుబంట్లు, అడవిపిల్లులు మొదలగు వానితో గూడినదియు, నల్లమేఘముల గుంపువలె నున్నదియు, అందమైన జలాశ్రయములు గలదియు, అయిన ప్రస్రవణ పర్వతమునకరిగి లక్ష్మణునితో నిట్లనెను. ఈ గుహ అతివిశాలముగాను, అందముగాను, తగినంత గాలి వీచునట్టిదిగాను ఒప్పుచున్నది. చూచితివా! లక్ష్మణా! వానకాల మంతయూ గడపుటకు సంతోషముతో ఇందుండుటయే యుక్తముగా నుండును. ఈ పర్వత శిఖరము తెల్లని, ఎఱ్ఱని, నల్లని రాళ్ళ చేతను, గైరికాది ధాతువుల చేతను, సెలయేళ్ళతో గూడిన చరియల చేతను, అనేకమైన వృక్షసమూహముల చేతను, నెమళ్ళయొక్కయు, పక్షిసంఘముల యొక్కయు, నాదముల చేతను, వావిలి, కడిమి, మొల్ల, గుల్మము, గురివింద, మద్ది, ఏఱుమద్ది, వృక్షముల పుష్పముల చేతను, మనోహరమై యొప్పుచున్నది. చూచితివా ? అందమైన చిత్రమైన లతలచే నిండి యున్నది. ఎచ్చట చూచినను అందమై యున్నవి గోరంట్ల చెట్లు. గుహ కూడా ఎత్తైనదిగా యున్నది. మనముండుటకిది యుక్తమైన చోటుగా యున్నది. లక్ష్మణా! ఈ సరోవరమును జూచితివా? లక్ష్మికి నివాసమైయున్న అందమైన కమలములకు నివాసమై, నిర్మలమై మన గుహకు సమీపముగానుండి

సంతసమును కలుగజేయుచున్నది. తూర్పుగాను, ఉత్తరముగాను ఈ గుహ వాటముగా పల్లముగా నున్నది. జల్లు కొట్టకుండా నుండుటచే సుఖముగా నుండును. ఆ వెనుకప్రక్క మిఱ్ఱుగా నుండుటచే గాలి కూడా మితముగా వీచును. నాయనా ! ఇచ్చట గొప్ప చాపరాయి ఎంతో అందముగా ఖండింపబడిన పెద్ద కాటుక కుప్పవలే కనిపించుచున్నది. ఉత్తరముగా నున్న మరియొక శృంగమును జూడుము. భిన్నమైన అంజన సమూహమువలే నుండి మేఘపంక్తివలె వ్యాపించియున్నది. దక్షిణమున తెల్లని మఱియొక శిఖరము కైలాసపర్వతమో యనునట్లుగా ముందఱ గన్పించుచున్నది. తూర్పు దిక్కుగా ఏఱు పారుచున్న దదిగో అది బురద లేక త్రికూటపర్వతమున నున్న జాహ్నవీనదికి సాటివచ్చు నట్లున్నది. మద్ది, తాడి, ఉలిమిరి, తక్కోలము, బొట్టుగు, ఱేల, గిరకతాడి, పొగడ, అందమైన ప్రబ్బలి, పద్మకము, తెల్లతెగడ, వెదురు వృక్షములచే నెట్లు ప్రకాశించుచున్నదో చూడుము. అక్కడక్కడ అనేక విధములైన ఆకృతులతో చెట్ల సమూహములు గట్లయందున్నవి. చూచితివా? అవి స్పష్టముగా వస్త్రము లను ఆభరణములను ధరించిన స్త్రీలవలె కన్పించుచున్నవి. అందమైన హంసల గుంపుల యొక్క నాదములు గలదియు, ఒకదానితో నొక్కటి మిక్కిలి సమానత గలిగి అనురక్తములైన చక్రవాకములతో శోభించుచున్నదియు, అందమైన యిసుక తిన్నెలు గలదియు, అధికముగా బెగ్గురులు, హంసలు, తుమ్మెదలు చేయుచున్న నాదములతో నిండినదియు అయి నవ్వుచున్న స్త్రీ యనునట్లు ప్రకాశించుచున్నది. ఒకచోట మనస్సునకాహ్లాదనమును కలుగజేయు కలువల గుంపును, ఒకచోట ఎఱ్ఱని పద్మముల సమూహమును, ఒక ప్రక్క తెల్లకలువల మొగ్గల సమూహము, ఒక ప్రక్క నీరుకోళ్ళయొక్క అందమును, ఒక వంక నెమళుల కేకల బింకమును, ఒకచోట క్రౌంచపక్షుల అందమును, ఒక పక్క చందన వృక్షముల కాంతియు, ఒక చోట మునులు వసించు చోటులను, గలిగి ఈ తరంగిణి యందమును జూచితివా? ఔర ! ఇది యెంత అందముగనున్నది. ఇందే మనము ఆనందముగా

చిరకాలము నివసింతము. ఇక్కడకు కిష్కింధపురము కూడా దూరము కాదు సుమా. అచ్చటినుంచి గీతావాద్య ధ్వనులు, వానరులు మ్రోగించుచున్న మృదంగముల ధ్వనులను వినిపించుచున్నవి. రుమను, రాజ్యరమను పొంది వానరరాజు మనస్సు నందు సంతోషమును పొందును గదా. అని చెప్పుచూ ఆ ప్రస్రవణ పర్వతమున ఇనకులుడు నివసించెను. అందన్ని సుఖములు నమరియున్నను తన ప్రాణపదమైన భార్యను దలచుచు ఆర్తితో నుండుటచే సంతోషమును పొందడాయెను. తూర్పు కొండయందుదయించుచున్నచంద్రుని చూచి వ్యదచెందినవాడై మనోహరమైన శయ్య యున్నను ఒక్క రోజు గూడ రామచంద్రుడు నిద్రచందడయ్యేను. పొంగి వచ్చుచున్న శోకము చేతను, కారుచున్న బాష్పములతోను బాధపడుచున్న శ్రీరాముని జూచుచు అతనితో సమానమైన దుఃఖముతో నున్న వాడయ్యును. లక్ష్మణుడతని దుఃఖముపశమనము చెందునట్లుగా అన్న నిట్టులోదార్చెను.

**లక్ష్మణుడు శ్రీరాము ననునయించుట**

అన్నా! రామచంద్రా! ఈ విధముగా దుఃఖముచే అపన్నుడవై కృశించుట నీకు భావ్యమగునా? దుఃఖభారముచే పనులు నాశనమునొందునని నీవెఱుగవా? నీవు కార్యాచరణశీలుడవు. రామచంద్రా! దైవపరాయణుడవు కూడా. నీవు అతిధర్మశీలుడవు. సాటిలేని సత్కార్యాపరుడవు. ఆస్తికుడవు. అట్టి నీవు మహాత్మా! ఇట్లు ధైర్యమును గోల్పోయినచో క్రూరుడైన రాక్షసరాజును యుద్ధరంగమందు నీ బాహుశక్తి కనిపించినట్లుగా చంపగల్గుదువా? దుఃఖవేగమును తొందరగా మొదలంట నశింపజేయుము. స్థిరమైన ధైర్యమును పొందుము. ఎట్లో పూనిక వహించి సకల సేవల, పుత్రమిత్ర సహితుడైన దానవుని ధ్వంసము చేయుము. ఇట్లు తీరని వ్యథలతో కుందుచుండుట న్యాయమా? శౌర్యమును నిధానమైన రామా! సమస్తమైన పర్వతములు, వనములు, సముద్రములు మొదలగు వానితో

గూడిన భూమండలముననైనను తలక్రిందయిపోవునట్లు చేయగలవాడవు. అటువంటి నీకీ దానవుడొక లెక్కయా? వానకాలము వచ్చినది. ఇక శరత్కాల మదిగో వచ్చును. మనస్సునందధికమైన ఓర్పు వహింపుము. తరువాత రావణాసురుని వాని బంధువులతోను, స్నేహితులతోను చంపెదవు గాక. తగిన సమయమున ఆహుతికై ప్రజ్వలింపజేయు అగ్నిని వలె నేను నిన్నెచ్చరించెదను. అని లక్ష్మణుడు చెప్పగా, తనకు హితము, శుభము కలుగజేయు ఆ వాక్యములను మనస్సునందు నిలుపుకొని ధరణీపతియగు రాముడు తన శ్రేయస్సును గోరు సన్మిత్రమగు లక్ష్మణునితో నిట్లనెను. తమ్ముడా! నీవనురాగముతోను, స్నేహము తోను, మేలుగోరుచు, సత్యము, శౌర్యము, దర్పములు పెంపొందించుచు లెస్సగా చెప్పుటచే కార్యవినాశకారి యగు దుఃఖమును విడచితిని. నీవు చెప్పిన విధముగా కాలము వచ్చుదనక ఓర్పుతో వేచియుండెదను. నదులను, కపీశ్వరుడగు సుగ్రీవుడును ప్రసన్నులగు వఱకు ఓర్చుకొనెదను. వీరుడగు పురుషుడు ఉపకారికి ప్రత్యుపకారమునెట్లైన చేయును. ప్రత్యుపకారము చేయక మఱచు నట్టి క్రూరాత్ములు సుజనులైన వారి మనస్సులను నొప్పించును గదా. అని చెప్పగా విని లక్ష్మణుడు జానకీపతితో రామచంద్రా! నీవనినట్లు సర్వము సమకూరును. వానర రాజు తగిన వేళయందు తాను పూనుకొని సాయము చేయును. వానలు నిల్చువఱకు ఓర్పు వహించి ఈ నెలయందు గడుపుము. తరువాత విరోధి కోటల గూల్తువుగాక.



# ఇరువది యెనిమిదవ సర్గము

## వర్షర్తు వర్ణనము

అని చెప్పుచున్న తమ్ముని జూచి లక్ష్మణా ! వృష్టి సమయము వచ్చినది. చూచితివా ? పెద్దకొండల వలె మబ్బులు గొప్పగా ఆకాశమున వ్యాపించి యున్నవి. భూమిపై చీకట్లు గ్రమ్మినవి. ఆకాశము సూర్య కిరములచే సముద్ర జలములనన్నింటిని ద్రావి తన నైపుణ్యము తెలియునట్లుగా తొమ్మిది మాసముల గర్భము ధరించి నెమ్మదిగా రసాయనము నీ విధముగా ప్రసరించుచున్నది. మేఘములనెడి నిచ్చెనల నాధారము చేసికొని వినువీధికెక్కిపోయి సూర్యుని నునుపైన కొండవలె, ఏరుమద్ది పూవులతో అలంకరించుటకు వీలుకలుగునట్లు న్నది చూడుము. సంధ్యాకాలపుటెఱ్ఱని కాంతులక్కడక్కడ నొప్పుచుండగా ఎక్కువ భాగము తెల్లగానుండి చివఱలందు నల్లగా స్నిగ్ధములై యున్న మబ్బులతో ఆకాశము చింపిరి బట్టలతో కట్టబడిన వ్రణము వలె నున్నది. మందముగా వీచుచున్న గాలులనెడి విశ్వాసము గలిగి సంధ్యారాగమనెడు చందనపు పూత కలిగి తెల్లని మబ్బులు గలిగి ఆకాశము కామ బాధచే పీడింప బడిన వానివలె నున్నది చూచితివా ? తాపముచే క్రాగినదై, తొలకరి జలములచే తడుపబడినదై భూమి ఆర్తిచే బాధనొందుచున్న జనకరాజ పుత్రివలె బాష్పధారలను గూర్చుచున్నది చూచితివా ? సోదరా! మేఘముల మాతనుండి వేదాల వచ్చినవియు, చెంగలువల మీదనుండి చల్లగా వచ్చినవియు, మొగలి పువ్వుల సుగంధములు గలవియునగు గాలులు చేరలకొలది జుఱ్ఱుకొన వచ్చునుసుమా. మొగలి పుప్పొడులచే కప్పబడినదియు, వికసించిన అర్జున పుష్పములచే వ్యాపింపబడినదియు అయి ఈ పర్వతము వర్షధారలచే అభిషేకింపబడుచున్నదై

శత్రువినాశముచే వెలుగొందు సూర్యపుత్రునివలె నొప్పుచున్నది. మీదగప్పిన మేఘమే కృష్ణాజనముగా, వర్షధారలే యజ్ఞోపవీతములుగా గుహలనిండా చలిగాలి నిండి శబ్దించుచుండ కొండలు, వేదములు చదువుచున్న మనుష్యులవలె నున్నవి. పుటముబెట్టిన బంగారపు మెఱుగుల మెఱుపులనెడు కొఱడాలతో పుట్టగా వేదనతో గట్టిగా మొరవెట్టుచున్న బ్రహ్మచారియో యనునట్లు ఆకాశము శబ్దించుచున్నది. చూచితివా ? అక్కటా లక్ష్మణా! మెల్లని మేఘమునందు మెఱయుచున్న మెఱుపు రావణుని యంక తలమున భూపుత్రి బాధాతిశయముచే వణకుచున్న రీతి దోచునట్లుగా నెట్లు వణుకుచున్నదో చూచితివా ? నల్లని మేఘములచే ఆచ్ఛాదింపబడినదై దిక్కులు గ్రహతారకా చంద్రకాంతులు లేనిదై ఏది కేదియో యేర్పరించుటకు వీలుగానివై స్త్రీ సహితులగు కాములకు హితకారులై యొప్పుచున్నవి. విరివిగా కురియుచున్న వర్షమునందు కుతూహలము గలవియు ఆవిరులెగుజిమ్ముచున్నవియు అగు కొండమల్లెలు కొండచెరియలందు కామోద్దీపనములై కనిపించుచున్నవి. దుమారములు రేగుట తగ్గినది. చల్లగాలులు వీచదొడగెను. శరీరమునందు చమటలు కారుట తగ్గినది. విసనకర్రల అవసరము తగ్గిపోయెను. దూరములకు వెళ్ళిన ప్రజలు వేగముగా ఇండ్లకు చేరుచుండిరి. యుద్ధయాత్రలకు వెళ్ళక రాజులు తమతమ పట్టణము లందు నెమ్మదిగా నుండిరి. మానస సరస్సులందు నివసించుట యందాశక్తి గల హంసలు ఎందుదాగెనో తెలియదు. చక్రవాక పక్షులు జంటచాయక హాయిగా ఆనందించుచుండెను. భోరుమని ఒక్కటే ధారాలుగా వానలు, పాములు వ్రేలాడునట్లుగా కురియుచుండుటచే ఇక బండ్లమీద దారులలో ప్రయాణములు సాగవు. అనఘా ! అచ్చటచ్చట మేఘములు వ్యాపించి యుండుటచే ఒకచో ప్రకాశము వేరొకచో అప్రకాశమైయున్న ఆకాశము అచ్చటచ్చట కొండలతో గూడియున్న, అలలులేని సముద్రమువలెనున్నది. వేగిస, కడిమి, పువ్వులతో గూడినదియు, పర్వతములందలి గైరికాదిధాతువులచే నెట్టబడినదియు, నెమళ్ళ కేకలతో గూడినవియు, అగుక్రొత్త నీళ్ళతో గూడినవై నదీసమూహములు

దూకుచూ పారుచున్నవి. చూచితివా ! వివేకవంతుడా ! రసముతోనిండి మంచి రుచిగా నున్నవియు, తుమ్మెదలవలె నల్లగా నున్నవియునై, నానేరేడు పండ్లను గాలికి నేలరాలిన వివిధ వర్ణములు గల పండిన చూతఫలములను జనులు భుజింతురు. తెల్లకొక్కెరల మూలికలతో నొప్పెడు మెరుపులనెడు టేక్కెములు గలవియై కొండలవలె నున్న మేఘములు యుద్ధరంగముననున్న గజముల విధముగా గర్జించుచున్నవి చూడుము. వర్షము సంతుష్టి పొందునట్లుగా మబ్బులు కురియుచుండగా పచ్చిక తనివినొందగా ఉత్సాహము నొంది నెమళుల సమూహము నాట్యమాడుచుండగా ఈ సాయంకాలములందు వనములు చూచుట కందముగా నుండును. గర్భధారణమును గోరి తెల్లకొక్కెరల సమూహముగ మేఘమును కామించి ఆకాశమున వెడలుచున్నవై తెల్ల పద్మములచే కట్టబడి గాలికి తూగాడుచున్న మాలికయో యను నట్లొప్పుచున్నది. నీటి భారముతో నిండినవై మేఘములు బలకమాలికలతో కూడినవై గర్జించుచు పెద్ద పెద్ద కొండ శిఖరములపై నిలిచి, నిలిచి లేచిపోవు విధమును చూచితివా? లక్ష్మణా! అధికముగా ఆరుద్రపురుగుల పిల్లలు అచ్చుటచ్చుట రాలుచుండగా అందమైన లేత పచ్చికలతో గూడి, భూమి అందమైన ఎఱ్ఱపట్టులో మొగ్గల బుటా కుట్టిన చిలుకపచ్చ చీరను ధరించిన కాంతయన నొప్పుచుండెను. వేగముగా నది సముద్రము లోనికురికెను. తొందరగా కొంగల గుంపులు మేఘసమూహమును జేరెను. విష్ణువు నిద్రజెందెను. కాముక యయిన స్త్రీ ప్రియుని చెంత జేరెను. నెమిళ్ళు సంతసముతో ఆటలాడుచుండెను. కదంబపు చెట్లకొమ్మలు పువ్వులతో నిండియుండెను. భూమి పంటలతో ప్రకాశించెను. ఆవులును మేలైన కోడెలును సమానమైన ప్రేమతో మెలగెను. ఈ సమయము నందు నెమిళ్ళు నాట్యము చేసెను. విరహిణీ జనము చింతతో వాడిపోయెను. అందమైన వనములు కళకళలాడెను. గజ మిథునము పాడెను. కపులు చంచలత్వమును వీడెను. భోరని వానలు జాలువారెను. అన్ని వాగులు, వంకలు వేగముగా పాఱెను. మదమెక్కిన ఏనుగులు సంతోషమును పొందినవై సెలయేళ్ళ

సమీపములందును, గట్లయందును ఎంతో వేడుకతో గేదంగి పూల వాసనలను కుత్తక బట్టి, గొంతుక వఱకు పీల్చి పర్వత సానువులనుండి దూకుచున్న సెలయేళ్ళ మ్రోతలకు బెదరుచూ, మదించిన నెమిళ్ళ గుంపులతో గలిసి దిక్కులు నిండునట్లుగా ధ్వని చేయుచున్నవి. ఇష్టముగా పుష్పముల మకరందములను ద్రాగి నిమిషములో మత్తెక్కినట్టి తుమ్మెదల గుంపులప్పుడు వర్షధారల చేత కొట్టబడినవై దిగులుచే తపించుచు తమ మదములను వదలి కదంబపు గొమ్మల మీద వ్రేలాడుచున్నవి. చూచితివా? రసము చిందుచూ చల్లారిని నిప్పుపొడి వర్ణము గలిగిన నేరేడు పండ్లు కప్పగా తుమ్మెదల గుంపులు మురిసిన విధముగా జంబూవృక్షపు గొమ్మలలరుచున్నవి. చూచితివా ? మెరుపులనెడు పతాకము లును, గంభీరములగు గర్జలనెడి గర్జనలును గలిగి ఆకాశమునందలి మేఘములు యుద్ధభూమియందలి మదించిన ఏనుగులవలె కనిపించుచున్నవి చూడుము. ఆ పర్వత వనము నందలి మార్గమున నొక ఏనుగు వెళ్ళుచూ తన వెనుక నొక మేఘ గర్జ వినిపించగా, కోపముతో అచ్చట మరియొక యేనుగు యుద్ధమునకు తనను బిల్చుచున్నదని తలంచి యుద్ధము చేయుటకై మరలి వెళ్లుచున్నది. ఆ యేనుగును చూడుము. లక్ష్మణా! ఇచ్చటి వివిధములగు వనములు కొన్ని ఆడుచున్నట్లును, కొన్ని పాడుచున్నట్లును, కొన్ని మత్తుతో నిండియున్నట్లును, తమ యందుండు నెమిళ్ల యొక్క ఆటలచేతను, తుమ్మెదల పాటలచేతను, ఏనుగుల మద మందగమనముల చేతను కనుపించుచున్నవి. చిగురులు దొడిగిన కదంబ, అర్జున వృక్షములచే నందమైనదియు, నూత్నమగు జలముతో నిండినదియు, మదించిన నెమిళ్ల నాట్యములు గలదియునై వనము పానశాలవలె నొప్పుచున్నది. ఇంద్రదత్తములై, స్వచ్ఛములై ముత్తెముల వలె తామరాకుల మీద నున్న నీటిబిందువులను దప్పికతో వివిధవర్ణముల రెక్కలు గల చక్రవాక పక్షుల సమూహము గ్రోలుచుండెను. తుమ్మెదల రొదలు ఇంపు గలిగించు తంత్రీస్వరముల వలెను, కప్పలు ఒకదానిని మించి మఱిఒకటి అరచుచుండుట తాళధ్వనుల వలెను, మేఘముల గర్జనలు మృదంగ ధ్వనులవలెను, ఇంపు

మీరగా ఈ అడవులందు సంగీత గోష్ఠివలె నొప్పెను. కొన్ని నెమిళులు పాడుచుండగా, కొన్ని నృత్యము చేయుచుండగా, కొన్ని చెట్ల కొమ్మలలో నిలిచి చూచుచుండగా, కొన్ని విప్పారిన పింఛములే భూషణములుగా గలవికాగా వనములందు సంగీతసభ జరుగుచున్నట్లుండెను. మబ్బుల ఉరుములచే కప్పలు చాలకాలము నుండి పోవుచున్న నిద్రను వదలి, వానధారల వలన కలిగిన సంతోషముతో అనేక విధములగు అరుపులతో సంతసమును దెలుపుచున్నవి. అందమైన, నునుపుదేరిన జక్కవ పక్షులు విపరీతమైన మదముతో నలరారగా, ఉరలి పడుచున్న నొడ్డులను దాటుచు మిక్కిలి గర్వమతిశయించగా పుష్పము లును, ఫలములును కానుకలుగా తీసుకొని ప్రేమతో వేగముగా కేరింతలతో తమ భర్తను చూచుటకై నదులనెడు క్రొత్తపెళ్లి కూతుండ్లు వెళ్ళుచున్నారు సుమా. కాలిన కొండలతో గూడిన, కాలిన కొండల వలె నల్లని మేఘములతో గూడిన, నల్లని మేఘములు మరింత నల్లనై యొప్పెను. మబ్బులను జూచి పొంగిపోయి కేకలు వేయుచున్న నెమిళ్ల సమూహములును, ఆరుద్ర పురుగులతో గూడిన పచ్చిక బయళ్ళును, గొప్ప సువాసనలు వెదజల్లు కడిమిమద్ది పువ్వులును గల వనములందు మదించిన ఏనుగులు సంచరించుచున్నవి. విడువకుండగా ధారలుగా కురుయుచున్న వానలచే అందము తొరగిన కేసరములుగల తామరపూల మీదినుండి వెడలిపోయి తుమ్మెదలు బాగుగా ప్రకాశించుచున్న కేసరములుగల కదంబపుష్పముల సమూహముపైకి మేఘముగా వ్రాలుచున్నవి. హీనదశ వచ్చినప్పుడు చంచల స్వభావులు మైత్రిని దలంచుదురా? లక్ష్మణా ! ఈ వానకాలము గజరాజుల కానందకరమై, వృషభములకు సంతోషప్రదమై, సింహములకు విశ్రాంతి నిచ్చునదై, పర్వతముల కందచందములు గలిగినదై, దొంతరలు దొంతరలైన మేఘములచే ఆడుకొనచున్న దేవేంద్రుడు గలదై, యుద్ధములను తలంపక ప్రశాంతముగ నున్న రాజులు గలదై యొప్పుచున్నది. సాదరముగా జూచితినా ? సముద్ర ఘోషలను తమ గర్జలతో తిరస్కరించుచు, ఆకాశముతో నొరసికొనుచు, మేఘ సమూహము ఏళ్లను, కొలకులను, బావులను,

చెఱువులను ఏకమై పోవునట్లు చేసెను. చూచితివా ? చిమ్మచీకట్లు భూమి నిండ క్రమ్ముచుండగా భోరున ఏకధారగా వర్షము కురుయుచుండగా 'గాలి రివ్వు రివ్వున వీచుచుండగా' నదులన్నియును గట్లపైనుండి పొంగిపొర్లుచూ ఏవేవో తప్పు దారులలో అతి వేగముగా ఇప్పుడు ప్రవహించుచున్నవి చూచితివా?

ఈ భూమి యందు జనులచే పట్టాభిషేకము పొందినరాజులు తమ వైభవమును జూపుచున్నటులు ఇంద్రప్రదత్తములైన, గాలిచే కొనిరాబడిన మేఘములచే అభిషేకింపబడిన పర్వతసమూహములు తమ నిజరూపముల వైభవములను ప్రకటించుచున్నవి. చూచితివా ? చుక్కలతో గూడిన ఆకాశము మేఘములచే ముసుగు పెట్టినట్లైనది. సూర్యుడేప్రక్కన నున్నాడో కానరాకున్నాడు. ఈ భూమియు అధికమైన నీటిచే తృప్తిపొంది యుండెను. చిక్కని చీకట్లు సర్వమును ముంచివేసినవి. దిక్కులన్నియు తమ తేజస్సు తప్పియుండెను. ఏ దిక్కేదియో కూడ తెలియ రాకుండెను గదా. లక్ష్మణా ! వానధారలచే మెఱుగు పెట్టబడినట్లు తెల్లగా నైన కొండలన్నియు ప్రకాశము గలిగి వ్రేలాడుచున్న మంచి ముత్తెముల దండలో యనునట్లుగా నున్న పర్వతసానువుల నుండి దూకుచున్న సెలయేళ్ల సమూహములతో భోగులవలె కనిపించుచు సంతసము గలిగించు చున్నవి చూచితివా ? కొండల మీద నుండి దూకుచున్న సెలయేళ్ల సమూహములు, కొండల గుండ్లు దారికడ్డముగా చెదరి ప్రక్కలకు వెళ్ళి జారుచు, గుహలలో నుండి వినసొంపుగా కూయుచున్న నెమళ్ల గుంపులమీద హారముల వరుసల వలె గనంబడుచున్నవి చూచితివా ? స్వర్గలోకమునందు దేవతాస్త్రీలు మదనయుద్ధము నందు ప్రియులతో అనగిపెనగి యున్న సమయమున తెగినట్టి హారములు భూమిపైకి జారుచున్న విధము దోచునట్లు వానధారలధికముగా కురియుచున్నవి. పక్షులు గూళ్ళు చేరుట చేతను, ముకుళించుచున్న పద్మముల వరుసల చేతను, పుష్పించిన జాజి పొదలచేతను, సూర్యుడు క్రుంకుట మనసున నూహింపబడుచున్నది. ఇది దారి, ఇది డొంక యని తెలిసికొన లేకుండుటచే శత్రువుల మీద పగ తీర్చుకొనుటకు సైన్యములు వెనుగాడుచుండగా, రాజుల

యొక్క దండయాత్రలు వెనుకబడెను సుమా. ఓ సోదరా! ఈ భాద్రపద మాసమందు ఘనమతులగు విప్రులు ఇది యధ్యయన సమయమగుటచే సామవేదాధ్యయనమును ప్రారంభించెదరు. గృహ కృత్యములను విడచి, గొప్పగా పదార్థములను సమకూర్చుకొని విరక్తిని బొంది ఆషాఢమాసము మొదలుకొని శ్రద్ధా సహితుడై మన భరతుడు వ్రతధారియై యుండును గదా. పట్టణము నుండి వచ్చుచున్న నన్ను చూచి అయోధ్యలో నుండు జనులు భరింప రాని ధ్వనితో దుఃఖించిన విధముగా సరయూ నది వేగముగా ధ్వని చేయుచు ప్రవహించుచుండెను. అందముగా నున్న ఇట్టి సమయమున నశించిన శత్రువులు గలవాడగు సుగ్రీవుడు భార్యా సహితుడై రాజ్య భోగములతో క్రీడించుచుండెను. నేను భార్య లేని వాడనై, రాజ్యమును వీడిన వాడనై సహింపరాని ఆర్తి చేత నది యొక్క ఒడ్డు వలె క్రమక్రమముగా కూలిపోవుచున్నాను. ఈ వానకాలము దాటరానిది. నా హృదయ మందలి శోకాగ్ని అత్యధికము. రావణుడు భయంకరమైన పరాక్రమము గలవాడు. మన కార్యమేవిధముగా పారము నొందునో గదా. ఓ ధరణీశ్వరా! నన్నేమి చేయమందువో చెప్పమని వానరరాజగు సుగ్రీవుడు వేడగా నేను, మార్గములగమ్యములనియు, ఎన్ని నాళ్ళకో ప్రియ భార్యను గూడెను గదా యనియు, మన కార్యము చాల పెద్దది గదా యనియు తలంచి ఏమియు బల్కక పోయితిని. అతడే తగిన సమయమున వచ్చును. ఆ కపిశ్రేష్ఠుడు ఉపకారము చేసిన వానికి తిరిగి యుపకారము ఎట్లైనను చేయకమానడు. అట్లు ప్రత్యుపకారము చేయుట మరచిన క్రూరుడు సుజనుల మనస్సును నొప్పించును. అని రాముడు చెప్పగా విని లక్ష్మణుడు జానకీ నాథునితో అన్నా! నీవనినట్లు సర్వము జరుగును. వానరరాజు తగిన సమయమందు తానే పూనుకొని సాయము చేయగలడు. వానలు నిలుచు దాకా ఓర్పుతో నిచ్చట నుండుము. తరువాత శత్రువును సంహరింపవచ్చునని చెప్పగా అంతట.

# ఇరువది తొమ్మిదవ సర్గము

## కామ పరతంత్రుడగు సుగ్రీవుని హనుమంతుడు చోధించుట

మెఱుపులు మబ్బులు విడిపోగా, వేడుకతో హంసలు ధ్వని చేయుచుండగా శోభాయమానముగా దిక్కులయందు వెన్నెలలు కాయుచుండగా, ఆకాశము నిర్మలమై ప్రకాశించుచుండగా చూచి మహాభోగభాగ్యముల సమృద్ధిగలవాడును, కామ పరతంత్రుడును, సజ్జనులు నడుచు దివ్యమైన మార్గమునకు దూరముగా నున్నవాడును, ధర్మార్థములను తలంపనివాడును, ఏ పనులు చేయకున్న వాడును, స్త్రీ రత్నసంగమమునందు ఆసక్తుడైనవాడును, మనోరథములు సిద్ధించుటచే రాత్రి పగలనక హాయిగా సంచరించువాడును, నిజభార్య తోడను, తార తోడను హాయిగా విహరించుచున్నవాడును, నందనవనము నందు దేవతాస్త్రీలు బృందములు గట్టి గొలుచుచుండ ఆనందించునట్టి యింద్రుని వలె విహరించుచున్నవాడును, మంత్రులయందు రాజ్య కార్య భారము నుంచి రాజ్యతంత్రముల పట్ల విమర్శలేనివాడును, రాజ్యాధిపత్యమునకు దగిన కర్తవ్యమును నిర్వహింపనివాడును, ఆజ్ఞ లేనివాడును, ఎల్లప్పుడును మన్మథ సౌఖ్యములందే ఆసక్తుడైనవాడును అగు వానరరాజును సమీపించి తత్వజ్ఞానము కలవాడును, కాలము యొక్క విలువ తెలిసినవాడును, హితము, సత్యము, నీతియుక్తమునయిన మాటలను చెప్పుటయందు నేర్పు గలిగిన బుద్ధిమంతుడును, నెమ్మదైన మృదువచనములు గలవాడును అగు హనుమంతుడు వినయముతో నిట్లు చెప్పెను. ఓ కపిరాజా ! కీర్తియు, సంపదలును, రాజ్యమును లభించెను. ఇక మిత్రుల కార్యము నెరవేర్చుట ఒక్కటే మిగిలియున్నది సుమా. కాలమును దెలిసికొని ఆయాకాలములందు స్నేహితులందు తగిన విధముగా రాజు

ప్రవర్తించినచో యశస్సు, రాజ్యము, శౌర్యము చాలా పెరుగును సుమా. దండమును,స్నేహితుల సమూహమును, ధనాగార బలము, రాజు అను నీ నాలుగును బాగుగ నున్నచో రాజ్యము అఖండ సమృద్ధితో ప్రకాశించును సుమా! వానరనాధా! నీవు మంచినడవడి గలవాడవు. నీ మనస్సెప్పుడును సన్మార్గమందు ప్రవర్తించు చుండును. వానరరాజా! నీకు వేగముగా హితుల కార్యమును జేయుపనికి యత్నము చేయదగి యున్నది. ఓ కపికులతిలకా! తనపనులనన్నిటిని వదలుకొనియైనను, తన మిత్రుని పనులందుత్సాహమును పొంది నడచు నాతడు ఎప్పుడును ననర్థములను పొందడు సుమా. సమయమతిక్రమించిన తరువాత మిత్రుని కార్యమును నిర్వహించుటకు సమకట్టిన పురుషుని నే విధముగా నెంత కష్టముల కోర్చినను అతనిని మిత్రకార్య పరుడని అనరుగదా.

## హనుమంతుడు సుగ్రీవునితో సీతను వెదకింపుమని చెప్పుట

కాన నీవు మిత్రకార్యమును తగిన సమయమునందే చేయుము. మంచి స్వభావముగల సుగ్రీవా! విదేహ రాజపుత్రిని వెదకుటకై పంపిచుము. కాలమిదివరకే అతిక్రమించినది. ప్రజ్ఞాసంపదగలవాడును, నీకు వశమై యున్నవాడును, అగు రామచంద్రుడు తొందఱ గలవాడయ్యును, కాలము దాటుటను తనెరిగి యుండియును, నిన్ను తొందరపెట్ట దలంపకున్నాడు సుమా. చిరకాలమును స్నేహముచేయుటకు తగిన మాన్యుడును, అప్రమేయమైన మహిమ గలవాడును, అపురూపమైన సుగుణములు గలవాడును, రాజులలో చంద్రుడివంటి వాడును, అగు రామచంద్రుడు నీ వంశమును భూమిపై నిలబెట్టెను. అతడు నీకు మొదట ప్రఖ్యాతిగా మేలుచేసెను. అతనికి నీవును ప్రీతిని కలిగింప వలదా ? వేగముగా వానరులనందరను సమకూడుట కాజ్ఞాపింపుమా. ఇతరులు హెచ్చరించక మునుపే యేకార్యమునైన చేసినచో కాలాతిక్రమణ దోషము కలుగదు. ఇతరులు హెచ్చరించిన తరువాత కార్యము చేసినచో కాలాతిక్రమణ దోషము కలుగును. ఉపకారము చేయని వానికైనను

రాజా ! ఉపకారము చేయుట నీతియే గదా. నీకు విశాలమైన రాజ్య విభావము లను గలుగ జేసిన రామచంద్రుని విషయమున నింక నేమని చెప్పవలెను. ధైర్యము గలిగిన వాడవు, బలవంతులలో పొగడబడిన వాడవు, మంచినడవడి గలవాడవు నీవు వానరరాజా ! ఎందుచేత రామచంద్రుని కార్యము తీర్చుటకై వానర కోట్లను పంపించక యిట్లాలస్యము చేసితివి ? నీవిట సహాయముగా వెళ్లక నిలిచి నంతమాత్రముచే రాముని కార్యము వ్యర్థమై పోవునా? వాడియైన బాణపరంపరలచే రాక్షసులను, దేవతలను, పన్నగములను క్షణ మాత్రముననే సంహరింపగల బలముగలవాడు. కాని నీ ప్రతిజ్ఞ యెట్టిదో చూచుటకై ఓర్చి యున్నాడు సుమా. ప్రాణములను కూడ లెక్కపెట్టక రాముడు ధైర్యముతో నీకు మేలు కలుగజేసెను. నీవు కూడ సైన్యముతో వెళ్ళి అతని రాణిని ఆకాశము నందును, భూమియందును వెదకింపుము. దేవతలను, రాక్షసులను, మరుత్తులును, పక్షులును, సర్పసమూహములును మొదలగు వారందఱును కలిసి వచ్చినను రామునకు రవంతకూడ భయము కలిగింప లేరనగా ఇక రాక్షస సమూహము ఒక లెక్కయా ? నీకుపకారము చేసిన ఆ ఘనునకు తిరిగి మేలుచేయ సమకట్టుము వానరేశ్వరా! నేలయందును, ఆకాశమునందును, జలములందును, అగ్నియందును, పాతాళమునందును సందేహింపక ఎంతోవేగముగా వానరులందఱు నీవనుజ్ఞ నిచ్చినచో వెళ్ళగల సమర్థులు. పూనుకొని యెట్టిపనినైనను సామర్థ్యముతో నెరవేర్పగల నేర్పరులగు వానరులు కోట్ల కొలదిగా గలరు. ఏమి చేయవలయునో సెలవిమ్ము. అనగా కడుయోగ్యము లగు హనుమంతుని మాటలను అన్నింటిని చక్కగా విని సుగ్రీవుడు, వానర సేనాపతియగు నీలుని జూచి అనేకులగు వానరాధిపులు నా యొక్క ఆజ్ఞచే పదిహేను దినంబులలో సైన్యములతో గూడి రావలయును. అట్లు రాకుండ ఆలస్యము చేసినచో ప్రాణములను దీయుదునని చాటింపుము. తారాపుత్రుడైన అంగదుడును, నీవును, వేగముగా తగిన పద్ధతులతో ఈ కార్యము చేయుటకు పూనుకొనుడని చెప్పి సుగ్రీవుడు అంతఃపురమున కేగెను.

# ముప్పదవ సర్గము

## శరత్కాలమున శ్రీరాముడు సీతావిరహముచే తపించుట

వానలు వెలిసిపోవుగా, ఆకాశమన్నిచోట్ల నిర్మలమై కనిపించుచుండగా, చంద్రమండలము ప్రకాశమానముగా నుండగా, క్రొత్త శరత్కాలకాంత నిర్మలమైన చంద్రకాంతి యనెడు చందనము అందముగా పూయుచుండగా వానరరాజ పరిమిత సుఖములందుచుండగా, కాలము మించి పోవుచుండుటను చూచుచు, మెరుపులు, మబ్బులు తొలగగా, హంసల అరపులు చెలగుచుండగా, వెన్నెలలు ప్రకాశమానముగా దిక్కులందు కాయుచుండగా, ఆకాశము మిక్కిలి నిర్మలముగా నుండగా, ఉన్నతమైన పర్వత శిఖరమునందు రామచంద్రుడు కూర్చుండి, మనస్సునందు తన ప్రియ భార్యయైన సీత తరుణిని తలంచుచు శోకముతో ఇట్లు పరితాపమును బొందెను. సారసముల మధురధ్వనులు చెలగెడి యాశ్రమమున జానకి మున్ను రమించెడిది. ఇప్పుడామె ఎట్లున్నదోగదా. పుష్పించిన వృక్షములను, పదారువన్నెల బంగారమువలె, నిర్మములైన శుభ ప్రదమైన వేగిసపువ్వులను చూచుచు కుసుమకోమలియైన జానకీదేవి నేను లేకుండుటచే ఎట్లు విచారించుచున్నదో గదా. మధురములగు వాక్కులు గల సీత మునుపు మాటలాడుచుండగా హంసలధ్వని యొక్క పోలికను జూచి గుర్తించుచుంటిని. మృదువైన అవయవములు గలిగిన ఆ జానకిని ఇప్పు డేవిధముగా తెలియగలవాడను. ప్రేమతో ఒక్కటిగా కలిసి తిరుగుచున్న జక్కవ పక్షుల జంటల యొక్క ధ్వనులను విన్న జానకి నన్ను వీడి దిక్కులేనిదై మిగుల దైన్యముతో నొంటరిగా ఏ విధముగా తపించుచున్నదో గదా! ఆ పద్మముల

వంటి హస్తములు గలది, ఆ చేపలవంటి కన్నులు గలది, ఆ అందమైన తీగ వంటి సుకుమారి, ఆ అమృతము వంటి సాటిలేని చిలుక పలుకులు గలదియగు సీత లేక ఈ పద్మసరోవరములును, ఈ నదీ తీరప్రదేశములును, ఇచ్చటి ఈ వన ప్రదేశములును నాకు సంచరించుటకింపు గలిగింపకున్నవి. శరత్కాల మందలి వెన్నెలలు, పుష్పములు మొదలగు సాధనములతో విజృంభించెడు మదనుడు వియోగముచే ఆర్తిబొందుచున్న సుకుమారి యగు సీతాదేవిని మరణకారణమై బాధింపకుండునా? చాతకము నీటికై ఇంద్రునకు మొరపెట్టుకొను విధముగా కౌసల్యా తనయుడు సీతా వనజాక్షికై విశేషవ్యధతో విలపించెను. ఒంటరిగా నున్నవాడై సీతా కాంతకై ఒక్క విధముగా చింతించి, చింతించి విసంజ్ఞుడై యున్న భూకాంతుని రాముని జూచి

### లక్ష్మణుడు శ్రీరాముని దుఃఖము బాపుట

ఫలములను దెచ్చుటకై అనేక స్థలములకు వెళ్ళి వచ్చిన సుమిత్రా నందనుడు అత్యంత విషణ్ణమైన చిత్తము గలవాడై అన్నా ఇదేమిటి? నీయొక్క గొప్ప పరాక్రమము పరాభవము పొందునట్లుగా కామునకు లొంగిపోవుట తగి యున్నదా? ధైర్యముతో పనులు నెరవేర్పవలసి యున్న సమయమున నిట్లు చింతలచే కృశించుట తగియున్నదా? మనమిప్పుడు చేయవలసిన కార్యమును నిర్ణయించి బుద్ధి నిర్మలత్వమును పొంది, కాలము యొక్క తీరును జూచి వానరరాజు యొక్క గొప్ప సహాయమును తలంచి దేవతలను గూడ సేవించుటను మనస్సునందు గ్రహించి, శత్రువులను దునుమాడువాడా! ధైర్యము వహించి విక్రమముతో ముందునకేగుము. ఓ స్త్రీ నిలయా! నీ పత్ని యగు భూపుత్రి ఇతరులకు సులభముగా లభించునా? ప్రజ్వలించు అగ్నిజ్వాలలో పడి ఓ వీరుడా! మానవుడెవ్వడు మనగల్గును? అని హితమును, నీతియుక్తమును, ధర్మమును, సామమును ఒప్పు విధములుగా చెప్పుచున్న తమ్ముని మాటలను విని

రామచంద్రుడు నాయనా! నీవు చెప్పిన మాటలు మంచివౌను సుమా. గొప్పనైన కార్యమును జేయుట కాలోచించి తగిన ప్రయత్నమును చేయదగును అని చెప్పుచు...

## శరదృతు వర్ణనము

తరువాత రాముడు పద్మదళముల వంటి నేత్రములు గల సీతను తలచి ఆర్తితో లక్ష్మణునితో నిట్లనెను. సహస్రాక్షుడు భూమిని గొప్ప వర్షధారతో తృప్తినొందించి, పైరులను రక్షించి ధన్యత్వము నందెను. వృక్షములు, పర్వతములు మొదలగు చోట్ల మేఘములు వర్షించి బడలిక తీర్చుకొనుచున్నవి. కారుమబ్బులు దిక్కులందు కాటుక పట్టించి మదము తొలగిన ఏనుగుల వలె వేగమును కోల్పోయినవి. నీటితో గూడినవియు, ఎక్కువ వేగము గలవియు, కొండగోగు, ఏరుమద్ది పువ్వుల పరిమళములు గలవియు, విజృంభించినవియు నగు గాలులు విసరి విసరి వీచి విరమించినవి. ఓ వీరశ్రేష్ఠుడా! మేఘముల యొక్కయు, ఏనుగుల యొక్కయు, నెమిళ్ల యొక్కయు ధ్వనులు కొండవాలులందొక్కమాటే నిలిచిపోయినవి వింటివా? సోదరా! విడువక కురిసిన వాన ధారలచే నిర్మలము లైన కొండ చరియలు విచిత్రములైన కాంతులతో పూయబడినట్లు ప్రకాశించు చున్నవి. ఔరా! సిగ్గుతో నున్న స్త్రీ నవసంగమవేళయందు జఘనమును జూపు విధముగా శరత్కాలపునదియు మెల్లమెల్లగా ఇసుక తిన్నెలను చూపుచున్న విధమును జూచితివా? ఏడాకుల యరటి కొమ్మలయందును, నక్షత్రముల యొక్కయు, సూర్యచంద్రుల యొక్కయు కాంతులందును, గజేంద్రముల యందును తన కాంతి వైభవములను శరత్కాలము పంచిపెట్టినట్లు ఒప్పెను. శరదృతు గుణములన్నిటిని పొంది అనేక విధములైన కాంతులతో కూడిన క్రొత్త అందము సూర్యుని లేత కిరణములచే వికసింప జేయబడిన సరోవరము నందు మిక్కిలి ప్రకాశించెను. కప్పురపుటరటి పువ్వుల వాసనలను మదించిన

తుమ్మెదల ఝుంకారములను గలిగిన మందమారుతములు వనములో మనోహరముగా వీచుచూ మదించిన గజములకు దర్పమును అధికముచేసెను. జంటజంటలుగా నదీసైకత స్థలముల యందుండి చనుదెంచి సరస్సులలో క్రీడించుటకై ప్రయత్నించుచు తమ రెక్కలు విప్పుచు మూయుచు చెలగిలాడుచు, పుప్పొళ్ళు బుక్కాలు చల్లినట్లుగా శరీరములమీద నిండియుండగా ఒకదానినొకటి యెదురుకొనుచు చక్రవాక పక్షులును, హంసలును కేళులందు వినోదించు అందమును జూచితివా ? మదించి తిరుగుచున్న గజములందును, క్రొవ్వెక్కి తిరుగు కోడెలందును, నీరు తేటగా అయి పాఱుచున్న నదులయందును, శరదృతు శోభ యెన్నో విధములుగా తోచుచున్నవి. మబ్బులు లేని ఆకాశమును జూచి సంతోషము తగ్గిపోగా తమ పింఛములనెడి యాభరణములను విప్పక, ప్రియురాండ్రను విడచి కాంతి తగ్గినవై అడవులందు నెమిళ్ళ సమూహము ధ్యానములు చేయుచుచున్నవి. చూడుము. గరగరలాడు పుటముపెట్టిన బంగారు కాంతులు దిక్కులయందు నిండగా బాగుగా వికసించిన పుష్పముల భారముచే నేలకు వంగిన కొమ్మలంటతను కనువిందు చేయుచుండగా ఘుమ్మని, కమ్మని వాసనలు వ్యాపింపజేయు మంకెన చెట్లతో ఈ వనములెంత యందముగనున్నవో చూడుము. ఆడ యేనుగులు వెంటనంటి రాగా సరోవరములందు ప్రీతిగలవియు, పుష్ప గంధములచే మదమెక్కినవియు, గొప్ప వనములందు విహరింప నాసక్తిగలవియు, అధికమైన మదజలము గలవియు, అధికమదముచే గూడినవియు, నయిన ఏనుగులు వనములందు మందగమనముతో వెడలు చున్నవి చూచుచున్నావా? సోదరా! అదిగో ఆకాశము చికిలిచేసిన ఖడ్గము వలె నల్లగా తళతళ మెరయుచున్నది. నదీజలములు నిండు జవ్వనముతోనున్న స్త్రీల నడుముల వలె సన్నగిల్లెను. పద్మముల సుగంధములు చల్లదనము గల గాలులు సంచరించదొడగెను. దిక్కులన్నియు చిమ్మచీకటులు తమ్ము వదలి

పోవుటచే కళకళలాడుచున్నవి. సూర్యరశ్మి యొక్క వేడిమి సోకి బురదయంతయు బీటలు తీయసాగెను. మాడిన విధముగా భూమినుండి సన్నని దుమ్ము మాటి మాటికి రేగుచుండెను. శూరులు విరోధము కోపముతీరునట్లుగా ఒకరి నొకరు జయించుటకై శౌర్యముతో దండయాత్రలు చేయబూనుటకు సమయమిదేనయ్యా లక్ష్మణా ! పొందికగా శరదృతువు యొక్క గుణములచే పుష్టి నొందిన శరీర శోభతో సందేహములేక సంచరించుచు ఎక్కువైన సంతోషముతో మదించినవై హూంకారములుచేయుచు కొమ్ములొక వంకకు ఓరగా వంచినవై ఖనిల్లనునట్లు రంకెలు వేయుచూ ఆలమందలందు ఆబోతుల సమూహము కయ్యమునకు కాళ్ళు దువ్వుచున్నవి. చూచితివా ? మన్మధ బాణములచే కొట్టబడిన మనస్సులతో తీవ్రమైన అనురాగమును పొందినవై సాటి ఏనుగులతో కూడుకొన్నదై ప్రేమ మీరగా మెల్ల మెల్లని నడకలతో అందముగా కనిపించుచు ఆడ ఏనుగుల సమూహము మదించియున్న తమనాధుని వీడక వెంటవెల్లుచున్న వీయడవు లందు చూచితివా? తమ్ముడా! తమకలంకారములైన పింఛములను విప్పక నదీ తీరములకు వెళ్ళగా హంసలు వేగముగా గద్దింపగా దైన్యముతో మరలి వేడలుచున్న నెమళ్ళను చూచితివా? జక్కవలను, నీటికోళ్ళను దిగులొందు నట్లుగా మీదమీదకు బోయి ఏనుగులు తామరపూలతో నిండిన ఆ కొలనును కలత నొందించుచు నీళ్ళను త్రావుచుండెను. బురదతేరి నిర్మలములైన జలము లును ఇసుక తిన్నెలును గోబృందములును, బెగ్గురుల ధ్వనితో గూడినవియును అగు నదీ జలములందు హంసల సమూహము ఆనందముతో విహరించెను. అడ్డులేకుండ దుముకుచు ప్రవహించుచున్న సెలయేఋల చప్పుళ్ళును, విడువక మ్రోయుచుండెడి నెమిళ్ళ కేకలును, గాలుల ధ్వనులును, కట్టుఅట్టయని విడువక అరచుచున్న కప్పలయొక్క అఋపులును, సంతోషము దొరగి అధికమగు మేఘముల గర్జలతో పాటే అణగిపోయినవి. అనేక వర్ణములు గల పాములు

చిక్కిపోయినవై ఆకలితో డొక్కలు మాడుచుండగా బుస్సుబుస్సు మనుచు బొరియలనుండి బయటపడి సంచరించుచుండెను. చంద్రకరములచే స్పృశింప బడినదై మదముతో ప్రకాశించుచున్న తారకలు గలదియై ఔరా రాగమతిశ యించుచుండగా సంధ్య తానే అంబరమును అందముగా వదులుచున్నది చూచితివా? ఉదయించిన రమ్యమైన చంద్రబింబమనెడు ముఖము గలదియు, కనిపించుచున్న అందములైన నక్షత్రములనెడు కన్నులు గలదియు అగు రాత్రి తెల్లని వెన్నెలయనెడి వస్త్రమును దాల్చినదై ఇదిగో రాత్రి తెల్లచీర ధరించిన కాంతవలె దోచుచున్నది సుమా! పండిన ధాన్యపుటెన్నులును ముక్కులందు దాల్చినవై బెగ్గురు పక్షుల సమూహములానందముతో ఆకాశమున గాలి వేగముచే ఇటునటు గొట్టబడినవై వేగముగా బరువెత్తుచున్నవి. ఓ నిర్మలమైన శీలము గలవాడా ! అప్పుడాకాశము అనేక వర్ణములు గల పూదండలను ధరించిన కాంతవలెనున్నది. నిద్రించుచున్న ఒక్క హంసగలదియు, నిర్మలమైన తెల్ల కలువల సమూహము గలదియునయి అగాధమైన సరోవరమందలి నీరు, మబ్బులు లేక రాకాచంద్రునితోనూ చుక్కలతోనూ ముద్దులు మూటగట్టుచున్న ఆకాశమును దలపించుచున్నది చూడుము. అందమైన సుకుమారములైన రాజహంసలు చుట్టనున్న వడ్డాణమువలె నొప్పగా వికసించిన నల్ల కలువలు, పద్మములును అందమైన హారములను పోలియుండగా కొలంకులు అందముగా అలంకరించుకున్న హరిణాక్షులవలె యింపుగొల్పుచున్నవి. లక్ష్మణా చూచితివా? గోవులను గాయు గొల్లపిల్లలు పిల్లనగ్రోవుల మీద అందముగా, వినసొంపుగా వాయించుచున్న ధ్వనులను ఉదయవేళలందు రెప రెపమని వీచుచున్న గాలియొక్క ధ్వనులును, గొల్లభామలు పెరుగు తరచుచుండగా పుట్టుచున్న ఘుమ ఘుమయను ధ్వనులును, కండబట్టి బలసిన కోడెలు కామోద్రేకముతో మాటిమాటికి చేయు అంబాయను ధ్వనులును, లేగలను పాలకు విడుచు

సమయమగుటచే అవి ఆకలిగున్నవగుటచే చేయు అంబేయను ధ్వనులను, చేలకును, చెట్లకును వెళ్ళుచున్న కర్షకులయొక్క పిలుపు ధ్వనులును ఒకదానితోనొకటి పోటీ పడుచుండెను. అందమైన వేణి (జడ ప్రవాహము) యందలి పూవుల సొంపు గలదై పలుచని పట్టు వస్త్రమువలె నుండి చిరుగాలి తాకిడికి కొలదిగా కదులుచున్న తెల్లు పూవులు గలిగి ప్రకాశించుచున్న అందమైన నదీకూలముల సౌకుమార్యమును జూచితివా ! తమ్ముడా ! వనములందు విశృంఖల గమనములు గలవియు, మధువును గ్రోలు నేర్పు కలవియు అగు తుమ్మెదలు ఆడ తుమ్మెదలతో గలసి నాట్యములు చేయుచు పద్మముల పుప్పొడులచే గౌరవర్ణము దాల్చినవై, మదమధికమై భయములేక గాలిలో విహరించుచున్నవి చూడు లక్ష్మణా ! జల ప్రవాహములు స్వచ్ఛముగా తేటి యుండెను. కలువలు ప్రకాశమును పొందెను. క్రౌంచపక్షులకు తీయని కంఠనాదములమరెను. వరి చేలన్నియు పంట పండియుండెను. వాయువులు మెల్లగా వీచసాగెను. చంద్రుడు స్వచ్ఛముగా ప్రకాశించుచుండెను. ఇవియన్నియు వానా కాలము వెళ్లిపోవుటను సూచించుచున్నవి. మంచి అందమైన చేపల వరుసలనెడు వడ్డాణములు గలవియై, పద్మములనెడు ముఖములు గల (వాహినులు), నదులు పతులతో రతులందనగి పెనగి తెలతెలవారుచుండగా అలసి వాడిపోయి వెడలుచున్న స్త్రీల విధముగా మెల్లని గమనములు కలవై యున్నవి. జక్కవ పక్షులతోడను, నాచు తీగల చేతను, తెల్లు పూవులనెడి తెల్లని వస్త్రముల చేతను, నదీ ముఖములు మకరికాది పాత్ర రచనలతో గూడిన స్త్రీ ముఖములవలె అందమై యున్నవి. వనములందు వికసించిన నల్ల గోరింట పూవులు, వేగిస పూవులు నను వానిచేతను, తేనెలను గ్రోలిన తుమ్మెదల గొప్ప ధ్వనులచేతను, మన్మధుడు సంధించిన ధనుర్బాణములు గలవాడై సంచారములు సలుపుచుండెను. జగత్తునకు జీవనములనొసగి యేఱులను, చెరువులను,

కొలనులను అన్నింటిని నింపి భూమియందు పైరులను పంటలను కలుగజేసి మేఘము అప్పుడు నశించినవి. నిర్మలమైన నీటియొక్క శోభ తోడను, ఇంపు గలిగించు ఆడు లకుముకిపిట్టల ధ్వనులతోడను, హాయిగా తిరుగుచున్న జక్కవ పక్షుల తోడను, సరస్సులన్నియు ఎంతో సరసముగా కనిపించుచుండెను. కొండ చరియలందు శ్యామవృక్షములును, మంకెన చెట్లను, ఎఱ్ఱకాంచనపు చెట్లును, వేగిస చెట్లును సువాసనలెక్కువగా వెదజల్లుచున్న ఏడాకుల అరటిచెట్లను ఒప్పుచున్నవి చూచితివా? ఇసుక తిన్నెలందు కంగరుల విహరణములను, బెగ్గురు పక్షుల విహారములును, జక్కవ దంపతుల కలకల నాధములు కడు రమ్యములైయున్నవి. చూడుము. శత్రువులగు రాజులు ఒకరినొకరు జయింప వలెనను అభిలాషచే యుద్ధయాత్రలకు ప్రయత్నము చేయవలసిన సమయమిదే కదా సౌమిత్రీ! ఇక ఆలస్యము చేయదగునా?

## సుగ్రీవుడు సమయమతిక్రమించి నందులకు శ్రీరాముడు విచారపడుట

సూర్యపుత్రుడిచ్చుటికి వచ్చినవాడు గాడయ్యెను. ప్రయత్నమేమియు చేసిన జాడ కనిపించుటలేదు. ఈ వర్షాకాలము నాలుగు మాసములు అత్యుత్సాహ ముతో విలాసముగా నన్ను గూడి యాడెడి సీతాసతి నెడబాసి శోకముతో తత్తరపడుచున్న నాకు నూరు సంవత్సరముల వలె గడిచెను. లక్ష్మణా! ఆడచక్రవాకపక్షి తన మగని వీడక వెళ్ళు విధముగా భయంకరమైన అడవులకు పతిహితమే కోరునట్టి బాలసీత ఉద్యానవనములకు విహారమునకై వచ్చినట్లు వచ్చెను గదా. భార్య లేని వాడని, ఆర్తినొందిన వాడని, రాజ్యమును గోలుపోయిన వాడని, వనవాసియని తండ్రీ! నాపై ఆ వానరరాజునకు దయ రాకున్నది గదా. రాజ్యమంతయును పోయెను. రాక్షస రాజుచే పరాభవము నొందెను. నీవాయనెడి దిక్కులేనివాడు, నిలుచుటకు నీడయైనలేని దీనుడు, తాను భార్యకై

యేడ్చుచున్నాడు. నన్ను శరణు పొందినాడు గదా యని ఆ వనసంచారి నాయెడల ఆదరము లేని వాడయ్యెను తమ్ముడా! తన పని నేఱవేరినది గదా ఇక మనతో నేమియని సీతను వెదకునట్టి కార్యమును ఆలోచింపదయ్యెను. ఆ వానరుడు సకాలములో తన ప్రతిజ్ఞను మరిచిన వాడయ్యెను.

## శ్రీరాముడు లక్ష్మణుని కిష్కింధకు పోయిరమ్మనుట

సౌమిత్రీ! నీవు కిష్కింధకు వెళ్ళుము. ఆ మూర్ఖుని భోగములచే కుటిలమైన మనస్సు గలవానిని గనుగొని, ఆ వానరనాధునితో నా మాటగా ఇట్లు చెప్పుము. ఆర్తితో ఆశ్రయించిన అర్హులైనవారికి మునపే ఉపకారము చేసియున్న వారికి ఆడిన బాసను తప్పి ఆశను భంగపరచినవాడే పురుషాధముడని ప్రాజ్ఞులైనవారు చెప్పుదురు. పాపమో, పుణ్యమో ముందుగా తాను పలికినట్టి మాటను తప్పకుండా సత్యము యొక్క పక్షమునవలంబించి నడచునట్టి ఆ వీరుడే సుమా భూమి యందు పురుషోత్తముడని గొప్పకీర్తి పొందును. తన పనులను చక్కగా చేసి పెట్టినట్టి తన స్నేహితుని మఱచు కృతఘ్నుడు చనిపోయినచో, వినుము. అతని యొక్క శవమును కుక్కలు, నక్కలు, గ్రద్దలు మొదలగునవి చూడనైనను చూడవు అని చెప్పుము. సోదరా! అతడు నిజముగా మేఘగర్జనవంటి ధ్వని గలదియు, మెఱుపుల సమూహము వలె మెఱయు చున్నదియునైన బంగారపువింటిని చూడగోరుచున్నట్లున్నది. కనుబొమ్మలు ముడిపడగా ఉడికిపోవుచున్న మనస్సుతో నేను తీక్ష్ణముగా లాగగా పిడుగులు వెడలగ్రక్కెడి నా అల్లెత్రాటి ధ్వనిని అతడు మరల వినగోరుచున్నాడు. నా గొప్ప ధనమును, బాణశక్తియు, నీవు నాకు బాసటగా నుండుటయు మది యందు బాగుగా తెలిసి యుండియు లక్ష్యపెట్ట కున్నాడు గదా. తన పనులు తీరి సుఖములకు మఱగినవాడై మన సమయము మఱచెను గదా. తన చెలిమిని వాలి వధను నేనేల పూనితిని? మన కతడేమని బాస చేసెను? వాన కారు (కాలము) వెళ్లిన వెంటనే చేయదునని కదా. తన

పని నెఱవేఱగనే దానినంతయు మఱచెను. వానలు వెలిసిన తోడనే నేను నిక్కముగా నిచ్చుటకు వచ్చువాడనని చెప్పెను. మన్మధకేళీలోలుడై వానాకాలము నాలుగు నెలలు గడచుట యెఱుంగడు గదా. ఇష్ట జనులతో గోష్ఠులు చేయుచు, ఇష్టము వచ్చినట్లు త్రాగి మన యీ కష్టమును తెలియకున్నాడు. శిష్టజనులచే నుతింపబడిన వాడా! దుఃఖముతో దైన్యము నంది యున్న నాపై దయదల్పకున్నాడు గదా. కావున లక్ష్మణా! నీవు వెళ్ళి గొప్పదైన నా ఆగ్రహమునకు తగిన విధముగా సుగ్రీవునితో నిట్లు చెప్పుము. ఓ వానరరాజా! మునుపు వాలి వెళ్లిన మార్గమున కంప మొలవలేదు. ఆ యింద్రనందనుడు వెళ్ళిన మార్గముననే నీవు కూడా వెళ్లకుము. వానరా! ఇంకనైనను నీ మనస్సునందు మనము చేసికొన్న బాసను తలంపుము. మునుపు వాలి నొక్కనినే బాణముతో సంహరించితిని. ద్రోహబద్ధితో సత్యముగా పల్కిన మాటలను దలంపని బుద్ధిహీనుని నిన్ను బంధుయుతముగా సంహరించెదను సుమా. వానరరాజా! నీవు చేసిన శపథమును దప్పకుము. సనాతనమైన ధర్మపద్ధతిని నాశమొందింపకుము. వాడి బాణములతో నేల గూలిన నీ సోదరుని జూడబోకుము. యని తీవ్రమైన అగ్ని వంటి తేజస్సు గల లక్ష్మణా! నీకేది యుక్తమని తోచునో దానినంతయు నా మాటగా చెప్పుము. దేవ సమానుడగు రాముడీవిధముగా కోపముతో చెప్పగానే లక్ష్మణుడు గూడ సుగ్రీవునందదేవిధముగా గొప్ప కోపము నొంది గొప్ప బలశాలియు,

**లక్ష్మణుడు శ్రీరామునితో సుగ్రీవుని తాను వధించెదనని చెప్పుట.**

కామముచే దీనముగా నున్న వాడును అగు రాముని జూచి యిట్లు పల్కెను. ఔరా! మనస్సునందు సజ్జనుల నడవడిని తిరస్కరించి మైత్రివలన లభించిన అధికమైన భోగ సౌఖ్యములను తెలిసి కొనకున్నాడు. రాజ్య సౌఖ్యములు గనుక నాశనమైనచో అప్పుడు నిన్ను మనస్సునందు తలంచు వాడగును సుమా.

తుచ్ఛములు, గ్రామ్యములునైన సుఖములందిష్టము గలిగి మతిలేనివాడై ఉపకారమును తలంపని ఆ తోకవానికా రాజ్య సంపదలు. నా బాణములచేత వాలి వెళ్ళిన మార్గమునందే ఈతడును వెళ్ళునుగాక. రఘురామా! కోపము నాపజాలకున్నాను. నేనా అనృతములాడిన వాడగు వానరరాజును సంహరించెదను. తరువాత అంగదుడు భూపుత్రిని వేగముగా వెదకించునుగాక అని పల్కగా, భయంకరమైన బాణములను ధరించినవాడును, విల్లు చేబూనిన వాడును, శత్రువులను సంహరించుటయందు సమర్థుడును, క్రూరుల సమూహమునెడ ఆగ్రహము కలవాడును అగు లక్ష్మణునితో రఘురాము డిట్లునెను.



# ముప్పది యొకటవ సర్గము

## శ్రీరాముడు లక్ష్మణుని శాంతపరచి కిష్కింధకు పంపుట

తమ్ముడా! నీవంటి గుణములు గలధన్యుడిటువంటి పాప కార్యమును జేయు దలంచునా? ఈ పని చేయుట మానుమన్నా! లక్ష్మణా! మన యొక్క స్నేహమును, పూర్వపు మన నడవడి యొక్క విధమును తలంచి యథా ప్రకారముగా నెంతయో ప్రేమతో నడుచుకొమ్ము. పాపమును మంచి వివేకము చేత తొలగింప జేయు ఘనుడే నరులందుత్తముడనబడును. ఇది మనస్సు నందుంచు కొనకుము. వానర రాజుతో కఠినోక్తులను మాని మృదువైన మాటలతో మనమనుకొన్న సమయమతిక్రమించినదని మరచి పోయితివని హెచ్చరింపుము. అని శత్రువీరమర్దనుడగు రాముడు మంచి హృదయముతో చెప్పగా లక్ష్మణుడు తన యభిప్రాయమును మార్చుకొని వేగముగా ఇంద్రధనస్సు వంటి ప్రకాశవంతమైన వింటిని ధరించి, ప్రళయకాల యముని వలె శృంగముతో నొప్పు మందర పర్వతము వలె ప్రకాశించెను. అన్నగారు చెప్పినట్లుగా తాను మాటాడదగిన మాటలును, తనతో వానర రాజు మాటాడు విధమును బృహస్పతితో తుల్యమైన బుద్ధి సంపద గల లక్ష్మణుడు మనస్సునందు తలంచుచు, కాలితాపులతో మద్ది, ఇనుమది, తాడి మున్నగు చెట్లను నేల గూల్చుచున్నవాడై, రాళ్లన్నియు నలగి నుగ్గగునట్లుగా యేనుగును దలపించుచు, కామమువలన కలిగిన క్రోధమునుండి పుట్టిన అధికమైన రాముని కోపాగ్ని తన్నావరింపగ, భయంకరమైన గాలియో యనునట్లుగా అతివేగముగా వెళ్ళెను. తాను తలపెట్టిన పనితొందర చేతను, తన్ను చుట్టుముట్టిన ఉద్రేకము చేతను, తన కుడి పాదమును

దూరదూరముగా వేయుచు లక్ష్మణుడెక్కువైన వేగముతో కిష్కింధా పట్టణము సమీపమునకు వెళ్లెను. దట్టముగా నున్న పర్వతముల నడుమ వానర రాజగు సుగ్రీవుని చే పరిపాలింప బడుచున్న కిష్కింధా పట్టణము నెట్టయదుట చూచి వానర రాజు నందు పుట్టిన కోపముచే క్రింది పెదవి యదరుచుండగా..

## లక్ష్మణుని జూచి క్రోతులు భయపడి పరువెత్తుట

కిష్కింధా పట్టణము బయటి ప్రదేశమున దిరుగుచున్న వానరులను జూచెను. వారునా సౌమిత్రిని జూచి చేతులందు పర్వతశిఖరము లందలిచెట్లను ధరింపగా దానితో అనేకమైన సమిధలచే మండుచున్న అగ్ని హొూత్రుని వలె రెట్టించిన ఆగ్రహము కలవాడుకాగా, అతనిని తేరి చూడలేక ప్రళయకాలమందలి యముడోయని భయపడుచూ గుంపులు గుంపులుగా వానరులు దిక్కులవెంట పరువెత్తుచు సుగ్రీవుని యొక్క సౌధమును ప్రవేశించి వేగముగా ఆగ్రహముతో వచ్చుచున్న లక్ష్మణుని విధమును చెప్పగా, తారతో కామముతో అనేకవిధముల కేళివినోదముల దేలుచు అంతఃపురములో నుండుటచే వానర రాజు వారు చెప్పుచున్న ఆ మాటలు వినడయ్యెను. మంత్రులచే ఆదేశింపబడిన వారై కొండల వంటి, ఏనుగుల వంటి, మేఘముల వంటి ఆకారములు గలవారులును, పది యేనుగుల బలము గలవారును, నూరు ఏనుగుల బలము గలవారును, పదివేల యేనుగుల బలము గలవారలును, వికృతమైన ఆకారము గలవారును, చిఱుతపులి వంటి పరాక్రమము గలవారును అయిన వానర శ్రేష్ఠులు చెట్లను చేతుల ధరించిన వారై దుర్గములందు, ప్రాకారములందు, అగడ్తల ప్రక్కలను ప్రాకారము గల వారై నివసించిరి. అంత అన్న పడుచున్న బాధయు, వానర నాథుడేమరుపాటును నుండుటయ, తలంచి మనస్సున తీవ్రమైన కోపమతిశ యించగా పెద్ద వేడి నిట్టూర్పులు వెడలగా కనులెఱ్ఱవడగా పొగతో గూడిన అగ్ని యనునట్లును, బాణపు కొన నాలుక గాను, విల్లు తలగాను, తన యొక్క

తేజస్సే విషముగాను, ఐదు ముఖములుగల సర్పమో యనునట్లును రాముని సహోదరుడుండెను.

**సుగ్రీవునకు తన రాకను గూర్చి తెల్పుమని లక్ష్మణుడంగదుని పంపుట**

ప్రళయకాలమందలి యగ్నియో యనునట్లు ప్రజ్వలించుచు సర్పరాజో యనునట్లు అధికమైన ఆగ్రహముతో నొప్పెడు వానిని, అలముకొన్న భయముతో అంగదుడు ఆరాటపడుచు చేరరాగా, ఆతనిని జూచి లక్ష్మణుడిట్లు పల్కెను. ఓయీ! అంగదా! వెళ్ళి నీ పినతండ్రి కిట్లు చెప్పుము. మదించిన దుష్టులను మర్దించువాడగు లక్ష్మణుడిదిగో నీతో మాట్లాడుటకు మనస్సులో తన అన్న దుఃఖపాటునకు సంభ్రాంతిని, సంతాపమును పొందిన వాడై ద్వారమునొద్ద నిలిచియున్నవాడు, నీ కతని మాటనైనా వినవలెనని మనస్సునందు తలపు గల్గినచో, ఓ వనచరీ! దానికి యుక్తమైన విధానము నాచరింపుము అనిచెప్పి వేగముగా మరలి రమ్మనగా అంగదుడు శోకముతో వెళ్ళి తండ్రియైన సుగ్రీవునకును, తల్లియగు తారకును, పినతల్లి యగు రుమకును మ్రొక్కుచూ విశదములైన మాటలతో ఆయుదంతమునంతయు వినిపించెను. మోహ చిత్తముతో నుండి సురను త్రావుట చేత మత్తెక్కిన వాడై గొప్ప నిద్రమత్తుగలవాడై సుగ్రీవుడంగదుని మాటలను వినడయ్యెను. మదముచే మత్తెక్కిన వారలకు మనవులు, గినవులు వినిపించునా? తీవ్రమైన ప్రవాహమువలె వచ్చుచున్న లక్ష్మణుని జూచి వానరుల సమూహములు గుండెలు పగులునట్లుగా భయము నొంది అతని సమీపమున కిచకిచమని దయ పుట్టునట్లుగా అన్నియు ధ్వనులు చేసెను.

**సుగ్రీవునకు మంత్రులు హితము బోధించుట**

ఆ గొప్పధ్వని చే మెల్లగా మేలుకొని చెదరిన భూషణములు గలవాడు, మదముచే చలించుచున్న ఎఱ్ఱని నేత్రములు గలవాడు నగు సుగ్రీవుడంగదుని

మాటలను వినెను. అంగదుని మాటలను విని అతనితో వచ్చినట్టి దూర దర్శులును వానర రాజున కిష్టులైన మంత్రులును అగు ప్లక్షుడు, ప్రభావుడు అనువారు అర్థధర్మముల ననేక విధముల పలుకుటకు వచ్చియున్న రామ సోదరుని గూర్చి ఇంద్రునివలె సుఖోపవిష్టుడైయున్న వానరరాజుతో ప్రస్తావించి, అతనికి హితము కలుగునట్లుగా నిట్లనిరి. ఆ అన్నదమ్ములు నీకు రాజ్యమును సుఖమును నిచ్చిన దాతలు. మిత్రులలో శ్రేష్ఠులు దశరథరాజ పుత్రులు. ఈ భూభారమునంతయు భరింపగలవారలు. ఎల్లపుడును సత్యముగా నడచువారలు. మహానుభావులు సుమా. ఆయిద్దరిలో నొకడైన లక్ష్మణుడు శత్రువై విల్లు ధరించి రాగా, ఆ మహా బలశాలిని జూచి కోతులన్నియు భయముతో ఇట్లు గోలపెట్టు చున్నవి వింటివా? వానరరాజా! పనినెరవేర్చ పూనికయనెడు రథము గలవాడై రాముని మాటయనెడు సారథి గలవాడై సౌమిత్రి రాముని యాజ్ఞచే వచ్చి అంగదుని వేగముగా నీ సన్నిధికి పంపెను. చూపుల చేతనే కపులను మాడ్చుచున్న విధముగా నున్నాడు. పుత్రులను, బంధువులను తీసుకొని వెళ్ళి అతని తీవ్రమైన కోపము తీరునట్లుగా వేగముగా పాదముల మీద పడి వేడుకొనుము. రాజ ధర్మము తెలిసిన రామవిభుడు చెప్పిన విధముగా మనస్సుంచి చేయుము. నీవు పలికిన మాటను నిలబెట్టుకొనుము. సత్యవాదివనెడు ప్రఖ్యాతిని పొందుము.



# ముప్పది రెండవ సర్గము

## లక్ష్మణుడు వచ్చిన వార్త విని సుగ్రీవుడు భయపడుట

అని తన మంత్రులు చెప్పగా సుగ్రీవుడు తన కోట వాకిట కోపముతో సౌమిత్రి నిలిచి యున్న వాడును అంగదుని మాటను విని ఆసనమున గదలిపోవుచు తన మంత్రులతో నిట్లనెను. నేను చెడ్డ మాటలాడలేదు. వారికెదురు చెప్పలేదు. చెడు చేయ దలంపలేదు. ఆ రామచంద్రుని సోదరుడిట్లేల కోపమును పొందెనో కదా. రంధ్రములను వెదకునట్టి నావిరోధులు నాకు కీడుచేయనెంచి ఆ రఘుసింహునితో లేనిపోనివి చెప్పియుండిరేమో. ఇంకేమి చేయువాడను? మొట్టమొదటగా అతని యొక్క బుద్ధి తీరును, అతడు చేయ నిశ్చయించిన విధమును నా శ్రేయస్సు గోరు వారి చేత అతని పుణముగా ఉన్నదున్నట్లుగా తెలిసికొనదగును. నేను లక్ష్మణునకు భయపడను. రామభద్రున కైనను భయము చెందను. కాని ప్రియమైన స్నేహితుడు కారణము లేకయే ఆగ్రహము నొందుటకు కలతజెందుచున్నాను. స్నేహితులను సంపాదించుట సులభమైన పనియే గాని అట్లుగా కలసిన స్నేహమును చెడకుండా కాపాడుటయే బలీయమైన కష్టము గదా. మనస్సు చంచలమగుటచే స్వల్పమున కైనను ప్రేమ తగ్గిపోవును. రాముడు నాకు చేసిన మేలునకు ప్రతిగా నేనేమి చేయదగును? నా మనస్సునందు దానిని తలచినచో యేమో భయము కలుగుచున్నది. ఏది చేయదగిన కార్యము అని చెప్పుచున్న సుగ్రీవుని జూచి..

## హనుమంతుడు సుగ్రీవునకు హితముపదేశించుట

హనుమంతుడిట్లనెను. సుగ్రీవా! నీవా ఘనులు చేసిన మేలును మరువకుండుట వింత యగునా? ఆ రాఘవేంద్రుడు వీరులలో శ్రేష్ఠుడు. ఇంద్రునితో సమానమైన పరాక్రమముగల వాలిని నీకు ప్రీతిని గలిగించుటకై కదా భయములేక సంహరించెను? ప్రణయ కోపమును పొందిన వాడై పార్థివుడు ఘనమైన బలము గల లక్ష్మణుని తన సోదరుని పంపెను. నీవు మత్తుడవై

వినోదములతో నుండి కాలము పోవుట నెఱుగలేవైతివని అతడు నిన్ను హెచ్చరించుటకు వచ్చెను. కర్పూరపుటరటిపువ్వులు విచ్చెను. ఆకాశమున గ్రహ నక్షత్రములు నిర్మలములైనిండియుండెను. మేఘములు విరిసిపోయెను. దిక్కు లందును, కొలకులందును, నదులందును స్వచ్ఛమైన కాంతులు వ్యాపించెను. జైత్రయాత్రలకిది తగిన సమయము గాన వారలను నీవు చూడ బోకుండుటచే వారు నిన్ను మిత్రునిగా దలచిరి. వానరేంద్రా! అది నిమిత్తముగా ఇచ్చటికి సౌమిత్రి వచ్చెను సుమా. భార్య అపహరింప బడిన వాడును, దుఃఖము చేత ఆర్తిని పొందిన వాడును, గొప్పమహాత్మునుడునైన రాముడు పంపగా వచ్చిన అతని తమ్ముడు అతి పరుషపు మాటలాడినను వానిని నీవు హితములుగానెంచి సహింప దగును సుమా. కపీశ్వరా! నీవు వారి యెడ అపకారము చేసినవాడవు. దోషములను హరించుటయందు శక్తి గల దింకేదియును లేదు. ఇక నీవిప్పుడు చేతులు జోడించి సౌమిత్రికి నమస్కరింపుము. రాజుచే నియోగింప బడిన వారై రాజు మేలును గోరునట్టి మంత్రులు విడువక హితమును చెప్పుట తగునుగాన భయము వీడి నేను ఉన్నవిధము తెల్పితిని సుమా. రాముడు కోపించి గొప్ప వింటిని చేత పట్టినచో దేవతలు రాక్షసులు మున్నగువారితో గూడిన ఈ జగము నంతను తన వశమయి యుండునట్లు చేయగలడు. పూర్వము చేసిన యుపకారమును తలంచుచు ఆలస్యము చేయక తిరిగి మేలు చేయ బూనుకొని నీవా మృదుస్వభావుని వేడు కొనినచో అతడు మరల నీపై ఎట్లు కోపింపనేర్చును? పుత్రమిత్ర సహితముగా బయలుదేరుము. అతని యొద్దకు వెళ్ళి చేతులు జోడించి నమస్కరింపుము. భార్య భర్తకు వశమై నిలుచునట్లుగా వానరరాజా ! నీవు నీ బాస తప్పక అతనికి వశుడవై నిలువుము. ఆలోచనమేల ? నా మాటలు నీవు హితములుగా నెంచుము. రామలక్ష్మణుల యాజ్ఞను మీరి నడచుటకు మనస్సునందైనను తలపెట్టకుము. ఓ వానరరాజా ! ఇంద్రసమానుడైన, అనుజయుతుడైన రాముని యొక్క స్వాభావికమైన మానుష బలము నీ మనస్సునకు తెలియును గదా.

# ముప్పది మూడవ సర్గము

## లక్ష్మణుడంగదునితో సుగ్రీవునంతఃపురంబు జొచ్చుట

అచ్చట అంగదునిచేత ఆహ్వానింపబడినవాడై లక్ష్మణుడు వెళ్ళుచుండగా గుహ మధ్యమందున్న గొప్ప విక్రమవంతులగు ద్వారపాలకులు లేచి చేతులు జోడించి నిలబడిరి, గాని కోపముతో రొప్పుచున్న రాజపుత్రుని భయావశమున ఒక్కడును దగ్గర జేరడయ్యెను. రత్నమాయమై, దివ్యమై, పుష్పములతో గూడిన తోటలు గలదై, మేడలతో, మిద్దెలతో నిండియున్నదై, సకల విధముల ఫలములు, పుష్పములుగల వృక్షములు గలదై దేవతలు, యక్షులు, గంధర్వులు మొదలగు వారిపుత్రులైన వానరులచే దివ్యమాల్యాదికములు ధరించిన వారలచే ప్రకాశించుచున్నదై, చందనము, అగరు, పద్మములు, తుమ్మెదలు మొదలగు వానిచేతను, మద్యముల చేతను, తేనెల చేతను, సువాసితమైన గొప్ప మార్గములతో చిన్న చిన్న సెలయేళ్ళతో నొప్పుచున్న ఆ పట్టణమును సౌమిత్రి చూచెను. అంగదుని సౌధమును, మైంధుని గృహమును, గాజుడు, ద్వివిదుడు, గవాక్షుడను వారి ఇండ్లను, గవాయుడు, శరభుడు, విద్యున్మాలి, సంపాతి, సూర్యాక్షుడు, వాయుపుత్రుడు నను వారల గృహములను, వీరబాహుడు, సుబాహుడు, తారుడు, సుషేణుడు, నలుడు, నీలుడు, కుముదుడు ననువారి నివాసములను, జాంబవంతుడి సౌధమును, దధివక్త్రుని సదనమును, సునేత్రుని నివాసమును, మఱియు సుపాటలుడు నివసించు మందిరమును, తెల్లని మేఘములవలె ప్రకాశించుచున్నవియు, ధాన్యములతో, ధనములతో, స్త్రీలతో నిండినవియు, నగువాటిని దారియందు అతివేగముగా రోషముతో గూడిన

మనస్సుతో నడచుచున్న లక్ష్మణుడు చూచుచు వెళ్ళెను. తెల్లని మామిడిచెట్లతో నిండినదియు, ఎటువంటి వారికైనను చేరరానిదియు, మనోహరమైనదియు, ఇంద్రభవనముతో సమానమైనదియు, కాంతియందు, గౌరిభర్తయైన శివుడుండు కైలాసమునకు సమానమైనదియు, కోరికలన్నిటిని దీర్చు ఫలములుగల వృక్షములతో గూడినదియు, ఇంద్రునిచే నొసగబడిన దివ్యవృక్షములచే కల్పింప బడిన సర్వసౌఖ్యములు గలదియు, దివ్యమైన ప్రకాశము గలదియు, దివ్యములగు పూలదండలతోడను, దేదీప్యమానములగు బంగారు తోరణములతోడను, ప్రకాశించుచున్నదియు, ఆయుధహస్తులగు వీరులచే రక్షింపబడుచున్న ద్వారములు గలదియు నయిన సూర్యపుత్రుని మందిర ప్రదేశమును వేగముగా చూచుచు బలవంతుడైన లక్ష్మణుడు అడ్డు లేకుండా సౌధమును ప్రవేశించి సూర్యుడాకాశమున ప్రవేశించు విధముగా ఏడు ద్వారములను దాటివెళ్ళుచు, ఆ మంచి మనస్సుగల లక్ష్మణుడు బంగారు, వెండి పర్యంకములతోడను, అందమైన, శ్రేష్ఠములైన ఆసనములతోడను, పరుపుల తోడను, రమ్యమైన అంతఃపురము ప్రవేశించి, యవ్వనముచేతను, రూపముచేతను గర్వించియున్న స్త్రీలను జూచెను. గీతమునకుదగిన పదములును, అక్షరములును గలదియు, స్వచ్ఛమై మనోహరమైన స్వరము గలదియు, అగు వీణానాదమును, అందమైన ఆభరణములచే అలంకరింపబడిన మనోహారిణులగు, శ్రేష్ఠకాంతలను లక్ష్మణుడు వినెను, కనెను. తృప్తినందనివారును, భూషణములు, లేపనములు లేని శరీరముగలవారును, అందమైన వస్త్రములచేతను, మాలికలచేతను, ప్రకాశింపని వక్షములు గలవారును, ఆ వానరరాజు సేవకులందులేరు. మనోహరములైన మణులచే నిండిన అందెల సవ్వడులును, వడ్డాణముల చప్పుళ్ళును, విని రాజపుత్రుడు సౌధమునందు సిగ్గునొందిన మనస్సుగల వాడయ్యెను. ఆ ధ్వనులనువిని కోపమునొందినవాడై అన్ని దిక్కులు నిండునట్లుగా తన వింటి నారిని మ్రోగించి వేగముగా నడచి రామునియొక్క తాపముచే బాధనొందినవాడై

స్త్రీలు లేనట్టి చోటునకువెళ్ళి నిలిచెను. ఆ వింటి నారియొక్క మ్రోతను విన్నవాడై వానరరాజు బంగారు ఆసనమున గడగడ వణకెను. లక్ష్మణుడు వచ్చెనురా యను భయమున మునిగి ముఖమంతయు వెలవెలపారెను.

## లక్ష్మణుని సమాధాన పరుచుటకు సుగ్రీవుడు తారని పంపుట

తారాపుత్రుడట్లు వచ్చి తన్ను పిలువగా, దగ్గరలోనున్న తారాదేవిని జూచి సూర్యపుత్రుడిట్లనెను. ఓ పద్మదళాక్షీ ! శ్రీరాముని సహోదరుడైన లక్ష్మణు డెప్పుడును మృదువైన చిత్తముగలవాడు. ఇప్పుడు గొప్పకోపముతో గూడినవాడై ఇచ్చటకు వచ్చుటకు ఏమి హేతువో గదా. కారణము లేకుండా సాధువైన పురుషశ్రేష్ఠుడు కోపమును బూనడు. ఓ బుద్ధిమంతురాలా ! ఏ నేరము చేసితిమో తెలిసికొని నాకు తెలియజెప్పుము. కాదేని ఓ విశాలసునేత్రా ! నీవే వేగముగా వెళ్ళి రాజపుత్రుని జూచి గొప్పనైన ఓదార్పు మాటలతో, అతనిని శాంతింపజేసి అనుగ్రహమును పొందుము. తారా ! పవిత్రమైన మనస్సు గల సౌమిత్రి నిన్ను జూచి కోపగింప దలంపడు. శాంతిని బొందును. మహాత్ములైన వారలెప్పుడును స్త్రీలయెడల దారుణములు చేయరుగదా. ముందుగా నీవు వెళ్ళి యోదార్పు మాటలచే అతనిని ప్రసన్న చిత్తునిగాజేయుము. ఓ మృగాక్షీ వెనుక నేను తెల్లని పద్మముల వంటి కన్నులుగలవానిని దర్శించుటకు వచ్చెదనని చెప్పగా

## తార లక్ష్మణునితో సంభాషించుట

మత్తుచే చలించుచున్న కన్నులుగలదియగు తార అడుగులోనడుగు పెట్టుచూ వ్రేలాడుచున్న రత్నపుమొలనూలు గలదియై, వంగిన శరీరము గలదియై సౌమిత్రిని సమీపింపనేగెను. అట్లు వచ్చుచున్న ఆ వానరరాజకాంతను జూచి మహాత్ముడైన ఆ లక్ష్మణుడు వంచిన ముఖము గలవాడై స్త్రీ జనము సమీపించుటచే తన కోపము తగ్గగా ఉదాసీనునివలెనుండెను. మధుపానము చేసియుండుటచే సిగ్గువిడిచినదై రాజపుత్రుని దృష్టి ప్రసన్నమగుటచే చనువుగలదై గొప్ప అర్థమును,

స్వాంతనపూర్వకములైన మాటలతో తార ఇట్లు చెప్పెను. ఓ రాజపుత్రా ! కోపగించుకొనుటకు కారణమేమి ? మీ యాజ్ఞను క్రొవ్వినవాడై ఎవడిచ్చట చేయకున్నవాడు ? శంకలేకుండగా ఎండిన చెట్లుగల అడవిని తగులబెట్టు అగ్నిజ్వాల లందు మిడుతలవలే దూకుటకెవ్వడయ్యా ఆశించువాడు ? అని ఇట్లు చంచలమైన నేత్రములుగల తార నెమ్మదైన మాటలతో, తన్ను ప్రశ్నింపగా రాముని తమ్ముడును ప్రేమపూర్వకముగా తారతో నిట్లనెను.

**లక్ష్మణుడు తారతో సుగ్రీవుడు సమయము మించబెట్టుటను చెప్పుట**

భర్తకు హితవు చేకూర్చే దానా! ఏమి నీవు మనస్సునందెంతమాత్రము ఆలోచించవా ? కామోద్రేకముచే అర్థ, ధర్మ విధులగు పెద్దలను చూడకున్నాడు. రాజ్యపాలనను కూడా సరిగా చేయకున్నాడు. గొప్ప వ్యథలోనున్న మమ్ములను లెక్క చేయకున్నాడు. నీ భర్త మంత్రులతో గూడి మధుపానమును ఎల్లప్పుడు సేవించుచున్నాడు. తారా! నాలుగు నెలలు గడువు పెట్టినవాడై యుండియు నీ మగడు మధువుని లెస్సగా త్రావుచు వినోదములలో తేలుచు గడుపు కాలము తీరిపోవుటను ఎఱుంగడాయెను. గోలా ! నీవైనను తెలియజేయరాదా ? మానినీ! ధర్మార్థ సిద్ధులను మనస్సునందు తెలిసియున్న సుమతులు మదిరాపానమును మెచ్చుకొనరు సుమా! మదిరను త్రావుటచే ధనమును కోల్పోవుదురు. ఆ పానమే ధర్మకామములకును భంగము కల్గించును. ఉపకారము చేసినవారికి ప్రత్యుపకారము చేయనిచో ధర్మలోపము కలుగును. సుగుణములు గలిగిన మిత్రులు దూరమగుటచే అర్థము నశించును. కామము చెడును. చపలాక్షీ! అర్థకామముల కంటే శ్రేష్ఠుడును, నిర్మలమైన నడవడి గలవాడును, సత్యధర్మములను విడువనివాడును, అగు స్నేహితుని విడిచి నీభర్త ధర్మమునకు హాని కలిగించెను. తక్కిన రెండింటినీ (అర్థకామములను)వదలుకొనెను. తారా! ఓ కార్యతత్వము తెలిసినదాన ! వానరరాజిట్టి కార్యము గావించినాడు. గాన నీవు చక్కగా యోచించి యికనిప్పుడు మేము చేయదగిన కార్యమెట్టిదో నీవే

చెప్పుము. అనగా అతని యొక్క ధర్మార్థయుక్తమైనట్టియు సాటిలేని మధుర స్వభావము గలట్టియు పలుకును తారవిని, వారల పనిని తెలిసికొన్నదై రామ కార్యాసక్తుడైయున్న అతనితో నిట్లనెను.

## తార లక్ష్మణుని సమాధానపరచుట

దాశరథీ ! కోపమునుపసంహరింపుము. ఇది కోపగించుకొనదగిన కాలము గాదు సుమా. అనుకూలురైన ఆత్మ బంధువులమీద కోపము చేయదగునా ? మీ పనియందు శ్రద్ధగలిగిన, నిర్మలమైన మనస్సుగల వానియొక్క పొరపాటును ఓ శత్రువీరసంతాపనా ! నీవంటివాడు క్షమింపదగదా ? బలవంతుడైన మంచి వాడు బలహీనులమీద కోపపడునా ? కుమారా ! భూమియందు శాంతమునకు, సత్త్వమునకు నిలయమైన నీ బోటివాడు అక్కటా ! కోపగింపదగునా ? రాముని కోపము నెరుగుదును. కాలమతిక్రమించుటెరుగుదును. మీరు చేసిన మేలును గూడా నేనెరుగుదును. తరువాత మేము చేయవలసియున్న కార్యమునెరుగుదును. నేను సర్వమును మనస్సునం దెరుగుదును. కామబలముచే మనస్సునందు వికారము నాపరాదనియు నెరుగుదును. సుగ్రీవుడు పద్మాక్షులతో గామశక్తుడై యుండుటను నేనెరుగుదును. ఆగ్రహమునకు వశమైనట్లు, నీ బుద్ధి కామ తంత్రములకు వశముగాదు నాయనా! కామరక్తుడైన మనుష్యుడు దేశ కాలములను, అర్థ, ధర్మములను చూడగలడటయ్యా ? ధీరహృదయా ! నన్ను కలిసియుండి కామముచే అతడు సిగ్గులేనివాడయ్యెను. ఓ పురుషశ్రేష్ఠా ! నీ తమ్మునివంటివాడగు వానరరాజును, అనఘా ! దయాగుణములు గలవాడా! క్షమింపుమయ్యా ! పాప రహితులు, తపస్సునందాసక్తి గలవారు, నిర్మలమైన ధర్మ, కర్మలాచరించువారు నయిన మహర్షులే కామతంత్రములందు ప్రవేశించి, అధికమైన మోహమునకు వశులైరనగా అతిచపల స్వభావముగలిగిన క్రోతి, అహో గొప్ప సౌఖ్యములందు చిక్కియుండుట చిత్రమా ! దయాగుణమే భూషణముగా గల సౌమిత్రీ ! నీవే చెప్పుము అని గొప్ప అర్థము గలిగిన మాట

లను చెప్పి, స్త్రీలలో రత్నమువంటిదగు ఆ తార మత్తుచే కూడినదై తన భర్తకు మేలు కలుగు విధముగా లక్ష్మణునితో మరలా నిట్లనెను. ఓ రాజపుత్రా ! నీ కార్యము నెరవేర్చుటకు వానరరాజు మన్మథవసుడైయుండియు, ఇదివరకే ప్రయత్నము చేసియుండెను. కోపింపనేల ? బలముగలవారలను, కామరూపు లును కోటానుకోట్లగా పలువురు పర్వతవాసులు, సముద్రనివాసులు నగు వానరులు, కార్యసాధనశక్తి గలవారలిదిగో వీరే వచ్చియున్నారు. అంతఃపురములో పరస్త్రీలుందరు చూచిన దోషము కలుగునని తలంచి నీవిచ్చట నిల్చితివి. ఓ గొప్ప గుణములు గలవాడా ! ఇక చాలును. ఎంతో గొప్పగా నీ నడవడిని రక్షించుకుంటివి. రమ్ము. వినుము. మంచి మనస్సుగలవారు మైత్రితో తమ మిత్రుల యొక్క భార్యలను జూచుట దోషమా ? అనగా ..

**లక్ష్మణుడు సుగ్రీవుని జూచి నిష్ఠురము లాడుట**

దేవసమానుడగు లక్ష్మణుడు తనను తారాదేవి పిల్చుటచేతను, కార్యము యొక్క తొందరపాటు చేతను, వెళ్ళి దివ్యములైన గొప్పఆభరణములచే ప్రకాశించు చున్నవాడును, దేవేంద్రునివంటివాడును, జయింపశక్యము గానివాడును, దివ్యమైన వస్త్రములను, పుష్పములను దాల్చినవాడును, దివ్యమైన రూపము గలవాడును, స్త్రీలచే చుట్టబడియున్నవాడును, కీర్తిగలవాడును, మృదువైన శయ్యయందున్నవాడును అగు సుగ్రీవుని జూచెను. అట్లు చూచి కోపముతో కన్నులెఱ్ఱబడగా ప్రళయకాలయమునివలె నుండగా, రుమతో గలిసియున్న సూర్యపుత్రుడు విశాలనేత్రుడగు దశరథపుత్రుని జూచెను.



# ముప్పది నాలుగవ సర్గము

**మొ**క్కవోని తేజస్సు గలవాడును, ఆగ్రహముచే ఆవేశింపబడిన వాడును, సమీపమునకు వచ్చినవాడును, పురుషశ్రేష్ఠుడును, రోషముతోనున్నవాడును, నిట్టూర్పులు విడుచున్నవాడును, అగ్నివలె ప్రకాశించుచున్నవాడును, అగ్రజుని శోకముచే తపించుచున్నవాడును, బలవంతులలోశ్రేష్ఠుడును, అగు అతనిని జూచి ఇంద్రియములు పట్టుతప్పినవాడై బాగుగా అలంకరింపబడిన ఇంద్రధ్వజము వలె బంగారు ఆసనము మీద నుండి నేలమీద దుముకగా చంద్రునివెంట వెళ్ళెడు నక్షత్రముల వలె రుమయును, తక్కిన స్త్రీలును, ఒక్క మాటుగా పీఠముల నుండి ఉరికి దిగిరి. అంతట చేతులు జోడించి వణుకుచు వానరరాజు కల్పవృక్షము వలె నిలబడెను. నక్షత్రములతో గూడిన చంద్రునివలె స్త్రీ సమూహము చుట్టూ నున్నవాడును, రుమతో గూడియున్నవాడును యగు సుగ్రీవుని జూచి క్రూరమైన ఆగ్రహముతో గూడిన మాటలతో మానవసింహుడైన సౌమిత్రి యిట్లనెను. సత్యము పల్కువాడును, చేసిన మేలు మరువనివాడును, ఇంద్రియములను జయించినవాడును, అధికమైన దయగలవాడును, సత్వము, సద్వంశము గలవాడును అయిన రాజే సుమా లోకమున నెందైనను పూజింప బడువాడు. మేలు చేసిన వానికి తిరిగి మేలు చేయుదునని ప్రతిజ్ఞచేసి అట్లు చేయక, ధర్మమును హేళన చేయు బాలిశుని కంటెను పాపాత్ముడెవ్వడో చెప్పవయ్యా సుగ్రీవా! ఒక గుఱ్ఱము విషయమున నబద్ధమాడినచో నూఱు గుఱ్ఱములను జంపిన పాపము కలుగును. ఒక ఆవు విషయమున నసత్యము చెప్పినచో వేయి ఆవులను చంపిన పాపమగును. ధర్మము దప్పి ఒక మనుష్యుని విషయమున నసత్యమాడినచో తప్పక తనను, తన ఆత్మీయవర్గమును

మొదలంటగా చంపినవాడగును. మునుపు తనకు మేలుచేసిన తన హితులైన వారికి తిరిగి మేలు చేయదలంపని నీచుడు కృతఘ్నుడు, వినుము. భూతజాలములకెల్లను చంపదగినవాడు సుమా. వినుము కృతఘ్నుని జూచి పూర్వము కోపముతో భూజనవందితుడైన బ్రహ్మ పైవిధముగా జెప్పెను. ఓ వానరరాజా! మనస్సునందిప్పటి కైనను ధర్మపద్ధతిని తెలిసికొనుము. బ్రాహ్మణుని చంపినను, కల్లు తాగినను, దొంగతనము చేసినను, మంచి వ్రతములనుండి విడిపోయినను దానికి ప్రాయశ్చిత్తమున్నది. గాని భూమియందు కృతఘ్నున కెందును నిష్కృతి లేదు సుమా. ముందుగా రామునిచే కృతార్థుడవై, తిరిగి మేలుచేయకపోవుటచే నీవు కుటిలుడవు, మఱియు కృతఘ్నుడవును. మానహీనుడా ! నీవనార్యుడవును, అబద్ధమాడు వాడవు నయితివి గదా. వానరేంద్రా ! నీవే జెప్పుము. ఆరాఘవునిచే కృతార్థుడవై, దానికి తప్పక ప్రత్యుపకారము చేయవలెనని మనస్సునందు తలచినచో, సీతను వెదకుటకై వెంటనే ప్రారంభించవేల? స్త్రీ లోలుడవైన నిన్ను అబద్ధమాడువానివని, కప్పవలె అరచు పామువని అక్కటా! రాముడు తెలిసికొనలేకపోయెనే ! బలము కోల్పోయి దీనమైన మాటలతో ఏడ్చుచున్న నిన్ను చూచి జాలితో, అయ్యోపాపమని మనస్సునందు తలంచి, ఓ పాపాత్ముడా ! దుర్మార్గుడా ! నీకు రాజ్యమును సంక్రమింపజేసెను. రఘువంశమున బుట్టిన ఆ మహాత్ముడు చేసిన మేలును నీవు తలంపకుందువేని నిన్నిప్పుడే ఆగ్రహముతో వాలిని చేరునట్లు పంపించును సుమా. కల్మషముగల మనస్సు గలవాడా ! ఆ వాలి వెళ్ళిన మార్గము మూతపడి యుండలేదు సుమా. కాన నీవు చేసిన ప్రతిన తలంపుము. సత్యమును అవలంబింపుము. నీవు కూడ నీ అన్న వెళ్ళిన మార్గమున వెళ్ళ దలంపకుము. వజ్రము బోలిన రాఘవుని వింటి నుండి వెడలిన వాడిబాణములను, ఓ అవివేకీ! నీవు చూడలేకపోవుటచేత సంపదలను మరగినవాడవై రాముని పనిని దలంపవైతివి పో.

# ముప్పది యైదవ సర్గము

## తార లక్ష్మణుని శాంతిపఱచుట

అని కొఱవితో గాల్చినట్లు ఘనమైన కోపముతో చెప్పుచున్న సౌమిత్రి మాటలను విని, అతనిని జూచి తారాదేవి ఓదార్పు మాటలతో ఇట్లు పలికెను. లక్ష్మణా ! ఇట్లు మాటాడుట నీకు తగిన పని కాదు సుమా. వానరరాజీ కఠినమైన మాటలు వినదగినవారు కాదు సుమా. మఱియు వెచ్చినకోపముచే నీదు వాక్కు నుండి వచ్చినట్లుగా అతడు అకృతజ్ఞుడు గాడు. క్రూరుడును, కుటిలుడును గాడు, నీచుడును, అసత్యవాదియును గాడు. ఓ గొప్ప బలముగలవాడా ! ఇతరులకు సాధ్యముగాని గొప్ప యుద్ధమునందు రామచంద్రుని ప్రసాదముచే స్థిరమైన వానర రాజ్యమును, అందమైన సుఖములను, రుమాదేవిని, సంపదలను, నన్నును పొందినవాడు, మీరు చేసిన సాయమును మరచి పోకుండగా ఎప్పుడును మిమ్ముల నతిగా మెచ్చుకొనుచుండును. విపరీతమైన దుఃఖముల ననుభవించి పిదప మీ దయవలన అధికమైన సుఖములనిప్పుడు పొంది విశ్వామిత్రునివలె గడువు దాటిపోవుటకు తెలియుజాలకున్నాడీ వానరరాజు. ఓ అనఘా ! ఇది వాస్తవము సుమా. మున్ను ధర్మాత్ముడు విశ్వామిత్రుడు కామవశుడై ఘృతాచియను కాంతకు చిక్కి పదియేండ్లు గడవగా తన మనస్సునందొక్క దినమని తలంపలేదా ? భయంకరమైన తపస్సు చేసిన విశ్వామిత్రునంతటివాడే మన్మథునకు వసుడై నియమపు సమయమెరుగడాయెనే! రామానుజా ! ఇక ప్రాకృతజనులను గూర్చి యేమి చెప్పవలెను ? రాజపుత్రా! దేహధర్మమగునది విడువాడై తనివి తీరక కాలము దాటుట నెఱుంగడయ్యెను. సజ్జనులచే నుతింపబడిన శీలము గలవాడా ! ఈ దోషమును క్షమింపుము నాయనా! నిజము తెలిసికొనలేక జడుని వలె నీవు కోపమును పొందదగునా? ఇంకను చెప్పెదను వినుము. నిన్ను బోలిన సత్వము గలవారలు, మనమునందు

చక్కగా విమర్శించుట మాని చప్పున కోపమునకు వశపడుదురా ? ధర్మజ్ఞులలో శ్రేష్ఠుడా ! సూర్యపుత్రునియందు కినుకను మానుము. అధికమైన దయగలవాడా! ఇతడు నన్నుగాని, రుమను గాని ధనములను, ధాన్యములను, బంగారమును గాని, తనయొక్క వానరరాజ్యమును గాని రాముని పనికై విడుచునని తలంచెదను.

## సుగ్రీవుడు కపి సేనలను రప్పించిన వార్త తార లక్ష్మణునకు చెప్పుట

యుద్ధరంగమున రావణాసురుని చంపి రోహిణితో చంద్రునివలె సుగ్రీవుడు జానకితో రాముని గూర్చును. ఇంతటి సందేహము నీకేల? చెప్పుము. నూఱు వేలకోట్లును, నూఱువేల ముప్పదియాఱయుతములును (అయుతము = పదివేలు) రాక్షస శ్రేష్ఠులు లంకలో గలరు. యుద్ధమునందు వారందరిని చంపకుండగా, రావణుని జంప వీలుకాదు సుమా. సహాయము లేకుండ అమితమైన బలముగల రావణుడు ఒక్క సూర్యపుత్రునిచే నెట్లు చచ్చును ? అని పూర్వము యదార్థమెరిగిన వాలి చెప్పెను. దాని నిప్పుడు నేను చెప్పుచున్నాను. మీకు యుద్ధమున సహాయము చేయుటకుగాను వానర సమూహము లిచ్చటికి వచ్చునట్లు ఈ వానరరాజు మునుపే ఆజ్ఞనిచ్చియున్నాడు. ఆగడువు కూడ నేడే మీరిపోవుచున్నది. ఓ ధీరశ్రేష్ఠుడా ! వారలనందఱను వెంట తీసికొని శ్రీరాముని కార్యమును సిద్ధము చేయుటకై తాను రాదలంచి, కపినాయకుడు అచ్చటికి బయలుదేరలేదు సుమా. వందలకొలది కొండముచ్చులును, గొప్ప పరాక్రమముగల యెలుగుబంట్లును, కోట్లకొలదిగా వానరులును ఇప్పుడే వచ్చి నిన్ను భక్తితో సేవించెదరయ్యా ! ఓ పురుషశ్రేష్ఠుడా ! కోపమును విడువుము. నీయొక్క ముఖము తీరును, ప్రజ్వరిల్లుచున్న అగ్ని విధముగానున్న నీ నేత్రములును చూచి, ఈ వానరరాజును, అతని కాంతలందఱును, విడువని భయముతో ప్రాన్పడియున్నారు. మాకునూ మునుపటి భయమే కలుగుచున్నది. సుగ్రీవునియందు విశ్వాసము నుంచుము. ప్రీతితో అతని భయముని దీర్పుము.

# ముప్పది యాఱవ సర్గము

## సుగ్రీవుడు లక్ష్మణుని సమాధానపరచుట

అని చెప్పుచుండగా మృదు స్వభావుడును, రఘువంశమునకు భూషణము వంటి వాడును అయిన లక్ష్మణుడు ఆ తార చెప్పిన ధర్మమైన మాటలను విని దారుణమైన కోపమును విడచెను. సూర్యపుత్రుడును మలిన వస్త్రమును విడిచినట్లుగా ఆ రాజపుత్రుని వలని భయమును విడిచినవాడై బంగారుతో చేయబడిన చిత్రమైన మాలలను తీసివేసి, మట్టును విడిచినవాడై వినయమున నిట్లనెను. లక్ష్మణా ! మునుపు పోయిన వానరరాజ్యమును, శ్రీయును, కీర్తియును రామునిదయ చేతనే తిరిగి నాకు లభించెను. జనులచే కీర్తింపబడినవాడా! ఇది నిజము సుమా. అంతటి శౌర్యముగలవానికి, అంతటి ఘనకార్యములచే దిక్కుల నాక్రమించిన కీర్తి గలవానికి నెవడు ప్రత్యుపకారము చేయగలవాడు? రామచంద్రుడు సీతను పొందును. క్రొవ్విన ఆ రావణుని సంహరించును. కొంచమైనను సందేహము లేదు. ఐననూ నేను సహాయమాత్రుడనయ్యెదను. ఏడు చెట్లను, భూమిని, పర్వతమును ఒక బాణము చేతనే ఛేదించిన గొప్ప బలవంతునకు వేరే సాయమెందులకయ్యా! తాను గట్టిగా వింటినారిని మ్రోగించినచో ఆ టంకారమునకు పర్వత సహితముగా భూమి యంతయు బింకము గోల్పోయి వడకును గదా. అట్టి శౌర్యముగల గొప్ప వానికి ఇంకొక్కడు సాయపడనేల ? చెప్పుము. వైరియైన రావణాసురుని గొప్ప సైన్య సమూహము లతో సంహరించుటకై వెళ్లుచున్న ఆ శ్రీరాముని వెంబడి రాజపుత్రా! ఇదిగో వచ్చుటకై సిద్ధముగా నున్నాను గదా. ప్రేమకారణముననను విశ్వాసము చేతను

ఈ మీయొక్క దాసుడు ఒకవేళ యించుకంత తప్పి నడిచినచో క్షమింపదగిన వాడగును. ఒక్కడైన అపరాధి కానివాడుండునా ?

**లక్ష్మణుడు సుగ్రీవుని ప్రశంసించుట**

అని చెప్పుచున్న మహాత్ముడైన సుగ్రీవుని జూచి లక్ష్మణుడు ప్రీతితో నిట్లనెను. అనఘా! వినయవంతుడవగు నీవు దిక్కగుటచే మాయన్న సనాథుడయ్యెను. నీయొక్క పరిశుద్ధమైన మనస్సును, నీ శౌర్యమును, నీ ఋజు స్వభావమును, నీ ప్రభావమును ఇన్నింటిని జూడగా అందమైన ఈ వానర రాజ్యలక్ష్మిని భోగించుటకు నీవే అర్హుడవు. వానరరాజా ! నీ సహాయముచే రాక్షస సమూహమునకధిపతియయిన రావణుని రామవిభుడు చంపును. ధర్మగుణము కలవాడా! కృతజ్ఞుడా! జయశీలుడా! మిత్రమా ! నీ వాక్యములు యుక్తముగా నున్నవి. గొప్ప సమర్థత కలిగియును తన యొక్క దోషమును గుర్తించి యెవడు దానిని వినయముతో చెప్పునయ్యా ? మా అన్నయు, నీవును మీయిద్దఱు తప్ప సూర్యతనయా! ఇట్లు చేయగలవారెవ్వరునుండరు సుమా. నీవు శౌర్య పరాక్రమసాహసంబులందు రామభద్రునితో సమానమైనవాడవు. దైవఘటనచేత మీయిద్దఱకును నిక్కమైన మైత్రి యేర్పడెను. లెమ్ము పోవుదము. భార్యావియోగ వ్యథచే కుంగుచున్న రామునోదార్పుము. వానరరాజా! మనసు చెడియున్న ఆ రాముని మాటలు విని కోపగించిన వాడనై నిన్ను దూరితిని క్షమింపుము అని లక్ష్మణుడు చెప్పగా.



# ముప్పది యేడవ సర్గము

## సుగ్రీవుడు హనుమంతునితో వానరుల నిమిత్తమై మరల దూతలను బంపుమని చెప్పుట

అప్పుడు సూర్యపుత్రుడు తనచెంతనున్న హనుమంతునితో నిట్లుపల్కెను. హిమవత్పర్వతమునందును, మహేంద్రగిరియందును, వింధ్యయందును, కైలాసమందర శయలములందును, ఉదయించుచున్న సూర్యుని వర్ణముతో, ప్రకాశించు సముద్రుల యొడ్డుననున్న పర్వతములయందును, పడమటి పర్వతములయందును, సంధ్యాకాలపు మేఘమువలెనొప్పు ఉదయాద్రియందును, సంచరించెడి వానరులను పద్మవనమందు, తాళవనమందు నున్న ప్లవగ శ్రేష్ఠులను, కాటుకమేఘములవలెను, ఏనుగులవలెనుయున్న, అంజనపర్వత మందలి వానరశ్రేష్ఠులను, బంగారువర్ణముగలిగి, మనస్సిలానిర్మితగుహలలో నుండు వానరులును, మేరుపర్వతమున, ధూమ్రగిరిని, మహారుణ పర్వతమున మనోహరములగు కాననములందు చరించుచు ఆరెగపూల మద్యము త్రాగుచు వారింపరాని మహావేగము కలవారగు గొప్ప వానర నాయకులను, మున్యాశ్రమ సీమలందును, భూమియందలి సర్వవనములందు నుండెడి భీమబలులైన వానరుల నెల్లను సామదానాద్యుపాయములచే పిలిపింపుము. ఆలస్యము చేయకుము. పూర్వమే వారలను బిలుచుటకై దూతలను బంపియుంటిని. వెంటనే వారిని తొందరచేయుటకై గొప్పవేగము బలము గల వానర గణములను పంపుము. సచివా! కామాసక్తులైన వానరులను సోమరులై ఆలస్యము చేయు

వారిని వెంటనే బయలుదేరునట్లు నా తిరుగులేని యాజ్ఞగా పిలుచుటకై కపులను బంపుము. యేవానరుడైనను నాయీ ఆజ్ఞను చులకన జేసి లక్ష్య పెట్టక పది దినముల లోపల రాకుండునో రాజ శాసనమును దప్పిన అట్టివాని తలను వాయుపుత్రా! తీయించెదను సుమా. నూర్లు, వేలు, కోట్లుగా క్రోతులను వేగముగా ఇప్పుడే నీవు దిక్కుదిక్కులకు పంపుము. మేఘమువలె పర్వతములవలె ఉన్న వానరవీరులు ఆకాశమార్గమంతయును గప్పునట్లుగా ఇప్పుడే వెళ్ళుదురుగాక. స్థానములెరిగిన వానరులను వారుండు చోట్లకు వెళ్ళి పిలుతురుగాక. అని చెప్పగా హనుమంతుడును ఆక్షణమునందే ప్లవగ శ్రేష్ఠుల నన్నిదిక్కులకును పంపెను. వారును పక్షులు సంచరించు ఆకాశమార్గమున అతి వేగముగా వెళ్ళి సముద్రములందు, పర్వతములందు, వనములందు నున్న వానరులకు రామకార్యపు విధమును చెప్పి సుగ్రీవు నాజ్ఞను దెల్పగా వారును వేగముగా..

**వానరసేనలు కిష్కింధకు వచ్చుట**

ప్రళయకాల సమానమైన సుగ్రీవుని యొక్క భయంకరమైన ఆజ్ఞచే వానర శ్రేష్ఠులు రణోత్సాహముతో దిక్కులు పిక్కటిల్లునట్లుగా వేగముగా వచ్చిరి. అంజనాద్రినుండి అంజనసమానులైన మూడుకోట్ల కపీశ్వరులను, అస్తాద్రి నుండి బంగారు వర్ణపు శరీరములు గల పదికోట్ల ప్లవగ నాయకులును, కైలాసము నుండి సింహపుజూలు వంటి రంగుగలవారు, శౌర్య ధనులైన వెయ్యి కోట్లు వానరులును మంచు కొండలందు ఫలములను దుంపలను దినునట్టి క్రోతులు వేల వేల కోట్లును వేగముగా వచ్చిరి. వింధ్యపర్వతము నుండి యొక కోటివేల భయంకరాకారులగు కపులును, పాలసముద్రము తీరమందుండి కొబ్బరికాయ లను భుజించు వారగు అసంఖ్యాక కపులును వచ్చిరి. పర్వతములును, నదులును, పర్వత గుహలును, వనములును నివాసముగా గల కపిసమూహ

మంతయు శ్రీరామ కార్యార్థమై సూర్య మండలమును కప్పునట్లుగా కదిలివచ్చెను. వానరులను పిలుచుటకై వెళ్ళిన వానరులు మహేశ్వరుడు గొప్పనైన యజ్ఞము నెచ్చట చేసేనో ఆ హిమవత్పర్వతమునందలి మహా వృక్షమును గాంచెను. ఆ యజ్ఞమున నుపయోగించిన నేయి పాయసములచే నానిన నేలయందు పుట్టినవియును, మనస్సునకు సంతోషమును కలుగజేయునవియును అయిన కందమూలములను, మంచి ఫలములను, అమృతముతో సమానమైన రుచి గలవానిని, ఎవ్వడైన నొకసారి తిన్నచో నొక నెలవరకు వానికి ఆకలియుండదు. అట్టి ఫలములను, దుంపలను, అందమైన పువ్వులను వానరులు సుగ్రీవునకు ప్రీతి కలుగుటకై తీసికొని భూమియందున్న క్రోతులందరిని రమ్మని చెప్పి వేగముగా ముందే గడవు దాటకుండగా వచ్చి చేరిరి. ఇట్లు వచ్చి కానుకలను వానరరాజు ముందరనుంచి, రాజా ! నీ ఆజ్ఞను పర్వతములందును, వనములందును, సముద్రములందును, నివసించు కపివరులకు విశదముగా తెలియునట్లు తెలియజెప్పితిని. పొందుగా వారును కిష్కింధకు వచ్చిరి, అని చెప్పగా సుగ్రీవుడు మిక్కిలి సంతోషముతో ఆ వనచరుల కానుకలను స్వీకరించి మీ నివాసములకు వెళ్ళుడని సెలవొసంగెను.



# ముప్పది యెనిమిదవ సర్గము

## లక్ష్మణ సుగ్రీవులు సేనతోడ శ్రీరాముని యొద్దకు బోవుట

వారందఱకును సెలవిచ్చి వానరరాజు తానును, రామచంద్రుడును కృతార్థులమైతిమని తలంచెను. అంతట సౌమిత్రి సుగ్రీవుని జూచి ఇక రామచంద్రుని జూచుటకు వెళ్ళుట తగినపనిగదాయని చెప్పగా అతడును అట్లేయగుగాక మీ యాజ్ఞకన్యధాత్వము కలదాయని తార, రుమ మొదలగు స్త్రీలకు సెలవిచ్చి, మీరందరును వేగముగా రండని వానరులనాజ్ఞాపింపగా, స్త్రీలను దర్శింపదగిన వారగు వానరులు వచ్చి చేతులు జోడించి అచ్చట నిలిచియుండగా పల్లకి మోయువారిని నాయొక్క శిబికను తీసికొని రండు, ఆలస్యము చేయరాదని పల్కగా వారునూ అట్లే చేయగా లక్ష్మణా ! ఎక్కుము అని అతడు ముందెక్కగానే, సుగ్రీవుడు తానును తరువాత శిబికనెక్కి ఇరు ప్రక్కలను చక్కని చామరములును, పైని శ్వేతచ్ఛత్రమును అందముగా నొప్పుచుండగా, భేరులు మ్రోగగా, శంఖముల గొప్పదైన ధ్వనులు వ్యాపింపగా, వానరులు చేయుచున్న గర్జనల ధ్వనులు నిండగా, వానర రాజ్యలక్ష్మి వైభవము గలవాడై శూరులును, శస్త్రములు ధరించినవారును చుట్టూ చేరి సేవించు చుండగా వెళ్ళి రామచంద్రుడు ఉన్న చోట దిగి లక్ష్మణునితో గలిసి భక్తితో రాముని దగ్గరగా వెళ్ళి కరపద్మములను ముకుళింపగా, తక్కిన క్రోతులన్నియు రఘురాముని ముందర అట్లే భయభక్తులతో చేతులు జోడించి సంతోషముతో నిలిచియుండగా తామర మొగ్గలతో ప్రకాశించుచున్న తామరకొలను విధముగా క్రొత్తదైన ఆ వానరసైన్యమును జూచి దశరథపుత్రుడు సూర్య పుత్రునియందు దయగలవాడయ్యెను.

## శ్రీరాముడు సుగ్రీవునకు నీతి దెలుపుట

అట్లు తన పాదములందు వ్రాలిన సూర్యపుత్రుని లేవనెత్తి ప్రేమతో కౌగిట జేర్చి కూర్చుండుమని అతడాసీనుడుకాగా, ప్రీతితో రాముడిట్లనెను. వానర నాయకా ! ధర్మమును, అర్ధమును, కామమును తగినవిధముగా విమర్శించి తగిన సమయమును తెలిసికొని వానినాచరించినట్టి ప్రాజ్ఞుడైనవాడు రాజని కీర్తిని పొందువాడగును సుమా. ధర్మమార్గమును విడచి అర్ధమును మగచి ఎల్లప్పుడును కామమునందే ఆసక్తి గలవాడు చెట్టుయొక్క కొనకొమ్మయందు నిద్రజెంది నేలమీదపడి మేలుకొన్నవానిని పోలినవాడు. శత్రువులను సంహరించుచూ మెలకువతో మిత్రులను సంపాదించుకొనుచు భూమియందు ధర్మార్ధకామములనెడు త్రివర్గమును పొందునట్టిరాజు ధర్మపథమున నడచినవా డగును. సూర్యపుత్రా ! ఇది యుద్ధ ప్రయత్నములను చేయుసమయము కాన మంత్రాలోచనము చేయుటకిప్పుడు మంత్రులు మొదలైనవారితో వెంటనే సభను చేయింపుము అని రాముడు చెప్పగా,

## సుగ్రీవుడు శ్రీరామునితో తాను వానరసేనల సిద్ధపరచుటను దెల్పుట

ఆ వానరరాజిట్లనెను, మహాత్మా ! నష్టపోయిన ఐశ్వర్యమును, వానర రాజ్యలక్ష్మిని, ఘనమైన కీర్తిని నీ యొక్కయు, నీ సోదరునియొక్కయు నిజమైన దయతో తిరుగులేకుండ పొందితిని. తిరుగిమేలుచేయనెంచని పురుషు డెవ్వడైనను ఎల్లప్పుడును నిందింపబడువాడగును. రామచంద్రా ! భూమండలము నందున్న కోతులను, కొండముచ్చులను, భల్లూకములను బలవంతులైనవారిని పిలవబంపితిని. దేవగంధర్వపుత్రులను, భయంకరముగా గన్పించు వారలును, కామరూపులును, అడవిమార్గములను బాగుగా దెలిసినవారును, తమతమ సేనలతో నూఱులు, నూఱువేలు, నూఱులక్షలు మరియు అయుత సంఖ్యలు,

శంకులు అర్బుదములును, ఖర్వసంఖ్యులు, మధ్యసంఖ్యులు, అంతసంఖ్యులు, సాగరసంఖ్యులు, పరార్ధసంఖ్యులునుగా, ఇంద్రునివంటి పరాక్రమముగల వారును, మేరుపర్వతము, మందరపర్వతమువంటి ఆకారము గలవారును, వింధ్య పర్వతనివాసులును అగు వానరేంద్రులు వచ్చుచున్నారు. దుష్టుడగు ఆ రావణుని, బంధుసహితముగా భయంకరమైన యుద్ధమున సంహరించి, నీయొక్క దేవిని, తీసికొని వచ్చి దేవరవారికర్పింపగలరు అని చెప్పగా అతని ప్రయత్న మంతయు దెలిసికొన్నవాడై జోడించినహస్తములుగల అతనిని సంతోషముతో గూర్చి కౌగలించికొని వికసించిన నల్లకలువలవంటి వర్ణము గల్గి దర్శనీయుడగు రాముడు సుగ్రీవునితో నిట్లనెను.



# ముప్పది తొమ్మిదవ సర్గము

## శ్రీరాముడు సుగ్రీవుని ప్రశంసించుట

సూర్యనందనా! సూర్యుడు చీకట్ల నాకాశమునుండి రూపుమాపుటయు, వృత్రవిరోధి (ఇంద్రుడు) వానలచే ప్రజలకు ముదము కలుగజేయుటయు, చంద్రుడు భూమిని చల్లగా చేయుటయును, నీయట్టి వారు మిత్రులకు తిరిగి మేలుజేయుటయు చిత్రమా ? శాంతమే ఆభరణముగా గలవాడా! సూర్యనందనా! నిన్నుబోలిన మిత్రశ్రేష్ఠుడు స్నేహి బృందమునకు మేలు కలుగజేయుట విచిత్రమా? నేనిక యుద్ధమందు నీ సహాయము కారణముగా జయమును పొందినవాడనై ప్రకాశించెదను. మనస్సునందు నీవు సతతప్రియవాదివని నేను లెస్సగా నెఱుంగుదును. సఖా సమ్మతుడనియు, మిత్రులకు మిత్రుడనియు నీవే చెప్పదగుదువు. ప్రఖ్యాతమైన కీర్తి గలవాడా! ఈ సమయమందు నాకు సహాయపడుము. సూర్యనందనా! అనుహ్లాదుడు శచీదేవిని వంచనతో నపహరించినట్లు రావణుడాత్మ వినాశనమునకై నా భార్య నపహరించెను. ఆ పులోముని సంహరించినట్టి యింద్రునివలె నేనునూ ఆ రాక్షసాధముడగు రావణుని వాడి బాణములచే సంహరించెదను అనుచుండగా.

## వానరసేనలు శ్రీరాముని కడకు వచ్చుట

ఇంతలో ఆకాశమంతయు గొప్ప ధూళిచే ఆవరింపబడెను. సూర్యకిరణ సమూహము తేజము నశించి మొక్క వోయినదయ్యెను. దిక్కులన్నియు ధూళిచే తేజస్సు తగ్గినవయ్యెను. పర్వతములు, వనములు, నదులు మొదలగు వానితో

గూడ భూమియంతయు గడగడమని యెక్కువగా వణకజొచ్చెను. పర్వత సమానమును తీక్ష్ణమైన కోఱలు గలదియు, అణపరాని బలముగలదియు లెక్కింప రానిదియునగు వానరసేన ఒక్క నిమిషామాత్రమున భూమియంతయు నిండిపోయినది. పర్వతములు, సముద్రములు, నదులు నివాసముగా గలవారును, కామరూపులును, కఠినమైన శరీరములు గలవారును, మేఘధ్వని గలవారును, అడవులందు చరించువారునగు వానరులు అందుండిరి. ఉదయించుచున్న సూర్యునివంటి వర్ణము గలవారును, చంద్ర కిరణములువలె స్వచ్ఛమైన వారును, పద్మకేసర వర్ణులును అగు కపులు పదివేల కోట్లు తనును సేవించుచుండగా శతవలియను వానరరాజచటకు వచ్చెను. భయంకరమైన రోషము గలవాడును, శత్రువులను నిర్జించు వాడను అయిన తార తండ్రియగు సుషేణుడు సంతోషముతో పదివేల కోట్ల సేన సమస్తము వెంట బెట్టుకొని వచ్చెను. కోటి సహస్రముల క్రోతులతో రుమమతండ్రియగు తారదప్పుడు వచ్చెను. పద్మకేసరములవంటి వర్ణముగలవాడు ఎఱ్ఱని ముఖము గలవాడు, ప్రజ్ఞ గలవాడు, మహావేగవంతుడు నయిన హనుమంతుని తండ్రియగు కేసరి సహస్రములైన సేనలు గొలువగా వేగముగా వచ్చెను. భయంకరులగు శత్రువులను శిక్షించువాడగు గవాక్షుడనువాడు కోటివేల కపులతో సేవింప వచ్చెను. శత్రు మర్ధనుడగు ధూమ్రుడనువాడు రెండు కోట్ల యెలుగుబంట్లు తనను సేవింపగా వచ్చెను. పనసుడనువాడు మూడు కోట్ల ప్లవగశ్రేష్ఠులు తన్ను గొల్వగా సుగ్రీవుని యొద్ద కనిపించెను. కోటి సహస్ర సంఖ్యలైన క్రోతులతో దరీముఖుడును, మూడు కోట్లతో గజుడును, గొప్ప పరాక్రమును గలవారు కోటి కోటి వేల సేనలు తమను సేవింపగా ఆశ్విపుత్రులైన మహా పరాక్రమవంతు లైన మైందుడు, ద్వివిధుడును, పదికోట్ల ఎలుగుబంట్లతో సేవింపబడు జాంబవంతుడును వచ్చిరి. నల్లని కాటుకవంటి దేహముగల నీలుడనువాడు

పదికోట్ల క్రోతులతోనూ, అయిదు కోట్ల వానరులతో గవయుడును నటకు వచ్చి వ్రాలిరి. వింతయయిన బలము గలిగిన శతకోటి వానరులు చెంతలనుండి సేవించుచుండగా శీఘ్రముగా రుమణ్వంతుడు సుగ్రీవునాజ్ఞననుసరించి రామనృపాలుని సేవింప వచ్చెను. నూఱువేల కోట్ల వానరులు తన్ను సేవించు చుండగా గంధమాదనుడు కదలివచ్చెను. అయిదు కోట్ల వానర శ్రేష్ఠులు తన్ను గొలుచుచుండ నక్షత్ర ప్రకాశముగల తారుడు వచ్చెను. తండ్రియయిన వాలివంటి పరాక్రమము గలవాడును, తార పుత్రుడును నగు అంగదుడు, పద్మసహస్రశంకు శతసంఖ్యులైన వానరులు తన్ను సేవించుచుండగా వేగముగా నచ్చటికి వచ్చెను. వీరుడైన ఇంద్రజానుడు పదునొకండు కోట్ల వానర సంచారులతో మహా వేగముతో రాజును సేవింపవచ్చెను. సింహ పరాక్రముడును సూర్యునివంటి తేజస్సు గలవాడును అగు రంభుడు నమ్మదగిన వారును బహు విక్రమ శాలురును అయిన వానరులు లక్షాయుత సంఖ్యులు సేవింపగా కదలివచ్చెను. ఉదయ సూర్యునివంటి తేజము గలవాడగు దుర్ముఖుడను ప్లవగ నాయకుడు దేవాంశ సంభూతులగు రెండుకోట్ల వానరులు తనను భక్తితో సేవించుచుండగా వచ్చెను. కైలాస గిరిశిఖరములవలె ఉన్నతాకారులును బలిష్ఠులును నగు వానరకోట్లు వేలు తనను సేవింపగా వాయుపుత్రుడచ్చటికి వేగముగా వచ్చెను. వీరులగు శతలక్షకోట్ల వానరశ్రేష్ఠులతో నలుడు వచ్చెను. పదికోట్ల వానర నాయకులు కొల్వగా వేగముగా దధిముఖుడేతెంచెను. వహ్నియు, కుముదుడును, మహావేగము బాహుబలము గలవాడగు రంహుడును, ఉగ్రుడు, శరభుడు మొదలగు వానర సమూహములును వచ్చెను మఱియు పర్వతములందును, నదులందును, వనములందును నివసించునట్టి వానరులందఱును వచ్చి చేరిరి. వారలయొక్క సంఖ్యను లెక్కించుట కెవ్వరికిని శక్యము గాదు. కొందఱు వానరశ్రేష్ఠులు మ్రొక్కి వెళ్ళు వారును, కొందఱు చేతులు జోడించి ప్రక్క

ప్రక్కలందు నిలుచుండు వారును, వానర సమూహములు కొన్ని గర్జనలతో దిక్కులు అదురునట్లు ధ్వనించునవియును, కొన్ని దూకుచు ఆటలాడుచుండు నవియునై ముట్టబడిన సూర్యునిదలపించెను. గొప్పపరాక్రమముగల వానర శ్రేష్ఠులు కిలకిల ధ్వనులతో సాగివచ్చి తమను తెలియజేసికొనుచు సూర్య నందనునకు శిరస్సువంచి నమస్కరించి వెళ్లుచుండిరి. అంత ఉచితమైన విధముగా తమ వస్త్రాధికములను ముడుచుకొనుచు కొందఱు కపీశ్వరులు వినయముతో సూర్యనందనుని యొద్ద చేతులు జోడించి నిలుచుండిరి. వారలనందఱిని రఘురామునకు విశదముగా చెప్పి, వారిని జూచి మీ మీ పరివారములను తగిన పర్వతములందును అరణ్యములందును నిల్చి చూచుకొనుచు ఉండుడని ఆజ్ఞనిచ్చి..



# నలువదవ సర్గము

## సుగ్రీవుడు శ్రీరామునకు తన సేనల నివేదించుట

శ్రీరామచంద్రుని జూచి సుగ్రీవుడిట్లనెను. నా రాజ్యమున నున్న వానరులు కోరిన రూపము ధరింపగలవారు. మదించిన గజములతో సమానులు. పరాక్రమము గలవారు. అడ్డులేని గమనము గలవారు. రాక్షసుల వంటివారు. భయంకరమైన ఆకారము గలవారు. అలసట లేనివారు. ప్రశస్తమైన బలము గలవారు. ప్రఖ్యాతమైన పరాక్రమము గలవారు. కార్యమును సాధింప గలవారు. భూమిని, ఆకాశమునను, నీటను, వనములందును సంచరింపగలవారలు. కోట్లకొలదిగా వచ్చి ఇచ్చట నిండి యున్నారు. ఇదిగో నీ యొక్క సేవకులను ప్రేమతో చూడుము. స్వామికార్యమును భక్తితో చేయువారు. ఆజ్ఞను జవదాటరు. నీ ఆజ్ఞ నెరవేర్చు నేర్పు గలవారు. ఇది యంతయును నీ యొక్క సైన్యము. ఇప్పటి నుండి నీ ఆజ్ఞ లందు నడచును. ఏది చేయుటుచితమో దానిని ఆనతిమ్ము. ఇచ్చట నున్న కోతులేపనైనను పట్టుదలతో చేయగల సమర్థులని నేనెరుగుదును. నీ మనస్సునందాలోచించి తగిన విధముగా వీరిచే పని చేయించుకొనుము. వీరలకాజ్ఞనిమ్ము అని చెప్పగా విని రాఘవుడు, తన సోదరుని వంటివాడగు సుగ్రీవుని కౌగలించుకుని ఇట్లనెను. భూపుత్రి ఇంతవరకు దశకంఠుని ఇంట బ్రతికియున్నదో లేదో తెలిసికొనదగును.

ఆ రావణుడు నివసించు దేశమును, భూపుత్రి యుండెడి విధమును సుగ్రీవా! ముందుగా తెలియవచ్చినచో సంతోషముతో తరువాత చేయవలసిన కార్య విధానములను నీవును నాకు సహాయపడగా నేను ఆజ్ఞాపించెదను. ఈ పనిని

నెరవేర్చుటకు నీవే సమర్థుడవు గాని, నేను గాని నా తమ్ముడు గాని సమర్థులము కాము సుమా! ఈ కార్యమునంతను జరుగునట్లు చేయుటకు ఇక నీవే మాకు దిక్కు. ఆ వృత్తాంతమంతయు నీవెఱుగుదువు గదా. ఏమి చేయవలెనో నీవే నిర్దేశింపుము. నీవు శౌర్యము గలవాడవు. అర్థమునెరిగిన వాడవు. ఏ కాలమందేపని చేయవలయునో తెలిసినవాడవు. రెండవ స్నేహితుడవైన నీవు మనస్సునందు మాకు మంచి చేయుటకే తలంపు గల వాడవని నేనెఱుఁగుదును సుమా.

## తూర్పున సీతను వెదకుటకు సుగ్రీవుడు వినతుని బంపుట

అని రామచంద్రుడు చెప్పగా, వానరరాజు రామలక్ష్మణుల సమక్షమునందే పర్వత సమానమైన ఆకారము గలవాడును, మేఘము వంటి గర్జనలు గలవాడును అగు వినతుడను వానిని తొందరగా పిల్చి ఇట్లు చెప్పెను. ఓ వానర నాయకా! దేశకాలములను దెలిసినవాడవు. ఏ పనియందైనను ఇది హితము, ఇది అహితము అని తెలిసిన వాడవు. చంద్రవంశజులును, సూర్యవంశజులును అయిన లక్షలకొలది వానరులు గొల్చుచుండగా, తూర్పుదిక్కున రావణుని నివాసము నరయుటకై నీవు వేగముగా వెళ్ళుము. భూపుత్రి కొరకు అడవులను, పర్వతములను, నదీనదములను విడువక వెదకుము. సరయూనదిని, గంగను, కౌశికిని, మనోహారిణి అయిన సింధునదిని, యమునానదిని, యామునపర్వతమును, సరస్వతీనదిని, పర్వతములతో నదులతో గూడిన భూమిని, కాలమహీనదిని,. బ్రహ్మమాలదేశమును, విదేహరాజ్యమును, మాళవదేశమును, కాశీ పట్టణమును, మగధ దేశమునందలి గ్రామములను, కోశకారులపురమును, కోసలదేశమును ఇన్నిచోట్లను దశరథుని కోడలును, రామునిపత్నియునైన, ఆ కలువకంటియగు జానకికై వెదకుడు. సముద్రము లోపలనున్న పర్వతములను, పట్టణములను, మంధర

పర్వతముపైనున్న ముక్కులేనివారును, పెదవులందు చెవిగలవారును, కఠినమైనలోహముఖము కలిగినవారును, ఒక పాదము గలవారును మొదలగు వికృతాకారులు, అధికమైన వేగముగలవారు, గొప్ప బలముగలవారు, ఆనవులు, మానవులదినువారు, చెవులయందు శిరోజములుగలవారు నుండెడు స్థలములన్నియు వెదుకవలెను. వరుసగా కిరాతకుల సమూహములును, బంగారము వంటి శరీరము గలవారును, ద్వీపములలోనుండు పచ్చిచేపల దినువారలును, సగము నరరూపము, సగము వ్యాఘ్రరూపము గలవారును ఉండెడు చోటులను చూచి, అట నుండి పర్వతముల మీదుగను, నౌకలమీదను దుముకుటచేతను చేరదగి ఏడుఖండములుగల యవద్వీపము కనపడును. తరువాత స్వర్ణ ద్వీపము, రూప్యక ద్వీపములను దాటి, తరువాత ఆకాశమునంటు శిఖరములుగల శిశిరమనుపర్వతమునుచేరి, అందలి గొప్ప గుహలందును, వనములందును వెదకుడు. అది దాటి వెళ్ళినచో ఎఱ్ఱని నీటితో గూడినదియు, చాల లోతుగలదియు, అతి వేగముగా ప్రవహించునదియునైన శోణనదము సముద్రమునకావల నుండును. అచ్చటి అందమైన తీర్థములు మొదలైన వానియందు వైదేహితోగూడ నున్న రావణుని మీరు వెదకుడు. పర్వతమునుండి పుట్టిన చాలా అందమైన నదులందును, తోటలందును, సముద్రమునందలి ద్వీపములందును మీరు తప్పక వెదకవలయును. అచ్చట సముద్రమందు గొప్ప శరీరము గలవారును, గొప్ప ఆకలివారును, అగు రాక్షసులు బ్రహ్మ వరముచే పైనవెళ్ళు ప్రాణుల ఛాయలనుబట్టి లాగుచుందురు. కాన మిక్కిలి ఎత్తైన మార్గమునే దానిని దాటిపోయి, అచ్చట కెంపురంగు నీరుగల లోహితవారిధిని జూచుచు, ఓ వానర సంఘములారా! మీరలు చాలా పెద్దదైన కూటశాల్మలికి వెళ్లి అందు లోహములు, మణులతో ప్రకాశించునదియు, కైలాస పర్వతమువంటిదియు, దేవశిల్పిచే నిర్మితమైనదియునగు పక్షిరాజగు గరుత్మంతుని

నివాసమును జూడుడు. అందు మందేహులను పేరుగల రాక్షసులు, గొప్ప భయంకరమైన ఆకారము గలవారలు, అనేక విధములైన రూపములు గలవారలు, కొండల శిఖరాగ్ర ప్రదేశములందు వ్రేలాడుచు, ప్రతిదినమును సూర్యోదయవేళలందు అర్ఘ్యజలముల బ్రహ్మతేజస్సుచే కొట్టబడిన వారై, మరల అచ్చట వ్రేలాడుచుందురు. అచ్చట తెల్లని మేఘమును బోలుచునున్న క్షీరసాగరమనేడి సముద్ర మొప్పుచుందును. అదియు మౌక్తిక హారముల వంటి తరంగములతో నొప్పుచు అందముగా నుండును. అది అతిభయంకరమై చొరరానిది. అందును రామపత్నిని రావణునితో గూడ వెదకుడు. స్వచ్ఛమైన ఆ సముద్రమధ్యమున ప్రఖ్యాతి చెందిన ఋషభమను పేరుగల పర్వతమున్నది. తెల్లని కాంతి గలిగి, దివ్యమైన సుగంధములతో గూడిన పుష్పములతో ప్రకాశించునట్టి అందమైన బంగారపు చెట్లతో నిండియుండును. అచ్చట శ్రమను దొలగించునదియు, చూడదగినదియునైన సుదర్శనమను పేరుగల సరస్సు వెలయుచుండును. వెండికేసరములుగల, వెండిపద్మములుగల ఆ సరస్సునందు రాజహంసల గుంపులవలె కిన్నెరులు, చారణులను దేవగణములను, అప్సరసలును కేళీవినోదముగా జలక్రీడలాడుటకై వచ్చెదరు. ఆ క్షీరసముద్రము దాటిన తరువాత, సర్వప్రాణులకు అధికమైన భయమును గలిగించునదియు, అధికమైన ఔర్వుని కోపమువలన బుట్టిన అశ్వముఖము గల బడబాగ్నికి నివాసమైనదియునగు జలసముద్రము గలదు. ప్రళయకాలమందు సర్వలోకములను సాక్షాత్తు ఆ బడబాగ్ని ముఖమునందు బడి సమూలముగా భస్మమగును. ఎంతటి సమర్థతగలిగిన జలజంతువులైనను ఆ బడబాగ్ని జూచి భయవేగముచే ఆక్రమింపబడినవై గోలపెట్టగా ఆ సమీపమున వినవచ్చును సుమా. వానరశ్రేష్ఠులారా! ఆ జలసాగరమును దాటి ఆవలకు వెళ్లగా, పదమూడు యోజనముల బంగారపుశిల గల సువర్ణపర్వతము గలదు. దానిపై

సుకుమారమైన చంద్రుని ప్రకాశముగలవాడును, భూమిని మోయువాడును, తామరరేకులవంటి కన్నులు గలవాడును, నల్లని వస్త్రము ధరించినవాడును, వెయ్యిపడగలు గలవాడును అగు సర్పరాజగు అనంతుని మీరు చూడుడు. ఆ మహాత్మునకు జండా వలె బంగారు తాటిచెట్టునుండెను. అది మూడు శిరములు గలది. పర్వత శిఖరముపై నిలిచినది. దానిని దేవతల సమూహము తూర్పు దిక్కునకు అవధిగా నిలిపెను. ఆ తరువాత బంగారుమయమైన ఉదయాద్రి కనిపించును. అందమైన ఆ పర్వతము యొక్క అగ్రమునందు ఆకాశమునంటుచు బంగారుమయమైన శతయోజన విస్తీర్ణమైన సమతల ప్రదేశము గలదు. అచ్చట మద్ది, తాటి, బీకటి, కడప, కొండగోగువృక్షములు సూర్యునివంటి తేజ్జస్సుతో గూడినవై, పుష్పములతో గూడి ప్రకాశించుచుండును. యోజన విస్తారము, పది యోజనముల ఎత్తు గల్గిన శృంగ మొప్పుయుండును. సౌమనస అనబడు ఆ శృంగమునందు వామనుడు, మునుపు త్రివిక్రముడైనవేళయందు ఒక పాదమును దానిమీద నుంచి, రెండవ పాదమును మేరుపర్వత శిఖరమున నుంచెను. సూర్యుడు జంబూద్వీపమున ఉత్తరభాగమునందు దిరుగునప్పుడు ఆ గొప్ప పర్వతశిఖరమున నిలిచినవాడై దక్షిణముననున్న వారలకు కనిపించును. దానియందు సూర్యుని వంటి రంగు గలవారలు, అమితమైన తేజస్సు గల వారలునైన వాలఖిల్యులను పేరుగల మునులు, కఠినమైన నియమములు గలిగిన వైఖానసులును ప్రకాశించుచుందురు. దాని ప్రక్కనయున్నదియె సుదర్శనము. ఈ గొప్ప ద్వీపమున ఎల్ల ప్రాణికోట్లకును కంటి వెలుగునిచ్చు గొప్ప తేజస్సు వెలుగుచుండును. ఆ తూర్పు పర్వతము యొక్క వనములందును, గుహ లందును, శిఖరములందును సీతను వెదకవలెను. సూర్యకిరణముల కాంతియు, బంగారుపర్వతము యొక్క మహాకాంతిసమూహము తనపై బడుటచే ఉదయ సంధ్యాసమయము ఎక్కువగా రక్తకాంతులతో ప్రకాశించుచుండును. భూమికిని,

లోకసమూహమునకు మునుపు బ్రహ్మ దీనిని ద్వారముగా చేయుటచేతను మరియు సూర్యుని గమన మార్గమునందు మొదటిదై యుండుటచేతను, అది పూర్వదిక్కని స్తుతింపబడినది. ఆ దిక్కునున్న అడవులను, కొండలను, సేలయేళ్ళను, గుహలను సీతకై వెదకుడు. ఆ యుదయాద్రికావల దేవత లుండుచోటు. సూర్యచంద్ర కిరణములు అచ్చట కొంచము కూడ ప్రసరింపక పోవుటచేత నచ్చట చిమ్మచీకట్లు నిండియుండును. ఆచోట గమ్యము అంతదనుకపోవుటకు సాధ్యమగునుగాన మీరాచోటులందును, నేను చెప్పని ప్రదేశములందును భూపుత్రిని వెదకుడు. మీరలు యుదయాద్రిదాక వెళ్లి భూపుత్రిని, రావణుని నివాసమును జూచి నెలరోజులలోనే ఇక్కడ తిరిగివచ్చి వేయుడు. అంతకముందు రాకున్నచో, ఆలస్యముచేసిన యెడల మీరు సంహ రింపబడగలరు. కార్యమును సాధించుకొని కీర్తిని పొందుడు. జనకరాజపుత్రిని ఎట్టులైనను చూచి వేగముగా రండు. ఆవల సుఖములను పొందుడు.



# నలువది యొకటవ సర్గము

## సుగ్రీవుడు హనుమదాదులను దక్షిణ దిక్కున వెదక బంపుట

అని, తూర్పుదిక్కునకు వానరవీరులను పంపి, దక్షిణ దిక్కును వెదకుటకై అగ్నిపుత్రుడైన నీలుని, హనుమంతుని, బ్రహ్మపుత్రుడైన జాంబవంతుని, గజుని, సుహోత్రుని, గవయుని, శరారిని, శరగులముని, గొప్ప బలముగల్గిన సుషేణుని, ఋషభుని, గవాక్షుని, అశ్వినీదేవతల పుత్రులైన మహా బలశాలురైన మైందద్వివిదులను, గంధమాధనుని, విజయుని, ఉల్కాముఖుడను వానిని, అంగదుడు మొదలుగాగల మహా బల, వేగ, సంపన్నులను పంపదలచి ముందు గానే కొంత సైన్యమును వెంటనే దక్షిణదిశకు పంపెను. వారిని దగ్గరగా బిలచి యమునిదిక్కు (దక్షిణము) నందుగల దుర్గములైన పర్వతములు, వనములు మొదలగు వాని విధమునిట్లు చెప్పెను. అనేకమైన చెట్లు, లతలు గలిగి వేల శృంగములతో వ్యాపించియున్న భయంకరమగు వింధ్యపర్వతమును, గొప్ప భయంకరములైన సర్పములతో గూడియున్నదగు నర్మద యనెడు మహానదిని, విస్తారమైన గౌతమీనదిని, కృష్ణవేణీ మహానదిని, గొప్ప సర్పములు గల దగు వరదానదిని, మేఖలాత్కలా నదులను, అందమైన నిశార్ణదేశములందలి పట్టణము లగు అశ్వవంతిని, అవంతిని, విదర్భదేశమును, మహిషి, ఋషిక దేశములను, వంగ, కాశీ, కళింగ, అంగదేశములను, పర్వతములతో, నదులతో, గుహలతో నుండు దండకాటవిని, గోదావరీనదిని కొంచము చోటనైనను విడువక జానకిని వెదకుడు మఱియు ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళాది దేశములను బహువిధముగా, చిత్రముగా పుష్పించిన అడవులు గలిగి, చందన వృక్షములు

గలిగి అయోముఖమనబడు సహ్యాద్రి ప్రదేశమునందు వెదకుడు. ఏ నది నీరు ఎవ్వరికైనను నిరాటంకముగా మంగళములొసగునో అట్టి హితకరము, నిర్మలమగు సముద్రపత్నియగు కావేరీనదిని, దేవతాస్త్రీలచే పూజింపబడినదానిని చూచుడు. ఆ మలయపర్వతమున ప్రకాశించు మహా తేజస్వి దివ్య ఋషీశ్వరుడు ఘనుడైన అగస్త్యుని కోరికలు తీరునట్లుగా చూచి, నమస్కరించి, మీరా మహనీయుని ఆజ్ఞ పొంది ఆవలికి వెళ్లి గొప్పనైన ఆడ తాబేళ్లను, పీతలను గలదియు, మొసళ్లతో గూడినదియునగు తామ్రపర్ణినదిని చూడుడు. చందన వనములతో నిండినదియు, ద్వీపములతో గూడినదియునైన ఆ నది, యవనవతి యగు స్త్రీ తన భర్తను కలిసికొనుటకై వెళ్లుచున్నట్లుగా సముద్రమును గలియుటకు వెడలుచుండెను. అటు తరువాత దివ్యమైనదియు, నవముక్తాహార విభూషిత మైనదియు, బంగారుమయమును అయి, లక్ష్మీనివాసమైన పాండ్యనగర ద్వారమును, ఓ వానరవీరులారా! చూడుడు. సముద్రతీరమునుజేరి వానరులారా! దానిని దాటునట్టి మార్గమును వెదకుడు. పూర్వము అగస్త్యుడు మహేంద్ర పర్వతమును సముద్రమున నుండునట్లు చేసెను. కనకమయము, అన్ని విధములైన లతలతో అందమైనది. దేవర్షులచే సేవింపబడినదియైన ఆ పర్వతము సముద్రమునమునిగియున్నట్లుగా కనిపించును. వినుడు. దానియందు యక్షచారణులు, సిద్ధులు, దేవతా స్త్రీలును గుంపులై ఎప్పుడు నుందురు. అన్ని పర్వ సమయములందును ఇంద్రుడచ్చటికి వచ్చుచుండెను. ఆ సముద్ర మధ్య ప్రదేశమున మనుషులకు చేరరానిదై శతయోజనముల విస్తీర్ణముగలిగిన ద్వీప మొప్పుచుండును. అందంతటను సీతాదేవిని వెదకదగును. వధ్యుడును, దుష్టాత్ముడును, ఇంద్ర సమానవైభవము గలవాడును, దేవ విరోధుల కధిపతియు, భూపుత్రినపహరించి నిరోధించినవాడును, దయలేనివాడును అయిన రావణుడు నివసించు పట్టణము అదియే యగుటచే వానరశ్రేష్ఠులారా! మిక్కిలి జాగ్రత్తగా కొంచెమైనను వదలక తప్పక వెదకుడు. దక్షిణ సముద్రమధ్యమందు అంగారక యను రాక్షసి యున్నది. అది తీక్ష్ణతతో ప్రాణిసమూహములను నీడను బట్టి,

పట్టుదలతో భక్షించును. అచ్చట జానకిని జాగ్రతగా వెదకి, అచ్చట నిస్సంశయముగా లేదని తోచినచో ఆ తరువాత, నొక నూరు యోజనములు వేగముగా వెళ్ళుడు. అచ్చట సిద్దులు, చారణులు మొదలైన వారిచే సేవింపబడునదియు, చంద్రసూర్య కిరణముతో సాటి వచ్చునదై అందము మీరినదియు, సముద్రపు నీటిచే చుట్టబడినదియు, పుష్పితకమను పేరుగల పర్వతమొక్కటి ఆకాశమునంటుచున్న శిఖరములతో మెప్పుచుండును. ఆ పర్వతము యొక్క బంగారు శిఖరమును రాయుచు దక్షిణాయణమునందు సూర్యుడు వచ్చును. దాని రజతశిఖరమున చంద్రుడుండును. కపిశ్రేష్ఠులారా! మేలును మరచిన వారలును, దుష్టులు, నాస్తికులు ఆ పర్వతమును చూడజాలరు. మీరందఱును శిరములు వంచి ఆ పర్వతమునకు నమస్కరించి అచ్చట వెదకదగును. ఆ పర్వతము దాటి పదునాలుగు ఆమడలదూరము వెళ్ళినచో చొరరానిదైన సూర్యవంతమను పర్వతమున్నది. ఆవల వైద్యుతమను పర్వతమున్నది. అందు కందమూల ఫలాదులను సాపడి, తేనెలను గ్రోలి ప్రయాణపుబడలికలుతీరగా ఆవల కుంజరమను పర్వతమును జూడుడు. ఆ గిరి యందు విశ్వకర్మ అగస్త్యునకు అందముగా నొక్క మందిరము నిర్మించెను. అది ఆమడ వెడల్పుగల్గి, అంతకు పదిరెట్లుగా ఎత్తు గలిగి, బంగారుమయమై, దివ్యరత్నములతో ప్రకాశించుచుండును. దానినిజూడుడు. ఆ గొప్పపర్వతమునందు సర్పరాజగువాసుకి యొక్కనివాసమై, భోగవతియను పేరుగలదై, ప్రవేశించుటకు సఖ్యముగాని, విశాలమైన గొప్పద్వారములు గలదై, నాగులచే రక్షింపబడినట్టి యొక పట్టణము గలదు. ఆ నాగనివాసమునందచ్చటచ్చట రహస్యస్థలములు గలవుసుమండీ. అవియన్నియు మీరు క్రమముగా వెదకుచువెళ్లగా, పెద్ద ఆకారము గలిగి వృషభము వలె గనిపించెడి ఋషభమను పేరుగల పర్వతరాజము, గొప్ప మణులసంపదలతో నిండినది కలదు. గోరోచనావర్ణముగలదియు, దివ్యమైన అగ్నికాంతిగలదియు, పద్మవర్ణముగలదియు, నల్లని వర్ణముగలదియునైన చందనమాపర్వతముననుద్భవించును. వాటినూరకే చూడవలెనుగాని ముట్టుకొన

బోకుడు. వాటిని గ్రూరులైన రోహితులనెడు గంధర్వులెల్లపుడును రక్షించు చుండెదరు. బభ్రుడు, శైలూషుడు, శుభ్రుడు, శిగ్రుడు, గ్రామణియనుపేర్లుగల గాంధర్వ శ్రేష్ఠులు సూర్యుని తో సమానమైన తేజస్సుగలవారు ఐదుగురు గలరు. అందు సూర్యచంద్రావహ్ని సమానశరీరములుగల పుణ్యకర్ములు నివసించెదరు. భూమియొక్క చివరి ప్రదేశమైయున్న ఆ పర్వతమున స్వర్గమును జయించిన వారును, తేరిచూడరానివారును, పాపరహితులును అయిన సిద్ధులలో శ్రేష్ఠులు నివసింతురు. దానిని దాటి వెళ్ళినచో సుదారుణమైన పితృలోకమున్నది. అది మనుష్యకోటికి చూచుటకును, చేరుటకును సఖ్యముగాని యముని రాజధాని. దాని చుట్టు భయంకరమైన చీకటి గ్రమ్మియుండును. ఓ వానరులారా! అంతదాకనే మీరు వెళ్లవచ్చును. ఆవల బోవసాధ్యముగాదు. ఇంకనేవైన మార్గములు గనిపించినచో ఏమియు విడువక నిదానముగా ప్రయత్నించి మెలకువ గల్గిన మనస్సు గలవారై రామచంద్రుని భార్యను వెదకవలెను. ఒక్క నెలలో భూపుత్రిని నేను చూచితినని చెప్పువాడు నాతో సమానమైన సౌఖ్యమును, భోగభాగ్యముల నెల్లప్పుడనుభవించువాడగును. వానికంటె నితరమేదియు ఈ సకల భూమండలమునందు నాకు ప్రియమైనది లేదు. వాడెంత దోషము చేసిన వాడైనను నాకు చుట్టమగును సుమా. మీరందఱును విక్రమము, సత్వము అధికముగా గలవారు. మంచి వంశమున బుట్టినవారలు. ఎక్కువైన శ్రేష్ఠ గుణములు గలవారలు. కాన నేవిధముగ నైనను ప్రయత్నించినవారై జనక సుతామణిని చూడుడు. అని చెప్పి హనుమదాదులను దక్షిణదిశకు బంపించెను.



# నలువది రెండవ సర్గము

## సుగ్రీవుడు సుషేణాదులను పశ్చిమ దిశను వెదక బంపుట

అట్లు వానరులనంపి, సుగ్రీవుడు భయంకరమైన పరాక్రమముగలవాడును, తార తండ్రియగుటచే తన మామగారును, మేఘము వంటి ఆకారము గలవాడను అయిన సుషేణుని బిలిచి చేతులు జోడించి వినయముగా మ్రొక్కి, భయంకరమైన పరాక్రమము గలవాడును, ఇంద్రునితో సమానమైన కాంతి గలవాడును, గొప్ప కొండవంటి ధైర్యము గలవాడును, శౌర్యముచే దర్పించిన వానరులచే పరివేష్టింప బడిన వాడును, బుద్ధిబలముచే గొప్ప చరిత్ర గలవాడును, గరుత్మంతుని వంటివాడును అయిన మరీచి పుత్రుడగు మారీచునిని, అతని సోదరులగు మారీచులను చూచి యిట్లనెను. సుషేణుడు మొదలుగాగల ఓ వానరులారా! మీరందఱు రెండు లక్షల క్రోతుల సమూహముతో పడమటి దిక్కున శ్రీరాముని పత్నిని వెదకుటకు వెళ్ళుడు. సురాష్ట్రము, బాహ్లికము, శూరము, భీమము అను దేశములను, అందలి ప్రాచీనములగు పల్లెప్రదేశములను, పున్నాగ వనమును, పొగడ వనమును, మొగలి అడవులను గలవు. వానిని చూడుడు. పడమటి దిక్కుగా పారుచున్న నదులను, మునులుండు వనములను, కొండలను, అడవులను, ఎడారులు, కొండప్రదేశములను వెదకుచు పశ్చిమ సముద్రమును చేరవెళ్లుడు. తిములు, తిమింగిలములు, మొసళ్ళు, గొప్ప లోతుగలిగిన సముద్రమును జూచి ఆ తీరమునందున్న మొగలి చెట్ల సమూహములందును, కానుగు చెట్లతోపులందును, కొబ్బరి చెట్లతో అందముగానున్న వనములందు విహరింపుడు. అచ్చట ఒడ్డువెంటయున్న గొప్ప పర్వతములందును, అడవుల

సమూహములందును, సుందరి యైన జానకిని ఇంద్రశత్రువగు రావణాసురుని బాగుగా వెదకి దానిని దాటుచు పట్టుదలగా మురచీపురమును, అందమైన జటీపట్టణమును, అవంతిని, అంగలోపను చూడుడు. పట్టణములు, రాష్ట్రములు, జనులు సంచరింపరాని వనములను ప్రవేశించి వెదకి, సింధునది సముద్రమును జేరుచోట గొప్ప చెట్లుగలిగి, ఎత్తైన నూరుశిఖరములు గల్గి, ఆకాశమును అంటుచున్న హిమగిరి అను పర్వతము రెక్కలుగల సింహములతో గూడిన చరియలు గలది యున్నది. ఆ సింహములు సముద్రము నుండి తిములను, చేపలను, సర్పములను, పర్వతములందలి గుహలలో గుంపులుగా తెచ్చి యుంచుచుండును. ఆ గుహలలో మదించిన ఏనుగులు కూడ తిరుగుచుండును. పవిత్ర చరిత్ర గలిగిన ఓ వానరులారా! వేగముగా ఆ గిరినంతయు వెదకి నూరుయోజనములు గల్గి, చూచుటకసాధ్యమైన పరియాత్రమనెడు బంగారు శిఖరమును జూచుడు. అచ్చట గొప్ప సత్వము గల్గిన వారలును, కామరూపులను, అగ్ని సమానులను, దృఢమైన విక్రమముచే సింహముల వంటివారును అయిన ఇరువదినాలుగు కోట్ల గంధర్వులు ఎల్లప్పుడు నుందురు. మీరు వారలను సమీపింపకుడు. అచ్చటి మధురములైన ఫలములను, దుంపలను, వారు బహుజాగ్రత్తగా శౌర్యముతో గాపాడుచుందురు. కాన వాటిని మీరంటకుడు. సీతాదేవిని అచ్చట వెదకుడు. మీరు కపులగుటచే (వనసంచారము సహజమే కనుక) భయము లేదు. పవిత్రమైన వైడూర్యవర్ణములతో ప్రకాశించు వజ్రమువలె దృఢమైన కొండ ఆ తరువాత యున్నది. అది అనేకమైన లతలు, చెట్లతో నిండియుండును. దాని వజ్రపర్వతమని పిలిచెదరు సుమా. దానిమీద నూరుయోజనముల సమతలమైన నేల అతి చిత్రముగా నొప్పుచుండును. అటు తర్వాత నున్న గుహల నన్నిటిని వెదకుచు వెళ్లగా సముద్రమున నాల్గవ భాగమున చక్రవంతమను పర్వతముండును. అందు సహస్రారచక్రము కనపడును. అది విశ్వకర్మచే నిర్మింపడినది. దానిని గాచుచున్న హయగ్రీవుడను దానవ శ్రేష్ఠుని

జంపి శ్రీమహా విష్ణువు ఆ చక్రమును, పాంచజనుడను రాక్షసుని జంపి పాంచజన్య శంఖమును తీసికొనెను. ఆ పర్వత సానువులందు గుహలందును సీతను, రావణుని వెదకవలయును. ఆ తరువాత అరువది యోజనముల విశాలమైన వెండి శిఖరములతో గూడిన వరాహ పర్వతము సముద్రములో నెత్తుగా నుండును. ఆ విశాలమైన పర్వతమునందు ప్రాగ్జ్యోతిష పురమున్నది. అందు క్రూరాత్ముడైన నరకుడను రాక్షసుడు నిర్భయముగా నివసించును. ఆ కొండగుహలందును, పట్టణమునందును వెదకుచు వెళ్లగా బంగారుమయమైన గుహాంతర్భాగములు గలదియు, అనేక జలపాతములు గలదియునైన సర్వసౌవర్ణమను కొండ గలదు. అందలి జలపాతముల ధ్వనులకు ఏనుగులు, సింహములు, పెద్దపులులు, అడవి పందులు మొదలగు వాని సమూహములు మాఱు పల్కుచుండును. దేవతలందఱు ఇంద్రునభిషిక్తుని జేసిన పర్వతమదియే సుమా. అదియే మేఘవంతమని ప్రఖ్యాతి చెందినది. దానిని దాటి వెళ్ళినచో అరువదివేల పర్వతములుండును. అందు సూర్యతేజము గలిగిన బంగారు మయమైన చెట్లున్నవి. అవి పువ్వులతో నిండి చూచుటకు మిక్కిలి యింపుగూర్చు చుండును. వాని మధ్యభాగమందు ఉత్తర మేరుపర్వతముండును. ఆ పర్వతరాజుని జూచి సూర్యుడు సంతోషించినవాడై యిట్లు వరమొసంగెను. ఓ పర్వతశ్రేష్ఠుడా! నీయందు నివసించు వారు రాత్రియును, పగలును నాయనుగ్రహముచే బంగారపు శరీరము గలవారై ఒప్పుచుందురు. ఓ పర్వత వసంతమా! నీపై నివసించు గంధర్వులు మున్నగు దేవతాసమూహము మృదువైన కాంతిచే ప్రకాశింపచేయబడిన శరీరముగలదై శుభకరమైన ఎఱ్ఱని దేహముగలదై యుండును. విశ్వేదేవతలు, ఆదిత్యులు, మరుత్తులు, వసువులు మొదలైన ప్రఖ్యాతులైన దేవతలు గొప్ప భక్తితో ప్రతిదినము అపర సంధ్యవేళ బంగారు కొండయందున్న సూర్యుని గొల్తురు. భూతకోట్లకు కనిపించకుండ సూర్యుడు విశ్వమంతయు చీకట్లలో మునుగగా అస్త్రాద్రికి వేంచేయును. అటనుండి

గడియలో భాస్కరుడు పదివేలయామడల వెళ్లి యొక పర్వతమును జేరును. ఆ పర్వత శిఖరమున సమానమైన ప్రాసాదముతో నిండిన గొప్ప దివ్య భవనము ప్రకాశించుచుండును. అది విశ్వకర్మచే నిర్మింపబడి అనేక విధములైన పక్షులతో నిండి యుండి అందమైన వృక్షములు గలదై యొప్పుచున్న వరుణ దేవుని భవనము. అస్త గిరికి, మేరు గిరికి నడుమ బంగారమైనదియు, చిత్రమైన వేదికలు గలదియు, పదితలలు గలదియునై ఒక తాటిచెట్టు నేత్రపర్వముగా నున్నది. గొప్ప తపోనిష్ఠ గలవాడును, అధికమైన ధర్మ నిష్ఠ గలవాడును అయిన మేరుసావర్ణి యనుపేరుగల బ్రహ్మసమానుడైన ఒక ఋషి అందుండును. అతనిని జూచి నమస్కరించి జానకి వార్త నడుగుడు. ఓ వానరులారా! ముగియగానే తామరల మిత్రుడు ఉదయాద్రి మొదలుకొని ఇంతవఱకు మాత్రమే తన తేజస్సుచే చీకటులను పోద్రోలి అస్త్రాద్రికి వెళ్లి చూచుడు. ఆ తరువాత నేమున్నదో తెలియరాదు. సూర్యుడు ప్రకాశింపక చీకటులు మాత్రమే యుండును. కనుక మీరస్త్రాది వఱకు వెళ్లి రావణుడుండుచోటును జూచి సీతను వెదకి రండు. ఇట్లు వెదకుటంతయు నొక్క నెలలోపునే కావలెను. ఆ తరువాత రాదు. ఎవ్వడైనను తెలివితక్కువతనముచే రాక నిలిచినచో వాడు వధింపబడును. మీరందఱును ప్రఖ్యాతి చెందిన బలము, పరాక్రమము గలవారు. మా మామయగు సుషేణుడు మీవెంట వచ్చును. అమిత బలము గలిగిన ఆతని ఆజ్ఞమేరకు వేగముగా వెళ్ళుడు. ఈతడే మీకందఱకును నాయకుడు. ఈతనిని ముఖ్యునిగా నెంచుకొని సీతాసతిని వెదకి మీరు కార్యసిద్ధిని పొందినచో ఈ భూమియందు ప్రత్యుపకారమొనర్చి కృతార్థులమగుటచే ఖ్యాతిని పొందవచ్చును సుమండీ! నేను చెప్పినదే గాక ఇంక నేదైన చేయదగినట్టిదున్నను దేశకాలములకు అనుకూలించునట్లుగా ఆలోచించి ఓ వానరశ్రేష్ఠులారా! చేయుడు. మీరు పడమటి దిక్కుగా వెళ్లుడని.

# నలువది మూడవ సర్గము

## సుగ్రీవుడు శతవలిని నుత్తరమున వెదక బంపుట

తన మామను పడమరగా బంపి వానరరాజు బలసంపన్నుడును, ఘనుడునైన శతవలిని చూచి తనకును, సూర్యవంశ సంభవునకును హితమగు నట్లుగా నిట్లుపలికెను. ఉత్తర దిక్కుగా హిమాలయ పర్వతము ప్రకాశించుచున్నది. శ్రీరాముదేవిని వెదకుటకై నీయట్టివారైన వానరులు నూఱువేల మంది నిన్ను సేవించుచుండగా యమపుత్రులైన నీ మంత్రులతో గూడి వెళ్లుము. ఈ కార్యమును నెరవేర్చి భూభర్తకు ప్రీతిని కలుగజేసితిమేని ఋణవిముక్తి పొంది పండితులలోను, కృతకృత్యులలోను ఉత్తమములమై నిలువగలము. మునుపు మనకు జానకీభర్త శ్రేయమును గలుగజేసెను. ప్రతిహితము చేయుట ఓ వివేకాశాలి! వానరశ్రేష్ఠా! కీర్తినొందుటకును, జన్మసఫలము చేసికొనుటకును ఉపాయముగాదా? ఉపకారి గాని వానికి ఉపకారము చేసినచో జన్మసఫల మగును గదా! అటువంటిది ఉపకారము చేసినవానికి ఉపకారము చేసినచో వానరశ్రేష్ఠా! ఇక చెప్పవలెయునా? దీనిని మనస్సునందుంచి రాముని పత్నియైన జానకిని ఏ పద్ధతిగా వెదకిన శ్రేష్ఠముగ నుండునో ఆ పద్ధతిని వీడక మీరు ప్రవర్తింపదగును. మంచి మనస్సుగల వానరులారా! నాకు మీరెల్లప్పుడును హితముకోరు వారలు గాన మీరేవిధముగనైనను ఈ రాజశ్రేష్ఠుని కార్యమును దీర్చుట న్యాయమగును. ఈ రాముడు ఎల్ల జీవులకును పూజింపదగినవాడు. శత్రుజన సంహారకుడు. మన మీద గొప్ప కరుణ గలవాడు. గాన సీతను వనములందును, పర్వతములందును వెదకవలయును. మెళకువతో మీరు

మ్లేచ్ఛదేశమునకు వెళ్లి, సూరసేనము, పుళిందములను దేశములను, ప్రస్థము, మద్రకము, భరత, కురువులను దేశములను, కాంభోజ యవనశక దేశములను, ఆరట్టము, ఛాహ్లికము, పౌరవము, టంకణము, రుషికము అను దేశములను, చీనము, పరమచీనము, నిహారము, దరదమునను దేశములను, హిమవత్పర్వత భాగములను దేవదారు వనములలో మిగుల ప్రకాశించు లోధ్రపద్మకవృక్ష ప్రాదేశములను, లోలనేత్రయగు సీతను, రావణాసురుని వెదకుడు. కపి శ్రేష్ఠులారా! సోమాశ్రమమును జూచి గాలమను పర్వతమును జూచి ఆపైని జానకీ దేవిని చక్కగా పట్టుదలతో అచ్చటి తీరప్రదేశములందును, కొండచరియ లందును వెదకుడు. ఆ పర్వతమును దాటి పోయినచో సుదర్శనమను పర్వతముండును. అది దాటి వెళ్లగా అనేక పక్షిసంతతులతో గూడి దేవసఖాద్రి ప్రకాశించుచుండును. ఆవల శతయోజనముల వఱకుగల ప్రాదేశము కొండలు, నదులు, వృక్షములు లేనిదియు, ఏ మృగములు లేనిదియునై సాగుచుండును. ఆ అడవిని వేగముగా దాటి వెళ్లగా కైలాస పర్వతము గనిపించును. అది వెతలను దొలగించును. అచట తెల్లని మేఘములవంటిదియు, సాటిలేని బంగారముచే నలంకరింపబడినదియు, విశ్వకర్మ నిర్మితమగు కుబేర భవనము నొప్పుచుండును. అందు సంతోషమును గలిగించునదియు, ఎఱ్ఱకలువలు, నల్లకలువలు, పద్మములు, తెల్లకలువలు గలదియు, శబ్దించుచున్న జలపక్షులు గలదియు, దేవస్త్రీలచే సేవింపబడినదియునగు కొలను గలదు. అప్సరస్త్రీలు విహరించు ఆ సరోవరము తీరమున దేవజాతులగు యక్షసమూహములు తన్ను సేవించుచుండగా కుబేరుడెప్పుడును ముచ్చట తీరునట్లుగా క్రీడించుచు సంతోషమునందుండును. మీరాస్థలమందు రావణుని, సచ్చరిత్ర గలిగిన జానకిని వెదకుడు. ఆవల క్రౌంచ పర్వతమును చూడుడు. దాని బిలమందు ప్రవేశించుట కష్టము. అందు ప్రమాదము లేనివిధముగా ప్రవేశింపుడు. అచ్చట దేవతలచేత గూడ పూజింపబడినవారును, సూర్యసములును, అయిన దివ్య మహర్షు

లుందురు. తక్కిన గుహలును, కొండచరియలును, లెక్కకుమించిన పర్వత సమస్థలములన్నింటిని చక్కగా వెదకుడు. అక్కడ గల కామశైలము వృక్షములు లేనిది. మానసగిరియు గలదు. ఆ మానసగిరి దేవదానవులకు కూడ ప్రవేశింప రానిది. ఆ పర్వత పార్శ్వములందు వెదకుడు. ఆ క్రౌంచమును దాటినచో మైనాకమనెడు పర్వతశ్రేష్ఠమున్నది. అందు మయుడను దానవుడు తానందముగా గట్టుకొన్న భవనమున్నది. మీరలాపర్వత సానువులందు సుందరియగు జానకిని వెదకవలయును సుమా. గుఱ్ఱపు ముఖము గలిగిన యువతుల సమూహము లందుండును. వారిని దాటి వెళ్లినచో గొప్పవారగు వాలఖిల్యుల కోటలును, సిద్ధులును ఎప్పుడును దపస్సులు చేయుచుందురు. వారు నమస్కరింప దగినవారు. గొప్పనైన తపస్సుయొక్క మహిమచే వారలు పాపరహితులై యొప్పుచుందురు. మిక్కిలి వినయముతో మిథిలాకన్య వార్తను వారల నడుగుడు. వానరులారా! ఆ సిద్ధాశ్రమ సమీపమున ప్రకాశించు బంగారు తామర పువ్వులతో గూడిన వైఖానసమను పేరుగల సాటిలేని సరస్సు గలదు. అచ్చట బాలభాస్కరుని వంటి ప్రకాశము గల హంసలు ప్రకాశించుచుండును. కుబేరుని వాహనమైన సార్వభౌమమను ఏనుగు, ఆడఏనుగు తన్ను కొలుచుచుండగా ఎల్లప్పుడు నచ్చటికి వచ్చుచుండును. ఆ సరః ప్రాంతములందు మీరు వెదకదగును. ఆ సరస్సున కావల చంద్రసూర్యులు, నక్షత్రములు లేనిదై మేఘరహితమై ఆకాశము నిశబ్దముగా నుండును. స్వయం ప్రకాశులైన మౌనులు సూర్యుని వలె ఆ స్థలమును వెలిగించుచు విశ్రమించెదరు. మీరది దాటి వెళ్లగా శైలోదయనెడి నది ప్రవహించుచుండును. ఆ నదికి రెండువైపులను కీచకములనెడి వెదురు పొదల గుంపులు గలవు. వానినాధారముగ చేసికొనియే సిద్ధులైనవారు ఆవలకు ఈవలికి పోవుటకు వచ్చుటకు వీలు కలుగుచుండును. ఆవల పుణ్యపురుషులైన వారికందఱకు సౌఖ్యకరములైన ఉత్తర కురుదేశములున్నవి. అందు ప్రకాశించు వైఢూర్యా దళములు గలిగి, క్రొత్తవైన బంగారు తామరపూలు గలిగిన

మనోహరములగు పద్మలతలతో గూడిన అనేకములైన నదులొప్పుచుండును. అచట ఎఱ్ఱకలువల గుంపులుండును. అచటి కోనేరులు బంగారపు కాంతి గలవియు, బాలసూర్యుని బోలినవియునై హెచ్చుగ ప్రకాశించుచు కన్నుల పండువుగ నుండును. నల్లని మణుల కాంతిగల రేకులతోను అచ్చమైన అపరంజి కాంతులుగల కేసరములతోను ఒప్పుచున్న నల్ల కలువలు గలిగి కొలను లన్నిచోట్లను సొంపుగా కనిపించును. ఆణిముత్యాలవలె, రత్నాలవలె నొప్పుచున్న ఇసుకతిన్నెలతో నీళ్లు అగ్నితో సమానమైన అందములు చిందుచుండును. పసిడి కాంతులనీను కొండలు దండిగా అన్నిచోట్ల నున్నవి. అచ్చట చెట్లు ఎల్లప్పుడును పూలను, పండ్లను చాల గలవై, వేలకొలది పక్షుగుంపులుగలదై, కొల్లలుగా సుగంధములు గలవై, కోర్కెలన్నిటిని తీర్చును. అచ్చట కొన్ని కొండలు అనేకవిధములైన ఆకారముగల వస్త్రములనిచ్చును. కొన్ని పర్వతములు స్త్రీపురుష నివాసయోగ్యములు. అన్ని ఋతువులందును సేవింపదగి యున్నవి. కోరిన ఫలములనన్నినింటిని కొన్ని నగములిచ్చును. మఱి కొన్ని మేలైన రత్నములను, అందమైన ఆభరణములను హెచ్చుగ నిచ్చును. అపురూపములైన బంగారు ఆసనములను, శయ్యలను కొన్ని పర్వతములిచ్చును. కొన్ని వృక్షములు భక్ష్యములను, పానములను హెచ్చుగా మనస్సునకు ఇష్టముగలుగు పుష్ప మాలికలను ప్రసవించును. అచ్చట యవ్వనము గలవారును, సుగుణ సంపన్నులను, మనోహరులును అగు స్త్రీలుందురు. గంధర్వులు, సిద్ధులు, నాగులు, కిన్నరులు, విద్యాధరులు వీరి సమూహములు సూర్యసమానమైన తేజస్సు గలవారై తమ కాంతలతో కోరికలు తీరునట్లుగా రతిక్రీడపరాయణులై విహరించుచుందురు. అనేక సుకృతములు చేసిన జన సమూహములచట నివసించును. అన్ని జీవజాలములకు సంతసము కలుగునట్లుగా చిఱునవ్వులు చిందించుచు స్త్రీల గుంపులు వినిపించునట్టి సంగీత వాద్యధ్వనులు అచ్చట ఎల్లప్పుడును మనోహరముగ వినవచ్చుచుండును. సంతోషము పొందనివాడు

గాని, స్త్రీతో గూడియుండని వాడుగాని ముచ్చటకైన నచ్చట కనిపించదు. అచ్చటనున్నవారలకు పూటపూటకు సౌఖ్యములు మరింత మనోహరములై యుండును. దానిని దాటి యుత్తరముగా వెళ్లి సముద్రమును చూడుడు. దానిలో సోమశైలమనెడు బంగారు పర్వతమునుండును. ఇంద్రలోకమునందు, బ్రహ్మలోకమునందు నివసించువారలు దానిని చూచు చుండెదరు. సూర్యుని తేజస్సుచేత సూర్యుడుండు దేశములనుండు వస్తుసంతతులవలె అచ్చట సూర్యుడు ప్రకాశింపక పోయినను అన్ని వస్తువులను సూర్యరశ్మి సోకినట్లుగానే తప్తసువర్ణ కాంతితో కనబడుచుండును. అందు విశ్వాత్మకుడగు విష్ణుభగవానుడును, ఏకాదశరూపుడు, మన్మథసంహారుడైన శివుడును, సృష్టించిన విధాతయు అందు నివాసముగా నుందురు. వానరులారా! ఉత్తర కురుభూములకు ఉత్తరముగా నింక వెళ్లబోకుడు. దేవతల సమూహమైనను సోమగిరిని చేర సఖ్యముగాదు. మీరలు ఆ గిరిని జూచి మరలుడు. ఆపైనున్న ప్రదేశము అవధులు లేనిదియు, భాస్కరుడులేనిదియు నగుటచే ఏమున్నదో యెఱుంగము. వానరులారా! మీరలు నాచే చెప్పబడినదియునగు భూమినంతయు వెదకుడు. సీతభామామణిని మీరలు చూచినచో రామచంద్రునకు ఎక్కువ ప్రియము. రాముని కంటెను నా మనస్సున కధికమైన సంతోషము కలుగును. వాయువు, అగ్ని వంటి శక్తిగల వానరులారా! అంత మీరలు నాచే పూజింపబడినవారై ఎల్లపుడు హితులతో, బంధువులతో భూమియందు సౌఖ్యములను పొందుచు, శత్రువులు లేనివారై మీ మనస్సులకు సంతసము గలుగునట్లు దిరుగుడు అని చెప్పి మఱియును.



# నలువది నాల్గవ సర్గము

## సుగ్రీవుడు కార్యభారము హనుమంతునిపై మోపుట

హనుమంతుని జూచి వానరరాజు ఇతడే కార్యసాధకుడని మనస్సునందు నిశ్చయించుకుని విక్రమవంతుడగు నా వాయుపుత్రుని జూచి సంతోషముతో నిట్లనెను. ఓ వానరశ్రేష్ఠుడా! నీళ్లయందును, అగ్నియందును, భూమియందును, ఆకాశమందును, స్వర్గమందును అనివారితమైన గమనము గలవాడవని నేనెరుగుదును. ఓ వాయునందనా! అసురులతో, గంధర్వులతో, దేవతలతో, సర్పములతో, మనుజులతో, పర్వతములతో, నదులతో గూడిన సకలమైన భూమియందు నీకు తెలియనిదున్నదా? ఓ పవమాననందనా! వేగమునందును, తేజస్సునందును, రాఘవమునందును, గమనమునందును, పరాక్రమము నందును నీవు, నీ తండ్రియైన వాయిదేవునితో సమానమైన వాడవు. ఓ వానరనాథా! నీయొక్క గొప్ప తేజస్సుచేత చూడగా ఈ భూమియందు నీకు సమానమైన జీవులు లేవు సుమా. బలమును, బుద్ధియును, తిరుగులేని పరాక్రమమును, గుణదోషము విచారించి తెలిసికొనగల శక్తియు, దేశకాలముల బట్టి నడచినట్టి ఆ ఆలోచనమును, ఓ నయజ్ఞుడా! నీ యందివియన్నియును స్థిరముగా నుండును. కావున హనుమంతా! రాఘవుని పత్నిని సాధించి మరల తీసుకొని వచ్చు నుపాయమును నీవే చేయవలయును అని సుగ్రీవుడు చెప్పగా విని రామచంద్రుడు ఇట్లాలోచించెను.

## శ్రీరాముడు హనుమంతుని చేతికి తన ముద్రికను ఇచ్చుట

ఈ కార్యభారమునంతయు వానర రాజు హనుమంతునియందు నుంచెను.

సుగ్రీవుడు ఇతడే కార్యసాధకుడని నిశ్చయించినాడు. ఈ వాయుపుత్రుడును నిశ్చయముగా కార్యమును సాధించగలడు. ఇదివరకు చేసిన గొప్ప కార్యముల వలన పేరును, నమ్మకమును సంపాదించి, రాజునకు మిగులనచ్చినట్టి బంటు గాన ఇతనివలన కార్యము సాధింపబడును. నిజము అని తలచి కార్యము సాధింపగల ఆ వానరశ్రేష్ఠుని జూచి, మనస్సునందు సంతుష్టి గలిగినవాడై రామభూపతి తన్ను ధన్యునిగా భావించి ఒక బంగారపుటుంగరమును తన పేరుగల దానిని తీసికొని ప్రీతితో వాయుపుత్రుని జూచి వానరేంద్రా! దీనిని తీసికొనుము. జానకికి దీనిని జూపించినచో ఆమె నిన్ను నాదు దూతవని నిర్భయముగా నమ్మును. వానరరాజుని యోగమును నీవే నెరవేర్చెదవని ఓ వీరశ్రేష్ఠుడా! నా మనస్సునందు తోచుచున్నది. నీ పరాక్రమ సంపదయును, నీ విఖ్యాతిగలిగిన బలమును, నీయత్నమును, సుగ్రీవుడు చెప్పిన సందేశమును చూడగా నీ వలెనే కార్యసిద్ధి నిక్కముగా కాగలదు. అతిబలముగల సింహవిక్రమా! తిరుగులేని పరాక్రమమును వహించి జానకీదేవి నెట్లు చూడనగునో అట్లు కార్యమును చేయుము. నేను నీ బలమునే నమ్మియున్న వాడనని రాముడు చెప్పగా, హనుమ ఆ యుంగరమును పుచ్చుకొని తలమీద నుంచుకొని, ప్రీతితో చేతులు జోడించి, పాదములు ముట్టి నమస్కరించి నిలబడగా.



# నలువది యైదవ సర్గము

## వానరులు సీతను వెదక బోవుట

ప్లవగులరాజైన సుగ్రీవుడు సర్వవానరులను జూచి రామకార్యము సిద్ధించుటకై మీరు వేగముగా వెళ్లి నేనుచెప్పిన భూభాగమంతయు వెదకుడనగా, ఆ వానరులు విడువని భక్తితో తమ యేలికయొక్క ఆజ్ఞను తలదాల్చి, పెద్దమిడతల దండువలె భూమినంతయు ఆక్రమించుచు తొందరగా బోయిరి. అందులో వానరసైన్యముతో వినతుడు తూర్పుగాను, పడమట దిక్కుగా సుషేణుడను వానరశ్రేష్ఠుడును ప్రీతితో వెళ్లిరి. శతవలి యుత్తరదిశగా సాగెను. దక్షిణ దిశగా వాయుపుత్రుడును, తారుడు, అంగదుడు వెంట రాగా ఆకాశమున తక్కిన వానర సమూహములు కూడ తన చుట్టునుండి కొల్చుచుండరాగా మబ్బులులేక శుద్ధముగానున్నదియు, నక్షత్రములతో గూడినదియునైన ఆకాశమున చంద్రునివలె వెలుగొందెను. వానరులను యథావిధిగా పంపించి సూర్యపుత్రుడు సంతోషమును పొందెను. సుఖమునొంది రామలక్ష్మణులు నంతట ప్రస్రవణ పర్వతమునందు ఒక నెల గడువుదాటు వఱకును గాచియుండిరి. అట్లు వెళ్లుచున్న వానరులలో ప్రతీయొక్కడును నేనే సీతను దెచ్చెదను, రావణుని బట్టి వేగముగా వధించెదనని గొప్ప గొప్ప మాటలతో పెద్దగా అరవదొడగెను.

అట్లు పెద్దగా అరచుచు, పండ్లు పటపట గొరుకుచు, దిక్కులన్నియు ప్రతిధ్వనించునట్లుగా కూయుచు, తోకలను నేలపై చరచుచు, సింహములవలె గర్జించుచు, పరువులు పెట్టుచు వానరులుండగా, నేనే రావణుని సంహరించి,

గొప్ప సైన్యమధ్యమందు బట్టుకొని, యణగ గొట్టి, జానకి భయమందుచు వణకుచుండగా నేనే తేగలను. క్రోతులారా! మీరందరిందే నిలువుడు అని యొక్కడు పల్కగా, ఇంకొక కపి చెట్లను త్రుంచెదను, కొండలను పడగొట్టెదను, సముద్రము నెండిపోవునట్లు చేసెదను, భూమిని వణకునట్లు చేసి జానకీ దేవిని నేనే తెచ్చెదను అనగా, ఒక క్రోతి నేను నూరుయోజనములను వేగముగా దాటెదననగా, వినుము నేను చివుక్కున అంతకంటె నెక్కువగా దాటగలనని యింకొక క్రోతి పల్కెను. భూమియందును, పాతాళముననను, భయంకరములైన కొండలందును, పెద్ద కోనలలోను, అంతులేని సముద్రములందును, అడ్డు లేకుండా అతివేగముగా వెళ్లెదనని యింకొక వనచరుడనెను. ఇట్లుగా ఒక్కొక్కడే తన గొప్ప వేగమును, బలమును తెలియజెప్పుచు గర్వముచే నుద్ధతుడై వానర రాజు సమీప ప్రదేశమున అధికమైన పౌరుషముతో పలికెను.



# నలువది యాఱవ సర్గము

## సుగ్రీవుడు తాను భూమండలమును జూచిన విధానమును చెప్పుట

అట్లు వానరులు ప్రయాణమై వెళ్లగా వానరరాజశ్రేష్ఠునితో రాముడిట్లనెను. సుగ్రీవా! ఈ సమస్త భూవలయము నీకెట్లు తెలిసినదో చెప్పమనగా భక్తితో సూర్యపుత్రుడు చెప్పదొడగెను. దుందుభి అను రాక్షసుడు దున్నపోతై రాగా, వాలి ఆతనిని మలయ పర్వతముదాక తరుమగా, అతడు భయముతో ఆ గుహబిలమును ప్రవేశింపగా, వాలి కూడ వానిని చంపుటకై అందు ప్రవేశించెను. నేను వినయముతో ఆ గుహద్వారం నందుంటిని. ఒక్క సంవత్సరము గడిచినది. నెత్తురు వరదలతో బిలమంతయు నిండెను. అంత నేను వాలి సంహరింపబడెనని చాల విచారపడి కొండవంటి ఒక బండరాతిని దీసికొనివచ్చి ఆ దైత్యుడివతలకి రాజాలక యముని జూడ వెడలుగాకయని తలంచి ఆ గుహవాకిట దూర్చితిని. అంతట నేను కిష్కింధకు వచ్చియన్న మరణించెనని నిశ్చయించి తారను, రుమను నా భార్యలుగా గ్రహించి, విస్తారమైన వానర రాజ్యభారమును బంధువులతో గలసి వహించితిని. తఱువాత వాలి ఆ రాక్షసుని బట్టి వధించి పట్టణమునకు రాగ, నేను సంతోషముతోను, గౌరవముతోను మ్రొక్కి, భయపడుచు రాజ్యమునిచ్చితిని. మదముచే ఆవరింపబడిన ఇంద్రియములు గలవాడై విరోధమును వహించి, దుర్మార్గుడై నన్నింటినుండి వెడలగొట్టి భరింపరాని కోపముతో చంపబూనెను. నా మంత్రులతో గలిసి, నేనును ఆలస్యము చేయక, రాత్రియుంబవళ్ళు వేగముగా పరువెత్తగా, గలహమును కోరుచున్నవాడై అతడును

రోషముతో ఆయాసమనకుండగా వెంటనంటెను. కొఱవితో చుట్టిన చక్రమువలెనున్న భూతలమునంతను గోవుపాదములవలె నొప్పగా, పాదములు వాచునట్లుగా పరువెత్తి, తిరిగితిరిగి అద్దమునందు చూచినట్లు విశదముగా జూచితిని. వాలి తరుముచుండగా తూర్పు దిక్కుగా వెళ్లి గొప్ప వృక్షములు, సరస్సులు, నదులు, పర్వతములు, ఉదయపర్వతము, క్షీరసముద్రము జూచి వెనుకకు మరలితిని. అంతట దక్షిణదిశగా వెళ్లి, వింధ్యాద్రియందున్న మనోహర వృక్షములను, చందన వనములను చూచితిని. ఆ దిక్కును విడచి, పడమటి దిక్కున కభిముఖముగా వెళ్లి, అస్తపర్వతము మొదలయిన వాటిని చూచితిని. ఓ శూరశ్రేష్ఠుడా! ఉత్తరదిక్కునకు వెళ్లి హిమవత్పర్వతమును, మేరుపర్వతమును, సముద్రమును జూచితిని. తలదాచుకొనుటకు జానెడు స్థలమైనను లేకపోయినది. అంతట హనుమ నుదారముతో నిట్లనెను. పూర్వము మతంగముని వాలియందు గలిగిన కోపముచే ఈ పర్వతమెక్కినచో వాని శిరము వ్రక్కలై వెంటనే కూలునని పలికెను. రాజచంద్రా! అది నాకిప్పుడు మనస్సునందు స్పష్టముగా తోచినది అని చెప్పగా విని, హనుమంతుడు చెప్పిన విధముగా ఆ పర్వతమునందుండి సుఖించితిని సుమా. ఇంద్రసమాన తేజస్సుగల రామా! ఈ పర్వత గుహకు, వాలి శాప భయముచే రాకుండెను. ఆ విధముగా నాడు నేను ప్రత్యక్షముగా ఈ భూవలయమునంతను చూచితినని చెప్పగా ..



# నలువది యేడవ సర్గము

## వినతాదులు సీతను గానక వచ్చుట

అచ్చట సీతను వెదకుటకై సూర్యపుత్రుడు ఆజ్ఞాపించినట్లు వానరశ్రేష్ఠులును వెళ్లి దుర్గములు, పర్వతములు, పట్టణములు, నదులు, సరస్సులు, ఆకాశము, పొదలు, అడవి ప్రదేశములు మిక్కిలి జాగ్రత్తతో పగళ్లంతయును వెదకి, రాత్రులందఱును ఒకచోట ఇష్టములైన ఫలములు గల చెట్లలో చేరుచుండిరి. వానిలో చూచి మంచి ఫలములను భుజించుచుండిరి. రాత్రులందరును నొక్క చోట చేరి, తాము జూచినవి ఒకరికొకరు చెప్పుకొనుచు ఆ తరువాత నిద్ర జెందుచుండిరి. సర్వ భూమండలము నీవిధముగా వెదకుచుండగా ఒక్క నెల గడచుటచే వానరులందఱు వెనుదిరిగిరి. తూర్పు దిక్కును వెదకి వినతుడు వ్యర్థ ప్రయత్నుడై వచ్చెను. కుబేరుని దిక్కును వెదకి సింహవిక్రముడైన ఆ శతవలియను నాతడును, పడమటి దిక్కును వేగముగా జూచి ఆ సుషేణుడును నెల గడచుటచే తిరిగి వచ్చిరి. వారు ఆ రామచంద్రునితో గూడియున్న సుగ్రీవుని జూచి ఈ విధముగా జెప్పిరి. అన్ని యూళ్లను, పర్వతములను, వనములను, గుహములను వెదకితిమి. అన్ని పల్లెలను, నదులను, మిఱ్ఱుపల్లములగు అన్ని ప్రదేశములను వెదకితిమి. కానీ యెందును సీతను గాంచమైతిమి. వనములందు భయంకరములైన మృగములను సంహరించితిమి. వానరేశ్వరా! సీతాసతి యందును లేదు. ఇది నిజము సుమా. ధీరుడును, గొప్ప బలము గలవాడును, వంశ దీపకుడును, వానరులలో రత్నము వంటివాడును, అగు వాయుపుత్రుడు రామవిభుని పత్నియగు సీతయుండెడి దక్షిణ దిక్కునకు సూరులగు వానరులతో గలసి వెళ్ళినాడు. ఏ తీరుననైనను భూపుత్రిని చూచియే వచ్చునని వాయుజాదు లకై ఎదురు చూచుచుండిరి.

# నలువది యెనిమిదవ సర్గము

## హనుమంతు డంగదాదులతో వింధ్య పర్వతమున సీతను వెదకుట

అట్లు బయలుదేరి వాయుపుత్రుడు, తారుడు, అంగదుడు మొదలైన క్రోతులసంఘములతో గూడి సూర్యపుత్రుడు చెప్పిన భూమండలమునందలి ప్రదేశములన్నియు చూచుటకై బయలుదేరి, అట్లు చాలా దూరము వెళ్లి, వింధ్య పర్వతములందలి అడవులను, కొండశిఖరములను, గొప్ప వృక్షములను, గుహములను, పర్వతములను, ఘోరములు భయంకరములునైన దుర్గ ప్రదేశములను ఓపికతో అన్ని దిక్కులను వెదకెను. కానీ ఎచ్చటను భూపుత్రి లేదయ్యెను. తిరిగి వానరులు ధైర్యముతో, ఏకాగ్రతతో, గుహల సమూహములతో నిండి, ప్రవేశింపరాని దుస్సహమైన ప్రదేశములను గూడ శ్రమపడి వెదకుచు, అందందుండు మధుర ఫలాదులను తినుచూ సాగుచుండిరి. జలశూన్యమై, జనరహితమై, ప్రవేశింపరానిదై, వివిధ మృగములు చేయు గర్జనలతో నిండిన ఆ వనమును దప్ప, తక్కిన అట్టి వనముల ననేకములను వెదకిరి. భయ రహితులైన వానరులు, ఫలములు, పువ్వులు, ఆకులు లేని చెట్లుగలదియు, నీళ్లులేని యేఱులు గలదియు, దుంపలైనను దొరకనిదియు, మృగములు, పెద్దపులులు, దున్నలు, అందమైన వనములందుండు పక్షులులేక పాడుపడి యున్నట్లున్నదియు నగు ఇంకొక్క ప్రదేశమును జూచిరి. అందు వృక్షములు గాని, పొదలు గాని, యోషధులు గాని, ఒక్క తీగె కాని లేవు. అచ్చట అందమైన వికసించిన పద్మములుగల పద్మలతలు తుమ్మెదలకు కనింపవు. సత్యవాదియు, తపోధనులలో నుత్తమముడైన కండుడనెడు ఋషి తన పుత్రుడు పదునారు

వత్సరముల వాడు. ఆ అరణ్యమునందు తప్పిపోయి కానరాక నశించిన కారణముచేత దాని నెవ్వరును ప్రవేశింపరాకుండునదినగు, మృగములు, పక్షులు లేకుండునదిగను, జనసంచారం లేనిదిగను, ఏమియు నాధారము లేనిదిగను, అధికమైన కోపముతో శపించుటచే ఇట్టి గతి పట్టెను. ఆ పర్వత గుహలలోను, ఆ నదులందును, ఆ అడవులందును, వానరసంఘములు జానకిని గాని, సీతాపహర్తయైన రావణుని గాని కానక, అందే వెదకుచుండగా భయంకరముగా తీగల గుంపులచే కప్పబడిన శరీరము గలవాడును, క్రోర్యముతో గూడిన వాడును, దేవతలకైన భయపడని వాడును అగు ఒక్క రాక్షసుని చూచి ధైర్యముతో వానరులందఱు గట్టి మనస్సులుగలవారై నిలబడగా, వారలను గని, ఆ దానవుడు పిడికిళ్లు బిగించి చచ్చితిరి, పొండనుచు పైకురకగా ఆ రక్కసుడే దశముఖుడని మనస్సునందు తలంచి అంగదుడు వాని నఱచేతితో చరవగా, వాడు నెత్తురు గ్రక్కి కొండ కూలినట్లు నేలగూలెను. అంతట కోతులన్నియును ధైర్యముతో ఆ ప్రదేశమంతయు వెదకి, ఇంకొక యడవిని గూడ వెదకి, అచ్చట గూడ జానకిని చూడలేక దిగులుచెందిన వారై, అందఱు నొక్కచోట చేరి, యొక చెట్టు నొద్దకు వచ్చి, దైన్యముతో గూడిన మనస్సులు గలవారై, కూర్చుండిరి.



# నలువది తొమ్మిదవ సర్గము

## అంగదుడు కపుల నుత్సాహపరచుట

అప్పుడు గొప్ప తెలివిగలవాడును, మిక్కిలి అలసట నొందినవాడును అయిన అంగదుడు కపులందఱను ఓదార్చుటకై శ్రమను దొలగించు మాటలతో మెల్లగా నిట్లనెను. దుర్గమములైన చోటులెల్ల చూచితిమి. భయంకరమైన చరియలుగల పర్వతములను జూచితిమి. గుహలను జూచితిమి. గొప్ప నదులను, వాన సమూహములను జూచితిమి. దేవకన్యకను బోలిన సీతయైనను, ఆ జానకిని తీసికొని వెళ్లిన దేవతావిరోధియైన దశకంఠుడైనను కాన రాలేదు. మనమిట్లు వచ్చి చాల కాలమైనది. గొప్ప చండశాసనుడు గదా సూర్యపుత్రుడు. కాన మనమందరమును గుంపులుగా గూడి భూపుత్రిని వెదకవలయును. అలసత్వమును, నిద్రయు, దుఃఖమును దూరముగా త్రోసి ఆ పద్మగంధిని మనము వెదకవలెను. ఉత్సాహమును, దుఃఖమును వీడుము. అదే కార్యసిద్ధిని కలిగించును. వెళ్ళుటకే త్రోవయు లేకున్నను ఈ వనసీమయందు మనము జానకికై వెదకవలెను. మనస్సునందు విసుగు లేకుండ, పట్టువదలక పనిచేసినచో అవశ్యముగా ఫలము లభించును. ఇంతసేపు సంతాపము చెందుటయును, కన్నులను మూసికొని కాలమును గడపుటయు ఇంక చాలును. ఇది మనకు తగిన పని కాదు. సూర్యపుత్రుడు తీవ్రముగా దండించువాడని తెలిసికొన లేదా? మహాత్ముడైన రామునకును, భాస్కరపుత్రునకును మనము భయపడవలయును గదా. ఇది మంచి పనియని చెప్పితిని.

వానరులారా! మీకిష్టమైనచో ఆ విధముగా చేయుడు. లేనిచో మనకు

క్షేమము గలుగునట్టి పనిని మీరెవ్వరైనను చెప్పుడనగా, అంగదుని వాక్యములను విని దప్పికగొని, అలసియున్న గంధమాదుడిట్లనెను. వానరులారా! అంగదుని వాక్యములు తగినవియు, హితకరములై మీకు మేలు సమకూర్చును గాన మీరలు దాని ననుసరించి సీతను దుర్గములందును, పర్వతములందును, గుహలందును వెదకుము. బయలుదేరుడు. అనగా వేగముగా వానరులందఱును దక్షిణ దిశయందు సీతను వెదకుటకై లేచిరి. అట్లు వెళ్లుచు వారు శరత్కాలపు మేఘమువంటిదియు, గుహలు గలదియు, సాటిలేని శిఖరములు గలదియు నయిన రజతాద్రినెక్కి రమ్యమైన కోద్రవనమును, ఏడాకుల అరటి వనమును, సమస్తమును వెదకి, గొప్ప పరాక్రమము గలిగిన ఆ వానరులు గుహలతో గూడిన ఆ పర్వతమంతయు వెదకి శ్రమ చెందినవారై, శక్తిలేనివారై, బడలిక చెంది పర్వతమున దిగి, సమతులమున నొక చెట్టుమొదట నొక్కింత తడవు నిలిచి, కొంచెము శ్రమ తగ్గగానే వానరులు మరల పూనికతో ఆ వింధ్యపర్వతపు నాల్గుప్రక్కలను వెదక జూచిరి.



# ఏబదియవ సర్గము

## హనుమదాదులు ఋక్షబిలమును ప్రవేశించుట

హనుమంతుడు, తారాపుత్రుడైన అంగదుడు, తారుడు వెంటరాగా సింహములు, పెద్దపులులు నిండియున్న నదులు, శిలలు, సెలయేళ్ళు వెదకి, కొండపై నైరుతి దిశయందు కపులతో నుండగా ఆ గడువు దాటిపోయెను. అంత హనుమంతుడు, మైందుడు, ద్వివిదుడు, అంగదుడు, గజుడు, గవయుడు, సుషేణుడు, గవాక్షుడు, శరభుడు, గంధమాదనుడు అనువారిని ఒకరికొకరు సమీపమున నుండునట్లుగా నిల్పికొని క్రమముగా యముని దిక్కైన దక్షిణ దిశయందు పర్వతములతో నిండి యున్న దేశములన్నిటిని వెదకి వెదకి ఆకలి దప్పులచే తపించి సొమ్మసిల్లిపోవుచు, నీటికై వెదకుచు, తీగలచే చుట్టబడి, దానవులచే రక్షింపబడు ఋక్షబిలమనెడు గొప్ప బిలమును వృక్షసంచారులు చూచిరి. ఆ బిలమునుండి తడిసిన రెక్కలు గలవియు, పద్మపరాగములచే నెఱ్ఱవడిన శరీరములు గలవియు అయిన క్రౌంచములు, హంసలు, సారసములు, చక్రవాకములు వచ్చుటను జూచి, చాల సువాసన గలదై, ప్రవేశించుటకు వీలులేనిదైయుండుటచే ఆ వీరులందరు విస్మయము పొందిన మనస్సులు గలవారైరి. అనేక మృగ సంకీర్ణమును, రాక్షస నివాసముగా నుండదగినదియు, అతిభయము గలిగించునదియునైన ఆ బిలమును జూచి వానరులు తమ మనస్సులందు సంతోషములేనివారై మతిపోయిన వారైరి. అడవులందు దిరుగుటలో మెళకువ గలవాడైన హనుమంతుడప్పుడిట్లనెను “దక్షిణమునగల

దేశములన్నింటిని, అడవులన్నింటిని వెదకితినిగాని భూపుత్రి యెందును కానరాలేదు. అందరము నెక్కువగా అలసియున్నాము. ఈ బిలమునుండి ఇవిగో నీటిచే తడిసిన చక్రవాకములు, క్రౌంచములు, హంసలు, బెగ్గురు పక్షులు వచ్చుచున్నవి. ఇది సత్యము. ఈ బిలమందు నీళ్లుగలిగిన బావియో, చెఱువో ఉండియుండును. ఈ బిలము వాకిట పచ్చని చెట్లును గలవు కాన ప్రవేశింతము" అని చెప్పగా, వానరులు చంద్రసూర్యులు లేనిదియు, గొప్ప చీకటి గలిగినదియు, భయముచే గగుర్పాటు గలగించునదియునగు దానిని ధైర్యము వహించి ప్రవేశించుచుండగా మృగములను, పక్షులను, పులులను, సింహములను ఆశ్చర్యముతో చూచిరి. వాటి తేజస్సుచే తమ కన్నులు శౌర్యమును మొక్కవోగా చూచిరి. తమ యొక్క వాయు వేగమునిష్ఫలమగుచున్నను, భయంకరమైన వివిధ వృక్షములతో నిండియున్న సొరంగమునందు ఒక వానరుని చేతినింకొక వానరుడు పట్టుకుని వేగముగా వెళ్లుచు ఆకలిదప్పుల చేతను, అలసట చేతను మతులు లేని వారై, జీవితముల మీద ఆశలను విడచినవారై, బలము నశించి నీటిని కోరినవారై అట్లొక్క యోజనము దూరము వెళ్లి, వెలుగు గలిగి మనోహరమైయున్న యొక ప్రదేశమును చూచిరి.

అచ్చట అగ్నివంటి కాంతి గలవియు, బంగారు వర్ణము గలవియునైన కర్ణికార, సాల, తాల, తమాల, చంపకములును, నాగ, వంజుల, కకుభ, పున్నాగ వృక్షములును, రజత మయములైన పుష్ప గుచ్ఛములు, నెఱ్ఱని చిగురులు గల లతలును, సుకుమారమైన బంగారు భూషణములచే అలంకరింప బడినవియు, బాలసూర్యుని వంటివియునైన వైఢూర్య మయములైన వేదికలును, సహజ కాంతితో నొప్పుచున్న బంగారపు చెట్లును, ఉదయ సూర్యుల వలెనున్న బంగారు పద్మములు గలిగి, పక్షులతో గూడినవై, నీలవైఢూర్య పద్మలతలతో

గూడి, బంగారు చేపలును, తాబేళ్లను అధికముగా గలిగి, నిర్మలమైన జలములతో నిండి ప్రకాశించుచున్న తామరల కొలనులును ఉండుటను ప్రీతితో చూచిరి. ముత్యపు జాలరులును, అందమైన మేలి బంగరు కిటికీలును గలిగి మనస్సులకు సంతోషమును గలిగించునట్లుగా వెండితోను, బంగారముతోను, మణులతోను నున్న యిండ్లను, పగడములతో పోటీపడునట్లుగా పూచిన వృక్షములును, బంగారు తుమ్మెదలును, మణులు, బంగారములతో చేయబడిన శయ్యాసనములుగల అందమైన పల్లకీలను వానరులు చూచిరి. బంగారు, వెండి, కంచు పాత్రల సమూహములును, అగరు, చందనము మొదలైన పదార్థములను, ఇంపైన భక్ష్యములు, దుంపలు, ఫలములు, పానీయములు, తీయనైన తేనెలును, దివ్యమైన వస్త్రములును, గొప్ప అందమైన కంబళ్లను, కృష్ణాజినము మొదలైన ఆసనములును అచ్చటచ్చట అగ్నిహోత్రునితో సమానముగా ప్రకాశించుచున్న బంగారురాసులును వానరులు చూచిరి. తిరిగి అచ్చటచ్చట వెదకుచు ఆ వీరులు నారవస్త్రము, కృష్ణాజీనాంబరము ధరించిన యొక స్త్రీని తాపసీ వేషమున నున్నదానిని చూచి భయము చెందిన మనస్సు గలవారై ఆశ్చర్యముతో అందరు నిలిచిరి.



# ఏబది యొకటవ సర్గము

## హనుమంతుడు స్వయంప్రభతో సంభాషించుట

అంత హనుమంతుడా ముదుసలి స్త్రీని చూచి చేతులు జోడించి భయ భక్తులతో నిట్లనెను. అమ్మ! నీవెవ్వతవు? ఈ బిలమును, ఈ బంగారమును, మణిభవనములును యెవ్వరివో చెప్పుము, అని మరల నాతాపసితో నిట్లనెను. గొప్ప ఆకలి చేతను, దాహము చేతను బాధచెంది మేమందఱము గొప్ప చీకటిలో కన్నులు కనబడకున్నను భూమినున్న ఈ సొరంగమును జూచి యిందు ప్రవేశించి దీనియందున్న అద్భుతములయిన పెక్కు పదార్థములను చూచి, కడునాశ్చర్యముతో దిగ్భ్రాంతి చెంది, ఏమి చేయవలెనను చింతతో మేమెల్లరము విచారించుచున్నాము. ఉదయసూర్య సన్నిభములయిన వృక్షములును, ఈ పవిత్రమైన భక్ష్యములును, ఈ ఫలములును, ఈ విమానములును, ఈ వెండితో నిర్మింపబడిన గృహములును, మణులతో నిండియున్న కిటికీలును, ద్వారసమూహములును, ఫలములతోను, పుష్పములతోను, సువాసనలనీనుచున్న ఈ బంగారు వృక్షములును, స్వచ్ఛమైన నీళ్లతోను, బంగారు పద్మములతోను గూడియున్న ఈ కొలనులును యెవ్వని తపోమహిమచే గలిగెను? బంగారు చేపలును, తాబేళ్ళ గుంపులును కలసి సంచరించుచున్నవి, యిది యెట్లు కలిగెనో చెప్పుమమ్మా. నిన్ను గూర్చియు, నీ మహిమను గూర్చియు, ఇది యంతయు నెవ్వరి నిరుపమానమైన తపస్సు చేత కలిగెనో దానిని గూర్చియు దయతో చెప్పుమమ్మాయని.

## స్వయంప్రభ ఋక్షబిల వృత్తాంతమును హనుమకు చెప్పుట

ఈ విధముగా వాయుపుత్రుడడుగగా, సర్వభూతములకు మేలు కోరునట్టిదదియు, మంచి నిష్ఠ కలిగినదియు నగు ఆమె యిట్లు చెప్పెను. మయుడనెడు రాక్షస రాజు, మాయలు నేర్చిన మాయలాడు మాయచే ఈ బంగారు వనమును నిర్మించెను (మాయ = అద్భుత శక్తి). రమ్యమైన యీ స్వర్ణగృహమును నిర్మించినవాడు, పూర్వము దనుజులకు విశ్వకర్మయైన రాక్షస రాజు. అతడు వెయ్యియేండ్లు వనములో అధిక తపము చేసి శుక్రాచార్యునిచే తయారుచేయబడిన శిల్ప విద్యను బ్రహ్మచే వరముగా పుచ్చుకొనెను. ఆ సాటిలేని మహిమచే కోర్కెలన్నియు దీరగా అందమైన వనమును కల్పించి, యందు నివసించుచుండ దేవతలరాజు హేమయను నప్సరసయందాసక్తుడై ఆమెతో సుఖించుచున్న మయుని, యుద్ధమందు వజ్రాయుధముచేత సంహరించెను సుమా. మయుడు హేమకి బంగారు గృహమును, ఈ వనమును, ఇందున్న సుఖములను నొసగెను. నృత్తమునందును, గానమునందును, నేర్పుగల ఆ హేమ నాయొక్క ప్రియ స్నేహితురాలు. ఈ వనవాటి ఆమెదే. నేనామెచే వరము పొందినదాననై దీనిని కాపాడుచుందును. నేను మేరుసావర్ణి యొక్క పుత్రికను. నా పేరు స్వయంప్రభ. ఓ వనచారీ! మీరెవ్వరు? పర్వతములందును, గొప్ప అడవులందును, తిరుగుటెందులకు? ఎవరి కొరకు? ఎట్లీ బిలమును చూచితిరి? ఈ దుంపలను, పండ్లను, ఈ గొప్ప పదార్థములను, ఈ పానీయములను, ఇష్టము తీరునట్లుగా ఆహారముగా తీసుకొనిన తరువాత మీ చరిత్రను చెప్పుటను ప్రారంభింపుడు.

# ఏబది రెండవ సర్గము

## స్వయంప్రభ హనుమంతుని కపుల వృత్తాంతమడుగుట

అని తిరిగి ఆ తాపసి యిట్లు చెప్పెను. వనచరులారా! మీరు ఫలములను సాపడుటచే అలసట తీరిన తరువాత నేను వినదగిన మీ చరిత్రను వినిపింపుడనగా ఉన్నది యున్నట్లుగా వాయుపుత్రుడు చెప్పదొడగెను. మహేంద్రుడు, వరుణుడు సాటిగా గలవాడును, భూపతియు, దశరథుని పుత్రుడును, మంచి నడవడి గలవాడును అగు రామచంద్రుడు తండ్రి యాజ్ఞచే తమ్ముడగు లక్ష్మణుడును, తన భార్యయగు విదేహరాజపుత్రి సీతయు భక్తి తో తన్ను సేవించుచుండగా వెడలి, దండకాటవి యందు సంచరించుచుండగా ఆ రాముని భార్యను బలాత్కారముగా దొంగిలించి రావణుడను పేరుగల రాక్షస రాజు తీసుకుని పోయెను. ఆ రాముని స్నేహితుడు సుగ్రీవుడను వానర రాజు రావణుని, సీతను వెదకుటకై మమ్ము దక్షిణ దిక్కుకు పంపగా ఇట్లు వచ్చితిమి. దక్షిణ దిక్కునంతను వెదకి ఆకలి దప్పులు మమ్ము బాధించుటచే, బలమునూ క్షీణించి యొక చెట్టు నీడ నుండి వ్యథచెందుచు అచ్చట ముఖములందు కాంతి తరుగగా ధ్యానపరాయణులమై చాలా సేపుయుండియు, చింతాసముద్రము యొక్క అంతమును పొందజాలక అటునిటు వెదకుచు తిరుగుచుండగా, నొక చోట చీకటులతో నిండి తీగెలతో, చెట్లతో కప్పబడినదైయున్న ఈ గొప్ప బిలమును చూచితిమి. హంసలు మొదలైన పక్షులు నీటితో తడిసి, ఈ బిలమునుండి వచ్చుటను చూచి నేను మంచిది, యీ బిలములో మనమందఱము ప్రవేశించుదమని యనగా, వానరులు మొదట

అనుమానించినా పిదప సరేయని చిమ్మచీకటి గల దీనియందు ఒకరిచేతినొకరు ఆధారముగా గొని, వచ్చి, నీవు నివసించునట్టి యీ చోటకు చేరితిమి. ఇది మేము పూనిన కార్యము. అధికమైన ఆకలిదప్పులతోను, శ్రమ చేతను మా ప్రాణములు పోయెడు సమయమున నీ పుణ్యముచే దుంపలను, సాటిలేని ఫలములను తినుటచే శ్రమ తగ్గినది. మా ప్రాణములు తిరిగి వచ్చినవి. మంచి గుణవంతురాలా! మా వానర నాథులు తిరిగి నీకు మేలు చేయగోరుచున్నారు. నీకేదైనా చేయవలసిన పనియున్నచో చెప్పుము, ఇపుడే చేసెదమనగా వానరులను జూచి ప్రీతితో అన్నియు తెలిసిన స్వయంప్రభ యిట్లనెను. మీరు చేప్పిన మాటలు మాకు మెప్పు కలిగించినవి. ధర్మము తప్పక నడచునట్టి దాననుగాన మీరు చేయదగిన కార్యమేదియును లేదని చెప్పగా, హనుమంతుడామెతో నిట్లనెను.



# ఏబది మూడవ సర్గము

## స్వయంప్రభ కపులను బిలమునుండి వెడలించుట

తాపసీ! వానరనాథుడు విధించిన గడువు సమయము మేమీ వృక్ష బిలమునందు తిరుగుచుండగానే గడచిపోయినది. ఓ సాధ్వీ! మమ్మీబిలము నుండి భూమి మీదకు చేర్పుమీ గడువు తీరినది గనుక అందరమూ గతాయువులమే. నీ దయ వీక్షణములను ప్రసరింపజేసి, నిన్నాశ్రయించిన యందరిని కాపాడుము. ఓ ధర్మసంచారిణీ! మేము చేయవలసిన కార్యమెంతయోయుండియు దుర్గమమైన యీ బిలమునందు చిక్కువడిన



కారణముచే ఏమియూ చేయలేనివారలమైతిమి. ఇది నిజము సుమా. అని చెప్పగా, ఆమె, దీనిని ప్రవేశించియు శరీరములతో వెళ్లుటనునది యసాధ్యమని తలంతును. కాన నా నియమమంతమైన తపస్సుచే మిమ్ము వెలువరించెదను. కన్నులను మూసుకొనుడు. కన్నులు మూసుకొనిన వారై వెళ్ళుట అశక్యము అని చెప్పగా, అందరు వానరులును చేతులతో ఆ బిలము దాటు కోరికతో కనులను మూసుకొనిరి. చేతులతో కన్నులను గప్పుకొన్న వానరులందఱును ఆ నియమశీలము గల తాపసి నిమిషములో బిలమునుండి బైటకు చేర్చి, వారలనోదార్చి, ఇది వింధ్య పర్వతము, ఇదియే ప్రస్రవణ పర్వతము. వనచరులారా! ఇదిగో ఇదియే సముద్రము. మీకందరుకును శుభము కలుగు గాక. ఇక నేను మఱలి భవనమునకు వెళ్లెదనని స్వయంప్రభ తన భవనమునకు వెళ్లెను. గొప్ప అలలు కలిగి, పారము లేనిదై, గొప్ప ధ్వనులు చేయునదై, వరుణ దేవుని నివాసమై, భయంకరమైయున్న సాగరమును వానరవీరులు విస్మయముతో అచ్చట చూచిరి.

## అంగదుడు గడువు మీరినందులకు విచార పడుట

వికసించిన పుష్పములతో భారముగానున్న చెట్లతో నిండియున్న వింధ్య పర్వత పాదప్రదేశమున వానరులందఱు గూర్చుండి, అచట పువ్వులతో నిండిన తీగలు గల అందమైన చెట్లు చూచి, వసంత వేళ వచ్చెనని భయము చెందినవారై గడువు మీరిపోయెనని విచారంతో నేలవ్రాలిరి. అప్పుడు సింహపరాక్రముడు, ఎద్దుమూపురముల వంటి భుజాగ్రములు గలవాడు, సాటిలేని బలిసిన పెద్ద బాహువులు గలవాడు, ప్రాజ్ఞుడునైన అంగదుడు, పెద్దవారైన వానరులయొద్ద చేరి, వారినోదార్చి, హితము తోచునట్లుగా నిట్లనెను. ఇందఱమును వానర రాజునాజ్ఞచే బయలుదేరితిమి. ఆ బిలాములోపలనే ఒక మాసము గడచి పోయినది. ఎవ్వరమును తెలిసికొనలేమైతిమి. మనమీపనికై ఆశ్వయుజ

మాసమున ప్రారంభించితిమి. కాలము జాల గడచిపోయినది. నీతికోవిదులయిన మీరలింకమీద చేయవలసిన కార్యము చెప్పుడు. మీరలు నమ్మిన బంట్లు. తమ రాజు హితమును గోరి నడచు వారలు. సమస్తమైన కార్యములు నెరవేర్చుట యందు నేర్పుగల వారలు. ప్రఖ్యాతి చెందిన పరాక్రమము గల వారలు గదా. ఈ విధముగా రాజుయొక్క ఆజ్ఞచే అందరును రాముని కార్యమును చేయుటకు బయలుదేరి నన్ను మీకు పురస్సరునిగా చేసితిరి. ఇంత చేసియు కృతార్థులము కాకుండ తిరిగివెళ్ళినచో తప్పక సంహరింపబడుదుము. శంకింప వలసిన పనిలేదు. సూర్యపుత్రుని సందేశమును చేయకుండ హాయిగానెవ్వడు జీవింప గలుగునో చెప్పుడు. నియమిత కాలము దాటిపోయినది. ఇప్పుడు మనము చింతించి చేయగలిగినదేదియు లేదు. ఇక ప్రాయోపవేశము ఒక్కటియే చేయదగిన పనియని మనస్సునందు తోచుచున్నది.

**అంగదుడు భేదోపాయోక్తులు వచించుట**

సూర్యపుత్రుడో, స్వాభావికముగనే మిక్కిలి క్రోధము గలవాడు. తానే యిప్పుడు రాజుగూడ అయినాడుగద. రామచంద్రుని భార్యయైన సీతాదేవి సంగతిని తెలిసికొనకుండా వెళ్ళినచో మన యపరాధమును తలంచి హింసించునేగాని ఎంతమాత్రమును క్షమింపడు. కాన ఇచ్చుటనే జీవములను విడచుట యుక్తమైన పనిగా దోచుచున్నది. మనమందఱమును తిరిగి వెళ్ళినను ధనము, భార్యలు, పుత్రులు, ఇండ్లు మొదలైన వానినన్నిటిని విడిచిపోవునట్లు చంపివేయును. కాన ఘోరముగా అచ్చటికి వెళ్ళి చచ్చుట కంటెను, యిందే చనిపోవుట మేలగును. యువరాజు పదవిని నాకిచ్చినవాడు, సూర్యపుత్రుడు కాదు. సద్గుణ భద్రుడైన రామభద్రుడు. కాన పూర్వపు విరోధమును దలంచి ఇప్పుడు సమయము దొరకుటచే వానరరాజు నన్ను చంపివేయును. జీవించియున్న కాలములో కలిగిన నా దుఃఖమును నామిత్రులేల చూడవలెను? కాన పుణ్యప్రదమైన సముద్రతీరమునందే ప్రాణములను విడిచెదను అని

తారాపుత్రుడు పలికిన మాటలను విని వానరశ్రేష్ఠులు దుఃఖము చేత తపించుచు మనస్సునందు దయ వ్యాపింపగా అతనితో నిట్లనెను.

**కపులంగదుని వాక్యముల నామోదించుట**

సూర్యసుతుడు స్వభావము చేతనే కడు కోపము గలవాడు. రామచంద్రుడో, తన ప్రియురాలిమీది అనురాగముచే తపించుచున్నవాడు. కాన సీతను చూడకుండా మనము వెళ్ళినచో ఇది సిద్ధము సుమా. రామచంద్రుని సంతృప్తికై భాస్కరపుత్రుడవశ్యముగా ఇందరను క్రూరుడై చంపును సుమీ. అపరాధులైన వారలు రాజును చేరబోరాదు. సీతను వెదకి, దొరికినచో వానరరాజును చూడబోదము. లేకున్నచో యముని పట్టణమునకు బోదము. అనగా భయముతో నిండిన ఆ వానరుల మాటలను ఆలకించి తారుడను వాడిట్లనెను. ఎందులకు మీరందరిట్టి మహావ్యథ పొందెదరు? ఈ బిలమందు నివసింతము. ఇయ్యది మిక్కిలి చొరరానిది. భోజ్యములయిన పండ్లు గల వృక్షములతో, పావనములైన పానీయములతో గూడినది. అందుండినచో భయమను వార్తయే వినిపించదు. ఎట్లు చూచినను మనమందుంటిమేని, ఇంద్రుడైన నగుగాక, వానరరాజైన నగుగాక, వాసవ సమానుడైన కౌసల్యాతనయుడైన నగుగాక, మనలనేమియు చేయలేరు సుమా, వానరులారా! అని అంగదుని వాక్యములకనుగుణములైన తారుని మాటలను విని, వానరులందరూ మనకు కీడుగలుగని విధమేదియో ఆ విధముగనే చేయదగునని పల్కగా.



# ఏబది నాలుగవ సర్గము

## హనుమంతు డంగదుని సమాధాన పరచుట

తారానందనుడైన అంగదునితో చంద్రునివంటి తేజము గల తారుడిట్లు చెప్పుచుండగా, అంగదునిచే వానర రాజ్యము హరింపబడునని హనుమంతుడు తలంచెను. అంగదునకు పదునాలుగు గుణములను, ఎనిమిది యంగములు గలిగిన శుద్ధమైన తెలివితేటలను, నాలుగు విధములైన బలసంపదయు గలవని, వాయుపుత్రుడు వాలిపుత్రుని నెఱిగెను. శుక్ల పక్షము మొదటిదినములందలి కాంతిచే ప్రకాశించు చంద్రుడో యనునట్లు బలము, విక్రమము, తేజములతో వృద్ధి పొందుచున్న వాడును, బలము నందు తండ్రియగు వాలితో సమానుడును, బుద్ధి యందు బృహస్పతియు, శుక్రనీతిని వినునట్టి యింద్రుని వలె తారుని మాటలు వినుటలో శ్రద్ధ చూపుతున్నవాడును, సర్వశాస్త్ర ప్రావీణ్యము గలవాడును, స్వామికార్యమున అలసియున్న వాడైన అంగదుని నోదార్పదలంచినవాడై, హనుమంతుడు వానరులలో వారలలో వారికి, ఉపాయములన్నిటిలో మూడవదైన ఉపాయమును ఉపయోగించి (భేదోపాయము), భేదమును గలుగజేసి, వారిలోవారు భేదించి పలుకుచుండగా కోపోపాయముతో గూడినవాడై వాయునందనుడు, కోపోద్దీపితుడై, భీషములైన వాక్యములతో అంగదునకు భీతి కలుగునట్లుగా మాట్లాడి తిరిగి ఆతనితో నిట్లనెను. తారానందనా! నీవు నీ తండ్రికంటె యుద్ధక్రీడలందు నేర్పుగలవాడవు. అంతేగాక భారమైన వానర రాజ్యమునంతను తండ్రివలె భరింపగలవాడవు. కాని బాగుగా ఆలోచింపుము. ఈ వానరులు స్థిరచిత్తము లేనివారలు. తాము భార్యాపుత్రాదులైన

ఆత్మీయులను విడచి, యెల్లప్పుడును నిన్నెట్లు ఇచ్చట కొల్చుచుండెదరు? ఎదుటనే చెప్పుచున్నాను వినుము. సుహోత్రుడును, జాంబవంతుడును, నీలుడును యెట్లు సూర్యపుత్రుని వీడకుండుట స్పష్టమో అట్లే నేనును సుగ్రీవుని వదలను. సామదాన గుణవర్గముచేత గాని, దండపద్ధతితో లొంగదీసికొని గాని, వీరలను ఏ పద్ధతిచేతనైన గాని కూర్చుకొనజాలవు సుమా. బలహీనులతో విరోధము పెట్టుకొని బలవంతుడు బ్రదుకగలడు గాని, ఓ వాలిపుత్రా! భూమియందు బ్రదుకవలెనను కోరికగలిగిన బలహీనుడు, బలవంతునితో విరోధము పెట్టుకొనుట తగునా? ఈ బిలములో భయములేని విధముగా నివసింపవచ్చునని చెప్పుచుండగానిప్పుడు వింటిని.

ఇది లక్ష్మణుని ఘోరమైన బాణములకొక లెక్కయా? ఎప్పుడో కూల్చడా? ఇంద్రుడు వజ్రాయుధముచే కొలది పనిని మాత్రమే చేసెను. లక్ష్మణుడు తాను తన బాణపరంపరలను గుప్పించి, దానిని జొప్పనువలె చెక్కి వేయకుండునా? వజ్రాయుధముతో, పిడుగులతో సమానమైనవియు, కులపర్వతములనైన చీల్చగలవియునైన, గొప్ప పదునైన బాణములు ఆ రఘుకుల దీపకుడైన సుమిత్రానందనుని యొద్ద చాల యున్నవి సుమా. బలముగల వాడనని పినతండ్రితో విరోధము బూని, యీ బిలమందుంటివేమి? యీ వానరు లందఱును ఒక్క నిశ్చయముగలవారై వెడలిపోవుదురు సుమా. విమలమైన బుద్ధిగలవాడా! ఆలుబిడ్డలను దలచుచు, ఆకలితో ప్రతిదినము బాధనొందుచు, దుఃఖము గలిగించు కఠినములైన శయ్యలందు బాధలను పొందుచు, వాలిపుత్రా! నిన్నీ కపులు వదలెదరు సుమా. నీ శ్రేయస్సు కోరునట్టి బంధువులును, స్నేహితులును, నిన్ను విడచి వెళ్లగా, అధికమైన భయమును పొందినవాడవై, మతిచెడి, గాలిచేత వణకు గడ్డిపోచకంటెను తేలికైన వాడవై వణకెదవు. స్వామికార్యవిముఖుడవైయున్న నిన్ను భయంకరమును, జయింపరానిదియు, వేగముగలిగినదైన సౌమిత్రి యొక్క శరసమూహము ఏమిటికి వధింపకుండునో

ఆలోచింపుము. తారానందనా! వినీతుడవై మావెంబడి రమ్ము. నీ పినతండ్రి వంశక్రమము ననుసరించి నిన్ను రాజ్యమునందు నిల్పును. అతడు నీకు హితము కోరువాడును, ధర్మముననుసరించు వాడును సుమా. దృఢమైన నియమము గలవాడు, పవిత్రమైనవాడు, సత్యమైన ప్రతిజ్ఞ గలవాడు నగుటచే సూర్య నందనుడు నిన్నొప్పుకొందును. నాశనము చేయడు సుమా. నన్ను నమ్ముము. అతడు నీ తల్లియైన తారయందు మిగుల ప్రీతిగలవాడు. ఆమె నిమిత్తముగా ప్రాణములతోనున్నాడు. సంతానములేనివాడు కాన, యువరాజా! అచ్చటికి వెళ్ళుట తగిన పని సుమా.



# ఏబది యైదవ సర్గము

## అంగదుడు సుగ్రీవుని గుణములను నిందించుట

అని చెప్పగా, వినయయుక్తము, రాజభక్తి యుక్తము, ధర్మయుక్తమునైన వాయుపుత్రుని మాటలను విని వాలిపుత్రుడు తన మనస్సున నున్నదంతయు తెల్పుచు ఆ వానరశ్రేష్ఠునితో నిట్లనెను. స్థైర్యము, ఆత్మమానసిక పరిశుద్ధత, త్రికరణశుద్ధి, అక్రూరత్వము, ధైర్యము, పరాక్రమము ఆ వానరరాజునందు లేకుండుట వింతయా? పూజ్యురాలును, ప్రాణములతోనున్న అన్నగారి భార్యయు, తల్లితో సమానురాలును అగు స్త్రీని, ఇది మంచిపని గాదని యంచక తాను గ్రహించువాడెంతటి నీచుడోగదా. బైటనుండి విరోధులు తాకినచో నీవెదుర్కొని నిలుపుమని యన్న నిల్పగా బిలముఖమును తానే మూసినవాడు, ఆలోచింపుము, ధర్మ మార్గమును తెలియగలడా? చేతియందు చేయివేసి ప్రమాణము చేసి తన పనిని నెరవేర్చి, తన ప్రాణము గాపాడినట్టి మంచి మనస్సుగల మహాత్మునే మరిచెనుగదా. ఇక ఆతడెవ్వరి సహాయమును గుర్తించును? భూపుత్రిని వెదకుటకు వానరులను బంపించుట లక్ష్మణుని వలని భయము చేత గాని, ధర్మ లోపము గలుగునను భయముచేత గాదు. అట్టి యితడు ధర్మము యొక్క విధానమునెందైనా తలచునా? చపలమైన చిత్తము గలవాడు, జ్ఞప్తి లేనివాడు, పాపాత్ముడు, కృతజ్ఞత లేనివాడు. ఇట్టివానిని మంచి కులమున బుట్టి బ్రదుకునందాశగల ఆర్యుడెవ్వడైన కలలోనైన నమ్మునా? గుణము గలవాడు గాని, గుణము లేనివాడు గాని తన పుత్రుని రాజ్యమునందు నిలబెట్టును గాని

విరోధి పుత్రుడనైన నన్ను సూర్యపుత్రుడేల ప్రాణములతో నుండనిచ్చును. నా హృదయములోనున్న ఆలోచనలెల్ల నీకు తెలియజెప్పితిని. స్పష్టముగా నేనపరాధిని, దీనుడను, శక్తి లేనివాడను. నేనాపట్టణములో అనాథునట్లుగా నెట్లుండగల వాడును? ఆ వానరనాథుడును నన్నేవిధముగానైన రహస్యముగా బంధించి దండించును సుమా. క్రూరుడును, వంచనపరుడును, దయా రహితుడును అగు ఆతడు రాజ్యకారణముగా నన్ను బ్రతుకనీయడు. బంధనము నొంది ఘోరబాధలు పడుట కంటెను వేయి విధముల ప్రాయోపవేశము చేయుట మేలు సుమా. ఓ వానరులారా! మీరలిండ్లకు వెళ్లవచ్చును. మీకనుజ్ఞ నిచ్చితిని. నేను పురమునకు రాను. ఇచ్చటనే మరణించుటయే నాకు భద్రమైన మార్గము. శుభులును, బలయుక్తులునైన రఘువంశజులను నమస్కార పూర్వకముగా అడిగితినని చెప్పుడు. ప్రభువైన సుగ్రీవుని, నా పినతండ్రిని, నమస్కార పూర్వకముగా అడిగితినని చెప్పుడు. మా తల్లియైన రుమాదేవిని క్షేమమాయని ప్రశ్నింపుడు. అటులనే మాతల్లియైన తారాదేవిని దయతో దుఃఖనివారకములగు మాటలతో నోదార్పుడు. నాతల్లియైన తార సహజముగా పుత్రునియందు ప్రేమ గలది. తన భర్తయైన వాలికై పరితాపమును పొందినదియును. ఉత్తమమైన శీలము గలది. నాయొక్క చావును విన్నచో తానుకూడా మృతినొందుట నిజము సుమా. తానెట్లు జీవింపగలదు?

**అంగదాదులు ప్రాయోపవేశము చేయుట**

అని చెప్పుచు వృద్ధులైన వారందఱకును తాను వినయముతో నమస్కరించి, భూమిమీద పరచిన దర్భల సమూహములపై రోదనముచేయుచు, ఎక్కువగా మనస్సు కలతజెందినవాడై వాలినందనుడు పరుండెను. కపులందరును ఆర్తితో అతని పాటుని చూచి హా! యనుచు కన్నులవెంట నీరు గారుచుండగా

సూర్యనందనుని నిందించుచు ఇంద్రనందనుడగు వాలిని గొనియాడుచు పూర్వము జరిగిన విషయములను లెక్కించుచు, తామునూ ప్రాయోపవేశము చేయగోరి ఆ తమ యువరాజు చుట్టునున్నవారై అతని యొక్క అభిప్రాయమును తెలిసికొని నీళ్లను ముట్టి ఆ సముద్రము యొక్క ఉత్తరపు గట్టునందు దక్షిణ దిశగా కొనలున్న దర్భలపై తూర్పుదిక్కుగా తిరిగి కూర్చుండి మరణమొందుటయే మేలని తలంచి, ఆ వానర సమూహము రాముని యొక్క వనవాసమును, దశరథుడు మరణించుటయు, ఆ జనస్థానమునందు రాక్షసులను సంహరించుటయు, భూపుత్రి దొంగిలింపబడుటయు, వాలి యొక్క వధయును, రాముడు కోపగించుటయు, వానరులందటి భయమును తలచుకొనుచు పెద్ద గొంతులతో పర్వతములవంటి వానరశ్రేష్ఠుల సమూహములు విలపించుచుండగా మేఘము రురమగా ప్రతిధ్వనులీనువిధమున గుహలతో గూడిన ఆ పర్వతము కూడ ధ్వనించెను.



# ఏబది యాఱవ సర్గము

## సంపాతి అంగదాదులను జూచుట

ఏ చోటునందు వానర సమూహమిట్లు మరణించు తలంపులో నుండెనో, అచ్చటికి ప్రఖ్యాతి చెందిన బలముగలిగిన వాడును, జటాయువు యొక్క అన్నయు, చాల దీర్ఘమైన ఆయువు గలవాడును, పర్వత గుహయందు నివసించువాడును అయిన సంపాతియను పక్షిరాజు ప్రీతితో వచ్చి సంతోషముతో గూడిన మనస్సుతో మల్లసిల్లుచు నిట్లనెను. ప్రాణి కోట్లకు దైవమే తగిన విధముగా రక్ష గావించును. కావుననే గదా చాల కాలమున కీవిధముగా నా యొద్దకు క్రొత్త ఆహారమును తెచ్చియిచ్చెను. వీరలు మరణింపగానే ఈ వానరులను ఒక్కనొక్కనిగా దినదినమునకు క్రమముగా తినదెనుగాక అని పలుకగా విని కలత జెందినవాడై అంగదుడు హనుమంతునితో నిట్లనెను. ఆహారము నందాశ గలదైన ఈ పక్షిని జూచితివా? సీతాయను నెపముతో ఆ యమధర్మరాజే వానర సంఘములను చంపుటకు ఇచ్చటికి ఈ విధముగా వచ్చెను. శ్రీరామచంద్రుని కార్యమును చేసినదియు లేదు. రాజైన సుగ్రీవుని ఆజ్ఞను తీర్చను లేదయ్యెను. ఇంతలో ఈ గొప్ప అపాయము వానర కోట్లకెల్ల తలవని తలంపుగా సంభవించినది గదా. ఆ సీతాదేవికి ప్రీతి చేకూరునట్లు చేయ దలంచి జటాయువు చేసిన కార్యమంతయును మనము వింటిమి గదా. చివఱకు మనకందఱకును ఆ విధమే సంప్రాప్తించినది గదా. స్నేహము చేతను, దయ చేతను మనవలనే పశుపక్ష్యాదులైన జీవ కోటులు వేఱు వేఱు విధముగా అహహా!

తమంతట తామే ప్రాణములను విడచియైనను. శ్రీ రఘురామునకు ప్రియము చేయును గదా. భూపుత్రి భర్తకు ఉపకారము చేయుటకై ధర్మమూర్తి యగు జటాయువు ప్రాణములను విడచి ప్రియము గావించెను గదా. ఆ విధముగా మనము రామకార్యమును సాధించుటకై కష్టపడినవారము. అడవులన్నింటి యందు జానకిని వెదకి వెదకి కాంచలేకపోయితిమి. కానీ జీవములకంతయే ప్రాప్తింనది. మృతికి సిద్ధపడిన వారమగుటచే ఇంక చింతింపనేల? ఆ రావణునిచే యుద్ధమందు ఖండింపబడిన వాడై ఆ పక్షిరాజు పరమపదమును పొందెను. అతడు వానర రాజు భయమునుండి విముక్తుడయ్యెను. కాన ఈ జగత్తునందాతడే ధన్యుడు సుమా. దశరథ మహారాజు తానూ మృత్యువాత పడుటచేతను, భూపుత్రిని రాక్షసుడు దొంగిలించుటచేతను, గృధ్రరాజగు జటాయువు మరణించుట చేతను, వానరులకు జీవసంశయాపద సంఘటిల్లెను. భూపుత్రితోగూడ రామచంద్రుడును, లక్ష్మణుడును అడవులకు వచ్చుటయు, రాముని తీవ్రమైన బాణముచే ఇంద్రపుత్రుడైన వాలి సంహరింపబడుటయు, శ్రీకాకుత్థ్సుని క్రోధముచే సర్వరాక్షసులు గూలుటయు ఈ కష్టములన్నియు కైకేయియొక్క వరములనిచ్చుట కారణముగా గల్గెనుగదా.

## సంపాతి అంగదాదులతో సంభాషించుట

అట్లు భూమిపై పడియున్న వానరులు దయపుట్టునట్లుగా వాలి తనయుడు చెప్పిన మాటలు వినుచుండగా, గొప్పగా చలించిన బుద్ధిగలవాడై పక్షిరాజు హెచ్చుగా గలిగిన పరితాపముతో వారలతో నిట్లు పలికెను. ఎన్ని దినములకో నా తమ్ముని పేరిచ్చుట వినగలిగితిని. నా ప్రాణములకన్న నధికమైనవాడు. అతడు వధింపబడెనని వినగానే నా హృదయము కంపించుచున్నది. దండకాటవి యందు నా తమ్మునకును, రాక్షసరాజునకును యుద్ధమేల కలిగెను? ఆతని

కాపద ఎట్లు కలిగినది? దానిని చెప్పుచున్నవాడవు, వానరా! నీవెవ్వడవు? గొప్ప బుద్ధితో నన్ను పర్వతము నుండి దింపుడు. మిమ్ము వేడుకొందును. బలవంతుడైన నా తమ్ముడు మంచి గుణములు గలవాడు. అతనిని గురించిన మాటలు చాలా కాలమున కిచ్చట వినగలిగితిని. సీతానాథునకు తండ్రియైన దశరథుడు నా తమ్మునకు స్నేహితుడెట్లైయ్యను? ప్రఖ్యాతి గలిగిన కీర్తిగల ధన్యులారా! వినగోరు చున్నాను చెప్పుడు. ఓ వానర శ్రేష్ఠులారా! సూర్యునియొక్క వేడియైన కిరణములచే కాలిపోయిన రెక్కలుగలవాడను అగుటచే నేను పర్వతము నుండి దిగజాలను. నన్ను దయతో మీ సమీపమునకు తీసుకొని వెళ్లుడు అని అడుగగా.



# ఏబది యేడవ సర్గము

## అంగదుడు సంపాతికి తమ వృత్తాంతము చెప్పుట

ముంచుకొని వచ్చుచున్న దుఃఖముచే గద్గదపడుచున్న గ్రద్దయొక్క కంఠధ్వనిని విని మనస్సు నందు వానరులు నమ్మరైరి. దాని భయము గలిగించు పనికి, దిగులు చెందినవారై, మనలనందఱను యిది భక్షించును. తప్పదు. కాన వానియొద్దకు వెళ్ళవలదని కొందరు వానరులు చెప్పగా చచ్చుటకు సిద్ధముగానున్న మనకు జడుపెందులకు? వెళ్లి వానిచే జచ్చి ధన్యులమగుట తగిన పనిగాదా ? అని కొందఱు వెళ్లి వానినెత్తికొని పర్వతమునుండి దింపగా అంగదుడు సంపాతితో నిట్లనెను. ఓ పక్షిరాజా! వినుము. బ్రహ్మతో సమానుడైన వానర శ్రేష్ఠుడు ఋక్షరజుడను పరాక్రమము గలవాడు గలడు. ఆయనకు గొప్ప బలవంతులు, ఘనవిక్రములు, వాలి, సుగ్రీవుడను ఇరువురు పుత్రులు గలరు. వారిలో వాలియే నా జనకుడు. గొప్ప పరాక్రమము గలవాడై, అద్భుతమైన విధముగా కార్యములెన్నియో చేసి కీర్తింపబడిన వాడయ్యెను. అన్ని జగములకు ప్రభువైన వాడును, రఘువంశ శ్రేష్ఠుడును, నిర్మలమైన నడవడిగలవాడును, దశరథుని పుత్రుడగు రామచంద్రుడు తన తమ్మునితోను, భార్యతోనూ కూడినవాడై తండ్రియాజ్ఞకు బదులు చెప్పని వాడై కడు న్యాయపథమందు నడచువాడుగాన ఘోరమైన దండకాటవికి నడచి వచ్చి ప్రవేశించెను. విపరీతపు బుద్ధులు గలిగిన రావణాసురుడు, వారు జనస్థానమున విహరించుచుండగా రాముని భార్యను బలాత్కారముగా దొంగిలించి తీసుకొని వెళ్లెను. అప్పుడు శ్రీరాముని తండ్రికి స్నేహితుడైన పక్షిరాజు జటాయువు, రాముని

భార్యను చూచి ఆమెను విడిపింపగోరి ఆకాశ మార్గమున వెళ్లుచున్న రావణునితో తలపడి వాని, రథమును బడగొట్టి ఆమెను నేలమీద నిలబెట్టెను. తానూ తిరిగి పోవునప్పుడు వృద్ధుడగుటచేతను, అలసిన వాడగుట చేతను, రాక్షసునిచే రెక్కలునఱుకబడినవాడై పడెను. యుద్ధమునందీవిధముగా పక్షిరాజు మరణింపగ, జానకి భర్త అతనికి సంస్కారముగావించి, ప్రేమతో ఉత్తమమైన గతిని పొందజేసెను. నా పినతండ్రియైన సుగ్రీవునితో స్నేహముచేసి నా తండ్రియైన వాలిని చంపెను. మంత్రిసహితుడైన నా పినతండ్రి సుగ్రీవుడు నా తండ్రితో విరోధము పూనెను. ఆ సూర్యవంశజుడగు రాముడు, వాలిని సంహరించి స్నేహితునకు రాజ్యమునిచ్చెను. ఆ సూర్యపుత్రుడు మహిమాన్వితమైన వానరరాజ్యమును పొందినవాడై భూపుత్రిని చూచుటకై మమ్ము రామానుమతితో పంపెను. మేమును అచ్చుటచ్చుట వెదకుచు తిరిగితిమిగాని సూర్యరశ్మి రాత్రి కనిపించని విధముగా ఎచ్చటనూ జానకిని గానమైతిమి. దండకాటవిలో జాగ్రత్తగా సీతను వెదకుచు తిరుగుచుండగా అజ్ఞానముచే భూమియందున్న వివృతమైన ఒక బిలమును, మయుని ప్రజ్ఞచే నిర్మింపబడినదానిని ప్రవేశింపగా సుగ్రీవుడు మాకాజ్ఞయిచ్చిన మాసము గడువు దానియందె గడచిపోయెను. రాజాజ్ఞాబద్ధులము. ఈ విధముగా గడువుదాటిపోయెను. ఉరక వెళ్లినచో మా జీవములు నిలువవు. ఓ బుద్ధిమంతుడా! అందుచే ప్రాయోపవేశము చేసితిమి. రామునకును, వానరరాజునకును, సౌమిత్రికిని కినుక పుట్టునట్లు చేసినచో, మా శరీరములందు జీవములుండవు. నా మాట నిజము పక్షిరాజా యనగా.



# ఏబది యెనిమిదవ సర్గము

## సంపాతి కపులతో జటాయువు తన తమ్ముడని చెప్పుట

అట్లు ప్రాయోపవిష్ఠులైన వానరులు, దీనులై కన్నీళ్లతో తమ కథచెప్పగా విన్న సంపాతి గొప్ప స్వరములతో ఇట్లనెను ఆ రావణుని చేత సంహరింబడినట్లు మీరలు చెప్పిన జటాయువు నా సోదరుడే. అతని పాటును వినికూడ చేతగానివానివలె ఓర్చుకొనవలసి వచ్చెను. రెక్కలు కాలిపోవుటచేతను, ముసలితనముచేతను, పగతీర్చుకొనునంతటి బలము లేకపోవుటచేతను ఏమియు చేయలేనైతిని. పూర్వము వృత్రాసుర వధ జరిగిన సమయమున మా అన్నదమ్ములము మా వేగాతిశయము యొక్క తారతమ్యము తెలిసికొననెంచి, ఒకరినొకరు జయింపవలెనను కోరికతో, ఆకసమున కెగిరి సూర్యమండలము చేరవలెనని పలిటీలు గుండ్రముగా కొట్టుచు, మేఘమార్గమున వెళ్లుచుండగా సూర్యుడు సరిగ నడినెత్తికి రాగానె, నా తమ్ముడావేడి భరింపలేక కంగారుపడుచుండెను. అంత వానియందుండు ప్రేమచే అతనిని నా రెక్కలతో గప్పితిని. సూర్యునియొక్క గొప్ప వేడిచే నా రెక్కలు కాలి, శరీరము కమరి, వింధ్యాదిపై బడితిని. నేనిచ్చట నివసించుచుండుటచే నా సోదరుని వార్త నాకు వినబడదయ్యెను. అని చెప్పుచున్న సంపాతిని జూచి తారాపుత్రుడిట్లనెను. జటాయువు నీ సోదరుడైన సరియేగాని నేనిదివఱకు చేప్పినదంతయు నీవును వినియున్నావు గదా. నీకు తెలిసియున్నచో బుద్ధిహీనుడగు ఆ రావణుండుండు చోటు దగ్గరయో దూరమో చెప్పుమనగ, సంపాతి తనకు తగినట్లు వానరసమూహమునకు సంతోషము వృద్ధిపొందునట్లు ఇట్లు చెప్పెను. వినుడు. నేను శౌర్యవిహీనుడను, గ్రద్దను, రెక్కలు కాలిన వాడను అయినను.

## సంపాతి కపులకు రావణు నివాసము చెప్పుట

రామకార్యము చేయుట ప్రథమ కర్తవ్యమగు కార్యమేయయినను, ముసలితనముచేత బలము తగ్గినది, ప్రాణములు నీరసించినవి, కాన ఎక్కువగా నేమియును చేయలేను, గాని మాటయను సహాయము మాత్రము చేసెదను. వితలాది సమస్తలోకములనెఱుగుదును. విష్ణుమూర్తి త్రివిక్రమావతారమెత్తి జగములను కొలిచిన విధమెల్లను, రాక్షసులకు, దేవతలకు యుద్ధము జరిగిన విధమంతయు, అమృతము కొఱకై పాలసముద్రమును తరచిన విధమును, వానరులారా! నేను చక్కగా నెఱుగుదును.

రావణాసురుడాకాశమున నొక్క స్త్రీని తీసుకొని వెళ్ళుటను చూచితిని. యవ్వనవతియు, అందమైన సమస్త విభూషణములను ధరించినదియు, కళ్ళవెంట కన్నీరుగారుచుండగ శరీరము విదలించుచు, శరీరమునున్న ఆభరణములను తీసివేయుచున్నదియునైన సౌందర్యవతిని చూచితిని. కొండ శిఖరమున బడుచున్న సూర్యకాంతియో, లేక నల్లని మబ్బుపైనున్న మెఱుపో యనునట్లు ఆ కాంతయొక్క పట్టుబట్ట రాక్షసునిపై నొప్పినది. రామా! యనియును, లక్ష్మణా! యనియును ఆ స్త్రీ యేడ్చెను గాన ఆమెయే సీతా భామయని తలంతును. ఆ మనుష్యులనాహారముగా తీసిగొను వాని నివాసమును చెప్పెదను వినుడయ్యా!. విశ్రవసునకు ఔరసపుత్రుడును, ఈశ్వరుని మిత్రుడైన కుబేరునకు తమ్ముడును అగు రావణుడను పేరుగలవాడు మదముతో లంక అను నగరమున నివశించును. సముద్రమున నూరామడల దూరమందు విశ్వకర్మచే నిర్మింపబడినదై, అందముగలదై యొక్క ద్వీపమున్నది. అదియే సుమా లంకయనెడు రావణాసురుని నివాస పురము. బంగారు వాకిండ్లు, అరుగులు గల్గి, సూర్యుని కాంతి వంటి ప్రకాశముగల కోటచే చుట్టబడి యుండును. ఆ పురమందు రావణుని అంతఃపురమున రాక్షసులు రక్షించు చుండగా భూపుత్రి దుఃఖించుచున్నది. సముద్రము తనచుట్టూ అగడ్తగా నుండగా, సముద్రమున ఒక నూరు యోజనములు దక్షిణముగా వెళ్లగా లంకయుండును.

అట్లు వెళ్లి రాక్షస రాజునుజూచి, సూరులారా! కార్యసిద్ధిని పొందిరండు. ఓ వృక్షచరులారా! మీయొక్క గొప్ప విక్రమమును చూపుటకు త్వరపడుడు. నేను జ్ఞాన దృష్టితో చూడగా మీరందరును మంచి ఫలితమును పొంది తిరిగి వచ్చెదరు. ధాన్యమే ఆహారముగా గల కుళింగాది పక్షులకునెల్ల ప్రథమ గతి దృష్టి, చెట్లమీదనుండు ఫలాదులను తినునట్టి కాకులకు ద్వితీయగతి. క్రౌంచ, కురర, భాస పక్షులకు మూడవ మార్గము. నాల్గవ మార్గము శ్యేనములకు. గ్రద్దలకైదవ మార్గము. బలము, వీర్యము, యవ్వనము గల చక్రవాకములకు ఆరవగతి అగును. వైనతేయులకేడవ మార్గము. వైనతేయుని సంతతి వారమైన మేము ఇచ్చటనుండియే సీతను, రావణుని చూడగలము. మాకు సౌవర్ణమైన దివ్యదృష్టి కూడా గలదు. సహజమైన బలముచేతను, తినునట్టి ఆహారబలముచేతను, అనాయాసముగా నూరుయోజనముల దూరము చూడగలము. ఓ సాధు గుణములు గల ఉత్తములారా! అందువలననే అట్లుచూచుకొని దూరమున నున్నదానిని సమీపించి తినుట మాకు సహజమైనది. కోళ్లు మొదలగునవి భూమిమీద తమ పాదముల సమీపముననున్న వానిని గోళ్ళతో చీల్చి తినును. గర్హింపదగిన కార్యము ఆ దేవతా విరోధి చేసెను. వానరులారా! నా సోదరుని చంపినదానికి మీరుచేయబోవు పని తగిన ప్రతీకరమగును. ఈ సముద్రమును దాటునుపాయమును నాలోచింపుడు. దీనిని దాటి అచ్చట భూపుత్రిని చూచి ధన్యులై జైయని వేగముగా కిష్కింధను చేరబోవుడు. సముద్రమున నేనును, చనిపోయినట్టి నా తమ్మునకు నీళ్లు విడువవలెనుగాన మీరలు నన్ను సముద్రతీరమును జేర్పుడు. అనగా వానరులట్లే సంపాతిని సముద్రమునొద్ద దింపగా, ఆతడు జటాయువునకు జల దానము చేయగా, తిరిగి పక్షిరాజును తెచ్చి పూర్వమువలె అచ్చట నిల్పి రామచంద్రుని భార్యయొక్క వృత్తాంతం ఆ విధముగా తెలియవచ్చుటచే.

# ఏబది తొమ్మిదవ సర్గము

## జాంబవంతునితో సంపాతి సీతావృత్తాంతము చెప్పుట

సంపాతి వాక్కులనెడు అమృతధారలు కురియుటచే వానరులందరూ మిక్కిలి సంతోషింపగా భల్లూకనాథుడగు జాంబవంతుడు లేచి పక్షిరాజుతో నిట్లనెను. సీత ఎచ్చట నుండును? ఆమెనెవ్వరు చూచిరి? ఆ దొంగిలించిన రాక్షసుడెక్కడివాడు? ఓ ఖగేశ్వర! సర్వమును తెలిపి ఈ వానరులకెల్ల దిక్కయి రక్షింపుము. ఆ రఘురాముని వజ్రాయుధ సమానమైన బాణములను ఆ దొంగయెవ్వడో మనస్సు నందు కొంచెమయినను తలంపడయ్యెను అనగా సంపాతి ఇట్లనెను. సీతను దొంగిలించుటను గూర్చి నేను విన్న విధమును, చెప్పినవాని తెరగును, ఆ పద్మాక్షి యుండు చోటును మరల చెప్పెదను, వీరశ్రేష్ఠులారా వినుడు. నేను రెక్కలు విరిగిన వాడనై దీనతతో ఈ కొండయందున్నాడను. ఇట్టి వాడనగు నాపై భక్తితో నా కుమారుడు సుపార్శ్వుడు అనువాడు ఆహారమును సమకూర్చుచుండును. గంధర్వులకు విపరీతమైన కామమును, విపరీతమైన కోపము సర్పములకును, మృగములకు నతి భయమును, మాకధికమైన ఆకలియును సహజ సిద్ధములు. వానరులారా! అట్లగుటచే ఒకరోజున నేను ఆహారము కోరినవాడనై, ఆకలితో ఎంతయో అలమటించుచుండగా సూర్యాస్తమయమైన తరువాత మాంసమేమియు లేకుండా నాకుమారుడు నా యొద్దకు రాగ, ముసలి వారలకు కోపమెక్కువ గాన, దప్పికచే నేను వానిని అదలించితిని. వాడు నన్ను సమాధాన పరచి ఇట్లు చెప్పెను.

తండ్రీ! మహేంద్ర పర్వతము ద్వారమునరికట్టి నేను సముద్రపు జంతుజాలములు గుంపులై వెళ్ళు త్రోవయందు తలక్రిందుగా చేసి వ్రేలుచుండి, కాటుక కొండ వంటి వాడొకడు సూర్యసమాన కాంతితో వెలుగుచున్న ఒక యువతిని తీసుకొని పోవుచుండుటను చూచితిని. ఆహారము దొరికెనని నేను మనస్సునందు బాగుగా నిశ్చయించుకొని యుంటిని. ఓ గొప్ప బుద్ధిగల వాడా! అతడును దారినిమ్మని నన్ను వినయముతో కోరెను. నేనునూ సరే పొమ్మంటిని. నిందించదగిన గుణములు కలవాడైనను, తన్ను సమీపించి వేడుకొన్నచో చంపదలపడు గదా. అటువంటిది నాయెట్టి వాడు అటువంటి పనిని చేయగలడా, పక్షిరాజా! తన తేజస్సుతో ఆకాశమునే వేగముగా తీసికొని పోవుచున్నాడా అనునట్లుగా అతడు వేగముగా వెళ్లిపోయెను. అచ్చట ఆకాశసంచారులగు ప్రాణులు నన్ను చూచి అన్నా! భాగ్యవశముచే నీవు బ్రతికితివి అతడెట్లెట్లో స్త్రీతో కూడా ఈ సమయమున



వెడలిపోయెను. ఇంక నీకు భయము లేదని పలికిరి. వారిట్లు చెప్పగా నేను వాని పుట్టుపూర్వోత్తరముల గాధను చెప్పుడనగా ఆ సిద్ధ సమూహమిట్లు చెప్పెను. అతడు రావణుడనువాడు. రాక్షసులందఱకును రాజు. జనకరాజ పుత్రి సీతను, రాముని భార్యను, నీతిలేని వాడై బలాత్కారముగా తీసికొని భయముతో పారిపోవుచున్నాడు. రామ లక్ష్మణులను తలంచుచు ఏడ్చుచు భూషణములు రాలిపోయినవై మహా వ్యధచెందుచున్న ఆ స్త్రీ సీతయే సుమా! అని వారు చెప్పిరని ఆలస్యముగా వచ్చిన నా పుత్రుడు చెప్పెను. ఆ వృత్తాంతమును విని కూడా ఆ రాక్షసుని మీదకు వెళ్లి శక్తి చూపించుటకు నాకు ధైర్యము చాలకున్నది. రెక్కలు విరిగిన పక్షిని గదా, నేనేవిధముగా ఏ పనినైనా చేయుదును? వాక్కు, బుద్ధి, గుణము మిగిలియుండుటచే నేను మీ శక్తితో చేయదగిన విధమును చెప్పెదను. ఏది రాముని కార్యమో అదియే నా కార్యము కూడా. ఇది నిజము. సందేహము లేదు. మీరలు బలము గలవారు, ఆలోచన కలవారు, వానరరాజుచే పంపబడినవారు, యుద్ధములందు తిరుగులేని వారు. దేవతలుకూడా మిమ్మెదుర్కొనజాలరు. రామ లక్ష్మణుల బాణ సమూహము ముల్లోకములను నుజ్జునుజ్జుగా చేయగలవు. రక్షింపనూ గలవు. బలము, తేజము గలవాడు రావణుడు. అయినను మీరుకూడా సమర్థులే. మీకు చేయరాని పనిలేదు. ఇక ఆలస్యమెందులకు? మనస్సులందాలోచించి నిశ్చయము చేయదగును. మీవంటి ఘనులు పనులయందెప్పుడును వెనుదీయరు.



# అరువదవ సర్గము

## సంపాతి నిశాకర ఋషితో తనకైన సంభాషణము చెప్పుట

అని చెప్పి, వానరసంఘములచే పరివేష్టింపబడియున్న వాలిపుత్రుని జూచి, నమ్మకము గలవాడై సంపాతి సంతోషముతో మరల నిట్లుచెప్పెను. వానరులారా! గొడవచేయక వినుడు సీతవృత్తాంతమును చెప్పెదనని అంగదునితో నిట్లనెను సూర్యరశ్మిచే రెక్కలు కాలినవాడనై, యీ వింధ్య పర్వత శిఖరమునందారు దినములు మూర్ఛనొంది పడియుండి, ఆ పిమ్మట తెలివివచ్చుటచే నాల్గుదిక్కులను చూడగా ఒక్కటియు తెలియరాదయ్యెను. కొంతసేపు విమర్శించి చూడగా ఈ సముద్రమును, ఈ పర్వతసమీపమునున్న నదులు, సరస్సులు, సముద్రపుటంచు కనిపించగా బరిగెలతో, గుహలతో కూడినదియు, వివిధ పక్షి గణములతో నిండినదియు, దక్షిణ సముద్రతీరమున నున్నదియునైన వింధ్య పర్వతమిదియని తోచెను. పూర్వమిచ్చట నిశాకరుడను మునియొకడు ఘోరమైన తపము గావించెను. జననుతుడైన ఆతడు స్వర్గము జేరి ఎనిమిదివేల యేండ్లు గడచెను. ఆ ఋషీశ్వరుడు నన్నును, నా సోదరుని నెక్కుడైన చనవుతో గారవించు కారణమున అతనిని జూడవలెనని కోరిక గల్గి ఎగుడుదిగుడుగానుండి, ఎంతో పదును గల్గిన మొనలుగల కఠినమైన దర్భలు గల ప్రదేశమునకు కష్టమైన వింధ్య పర్వతమునుండి దిగి, గొప్ప సువాసనలు గల్గి పువ్వులు, కాయలతోనున్న చెట్లు గలిగిన ఆ ముని ఆశ్రమ సమీపమున నొక చెట్టు నీడలో ముని రాకకై యెదురుచూచుచు విశ్రమించితిని. ఆ మౌనియు స్నానము చేసి ఉత్తరదిక్కు మొగము గలవాడై వచ్చెను. బ్రహ్మను ప్రాణికోట్ల ననుసరించునట్లు పెద్దపులులు,

సింహములు, పాములు, చమర మృగములు ప్రేమతో ఆ ఋషి వెంబడి వచ్చి, రాజు వెంట వచ్చిన మంత్రుల వలె ఆయన తన సౌధములోనికి వెళ్లిన తరువాత వెళ్లునట్లు, ఆయన లోనికి వెళ్ళగానే ఆ మృగములన్నియు సంతోషముతో యథేచ్ఛగా తిరిగి వెళ్ళిపోయినవి. ఆ ముని నన్ను జూచి సంతోషముతో లోనికేగియు తిరిగి కొంచెము కాలములోననే వచ్చి నన్ను జూచి అగ్నిచే గాలిన రెక్కలను, వొంటినిండ గాయములు ఉండుటచే నిన్ను గుర్తింపలేకపోతిని. పూర్వము వాయువేగము గల వారును, కామరూపులును, అయిన సోదరులగు గృధ్రములు పక్షిరాజులై యుండిరి. వాడిలో పెద్దవాడవైన సంపాతివి నీవు. నీ ప్రియ సోదరుడు జటాయువు. నీవు మనుష్యాకృతితో భక్తితో నా పాదసేవ చేయుచుండును. నీకేకారణమున రెక్కలు కాలిపోయినవి? కారణమేమిటి? ఎవ్వడీవిధముగా నిన్ను శిక్షించెను అని అడుగగా.



# అరువది యొకటవ సర్గము

## సంపాతి తన రెక్కలు కాలిన విధము నిశాకరునితో చెప్పుట

ఆ నిశాకర మౌనితో నేనిట్లంటిని. కలత చేతను, గాయముల బాధ చేతను, సిగ్గు చేతను, ఇంద్రియములు వ్యాకులమైయున్న వాడనౌటచే సమాధానము చెప్పజాలకున్నాను. గర్వముచే కన్నులు కప్పబడిన వారమై మా పరాక్రమములను తెలిసికొనదలచిన వారమై కైలాస పర్వతముమీదనున్న ఋషి శ్రేష్ఠుల సన్నిధిలో సూర్యుడస్తాద్రి చేరులోపల చేరుదుమని పందెములాడి, మేమిద్దరమూ నొక్కమారుగా ఆకాశమునకెగిరి మేము, మా బలము చూపుచు ఆకాశమున నెగుఱుచుండగా, నగరములు వేరువేరుగా బండిచక్రముల కండ్లంత కనిపించెను. అచ్చటచ్చట వాద్యముల యొక్కయు, వేదముల యొక్కయు, ధ్వనులు వినవచ్చెను. రంగైన ఎఱ్ఱని వస్త్రములు గట్టిన స్త్రీలను సంగీతము నెరుపుచున్నవారిని చూచుచు మేమిద్దరమును సూర్యమార్గమును చేరగల్గితిమి. అచ్చటనుండి మేము చూడగా, వనములన్నియు పచ్చగడ్డి పరచినట్లుండెను. కొండలతో నిండిన భూమి యంతయు, గులకరాళ్లు పరవబడిన నేల వలె నుండెను. నదులచే వ్యాపింపబడిన భూమి, నూలుపోగులచే చుట్టబడిన చెండు వలె కన్పట్టెను. హిమవత్పర్వతము, వింధ్యము మేరువు సరస్సులోనున్న ఏనుగులవలె గనబడెను. శరీరమున చమటలు పట్టెను. మనస్సునందు దుఃఖము గల్గెను. కన్నులు గిరగిరా తిరిగెను. దక్షిణమిది, పశ్చిమమిదియని దిక్కు తెలియదాయెను. దిక్కులు శూన్యముగా

తోచెను. ప్రళయ కాలమందలి అగ్ని జ్వాలలచే పూర్తిగా తగలపెట్టబడిన జగముల వలె, లోకమంతయు అచట నుండి చూచు మాకు కనబడసాగెను. నయపండిత శ్రేష్ఠుడా! చూచుటకు సాధనములైన కన్నులు దిగ్భ్రాంతి పొందియుండుటచే, మనస్సు కూడా వ్యాకుల పడెను. దృఢ ప్రయత్నముతో కన్నులను కొంచెము విప్పి, మేము సూర్యునివంక చూడగా, ఆ భాస్కరుడును భూమియంత ప్రమాణముగా శరీరము గలిగి యుండుటను చూచితిమి. అంతట ఒక్క మాటయైనను చెప్పక జటాయువు నేలకు దొరలుచుండెను. అప్పుడు నేను చకచకా వచ్చి నా సోదరుని, నా రెక్కలతో గప్పితిని. వాని దేహము సూర్యరశ్మిచే చెక్కుచెదరలేదు గాని, ఏట్లో ఆ భాస్కరుని కిరణ కాంతులచే నా రెక్కలు క్షణములో కాలిపోయెను. అతడు జనస్థానమున బడియుండునని భావించితిని. నేను గతి చెడి రేక్కలు గాలుటచే నొక మొద్దువలె, ఈ పర్వతమున బడితిని. తమ్ముడును, రెక్కలును, రాజ్యమును, పరాక్రమమును పోవగా అన్నివిధముల ప్రాణములేల నిలుపతగునని చచ్చుటకై పర్వతమునుండి నేలమీద పడదలంచితిని.



# అరువది రెండవ సర్గము

## నిశాకరుడు సంపాతికి రెక్కలు మొలచు నుపాయము చెప్పుట

అని చెప్పి, బాధతో నేడ్చుచుండగా ఆ తపోధనుడొక ముహూర్త కాలము ధ్యానము చేసి నాతో నిట్లనెను. నీకు తిరిగి రెక్కలు వచ్చును. మరల బలము, కన్నులు, పరాక్రమము మునుపటివలె ప్రాప్తించును. నేను పురాణములందొక భవిష్యమును వింటిని. తపోబలముచే చూచితిని. ఇక్ష్వాకుల వంశమందు దశరథుడను భూమీశుడు భూమియందు ప్రకాశించును. అతని తనయుడు ప్రఖ్యాతమైన శౌర్యముగల రామభద్రుడు జన్మించును. అతడు తండ్రి మాట ప్రకారముగా లక్ష్మణుడను తమ్మునితో, నరణ్యములందు సంచరించుచుండగా, అతని భార్యను రాక్షసరాజు జనస్థానమునందుండి దొంగిలించి ఆమె కనేకాహారముల నాశ చూపునుగాని, ఆ మహా పతివ్రత తీరని దుఃఖమున మునిగినదై వానిలో నొక్కటినైనను ముట్టదు. (నిర్జర మండలికినైనా దుర్లభమైన అమృతమును ఇంద్రుడిచ్చును. దాని నింద్రదత్తమని తన మనస్సునందు తెలిసికొన్నదై, ఆ భూపుత్రి, ఆ అన్నమందు పైభాగమును తీసికొని ప్రాణములతో నున్నను, లేక దేవతత్వమును పొందినను, లక్ష్మణయుతుడైన నా ప్రాణవిభుడైన రామునకు చెందునుగాకయని భూమిమీద భక్తితో నుంచును). కుండలీకరణమైన భాగము ప్రక్షిప్తము. ఆ రాముని దూతలైన వానరులు జానకీదేవిని వెదకుకొనుచు ఇచ్చటికి వచ్చెదురు. ఆ భూపుత్రి వృత్తాంతము వానరులకెరిగించినచో నీకు శుభము కలుగును. నీవెచ్చటికిని పోవలదు. ఇందే యుండుము. ఇట్టి హీనమైన

దశయందు నీవెచ్చటికి వెళ్లగలవు? దేశకాలముకై ఎదురు చూచుచుండగా ఇచ్చటనే రెక్కలను పొందగలవు. నీకు రెక్కలు మొలచునట్లు చేయగలను గాని యిపుడే అట్లు చేయుటకు తలంపలేకున్నాను. జగములకు శ్రేయస్సు కలిగించు కార్యము పూని, ఓ పక్షి శ్రేష్ఠుడా! నీవు చేయవలసి యున్నది. ఇంద్రునకును, మునులకును, బ్రాహ్మణు లకును, దేవతలకును, మేలు కలిగించు చరిత్ర గలిగిన రాజపుత్రులకును హెచ్చయిన ప్రీతిని నీవు చేయవలయును సుమా. గొప్ప కీర్తి కలిగిన రామ లక్ష్మణులను చూడవలనని నాకు కొండంత యాస గలదు. గాని అంతవఱకు భూమియందు శరీరమును కాచుకొని యుండుటకు మన సొప్పకున్నది గాన శరీరమును విడచెదను.



# అరువది మూడవ సర్గము

## సంపాతికి మఱల రెక్కలు మొలచుట

అని చెప్పి, తత్త్వజ్ఞానపరుడైన మౌని నన్ననేకవిధముల నాశ్వాసించి, పొగడి నీవు వెళ్ళుమని చెప్పి తానంతట లోనికి వెళ్లెను. నేనెట్లో ఈ కొండమీదికి మెల్లగా నెక్కి వానరులారా! ఇందుండి మీ రాకకై యెదురు చూచుచున్నాడను. అట్లు ఎనిమిది వేల యేండ్లు గడచిపోయినవి. నేనోర్పుతో దేశకాలములకై కాచుకుని యున్నాను. ఆ తాపసి మాటలని విని నమ్మికతోయున్నాను. అతడు భూమిని విడచి స్వర్గమునకేగెను. నేననేక విధముల చింతలనొంది ధైర్యమును విడచినవాడనై దుఃఖముచే కాల్పబడుచున్నవాడను. చనిపోదునా యని ప్రయత్నింతును, మౌని మాటలు తలచి విరమించుచుందును. ఇది ఏమి జీవనమని యనుకొందును. ముని చెప్పిన విషయము చీకటియందలి దివిటీ వలె తెలివినిచ్చును. నేను రావణునెఱిగి యుండుటచే రామపత్ని నేలకాపాడ వైతివని నా పుత్రుని గర్హించుచుందును. ఆ దశరథుని స్నేహమును దలచి యైనను ఒంటరిగా నేడ్చుచున్న సీతను కాపాడ దలంపడయ్యెను. అటువంటి వాడొక పుత్రుడా! యని తలచుచుందును అని సంపాతి ఈ విధముగా వానరులకు తన కథను చెప్పగా, అంతలోనే కపులు చూచుచుండగనే అతనికి రెక్కలు మొలచెను. యెర్రని కాంతి తో అట్లు రెక్కలు మొలవగా ఒప్పుచున్న తన శరీరమును, సంపాతి చూచుకొని, సంతోషము పొందిన మనస్సు గలవాడై వానరులారా! ఆ నిశాకార ఋషి మహిమచే మరల రెక్కలు మొలచెను చూచితిరా! యవ్వనమందున్న బలము, పౌరుషము కూడ గలిగినవని తోచుచున్నది. మీరెన్ని విధములనైనను సీతను వెదకుడు. ఇప్పుడు, నాకు పుట్టిన రెక్కల విధమును చూడగా మీరామెను చూచుట కూడా నమ్మదగియున్నది. నా కనుజ్ఞనిందు. ఆకాశ మార్గమున వేగముగా పూర్వమువలె వెళ్లగలనేమో చూడగోరుచున్నాను అని చెప్పి సంపాతి వెళ్లిపోగా, ఆ వానరులు సంతోషము కలుగగా పోయిన బలమును పొందినవారై, జానకిని వెదకుటకై, అభిజిన్ముహూర్తమునకై వేచియుండి, దక్షిణ దిక్కుగా వెళ్లిరి.

# అరువది నాలుగవ సర్గము

## వానరులు సముద్ర తీరము చేరుట

ఈ విధముగా రావణు నివాసమును పక్షి రాజు చెప్పగా విని, కంగారు తగ్గిన వారై, వానరులందరూ ఆ శుభవార్త వలన కల్గిన ఆనందముతో పొంగిపోవుచు, గంతులు వేయుచు, ఆ మహానుభావురాలగు సీతను చూడవలెనను కోరికతో సముద్ర తీరమును చేరిరి. అచ్చట అన్ని జగముల ప్రతిబింబమనునట్టి సముద్రపు ఉత్తర తీరమును చేరిన వారై, గొప్ప బలము గలిగిన వానరులందరూ నచ్చట సమావేశమై, సముద్రము వంక తేరిపార జూడగా శరీరమందు గగుర్పాటు గలిగెను. నోళ్లను తెరచి గొప్ప గొప్ప శరీరములు గల వికృతపు రూపములు గలిగిన జల జంతువులతో నిండినదై, తరంగములచే వ్యాకులమై ఒకచోట నిద్రించుచున్నట్లును, మరియొకచోట క్రీడించుచున్నట్లును, ఇంకొక చోట పర్వతమంత ఎత్తైన జలముతో నొప్పుచు, పాతాళ లోకమున నివసించు రాక్షసేశ్వరుల రాకపోకలు గలిగినదై, ఆకాశమువలె అపారమై గగుర్పాటు కలిగించునదైయున్న సముద్రమును చూచి, చింతలతో తపించుచు ఇంకేమి చేయగలము! దీనినెట్లు దాటవలెనని గొప్ప భయము చేతను, దుఃఖముచేతను బాధచెందుచున్న వానర సమూహముతో, మతిమంతుడగు తారాపుత్రుడు వారల మనస్సులకు ధైర్యము చిక్కునట్లు ఇట్లనెను. వానరులారా! విషాదమును పొందవలదు. విషాదమే గొప్ప దోషము గదా. బలవంతమైన కోపించిన సర్పము బాలుని చంపెడు విధముగా, పురుషుని దుఃఖమే వానిని నశింపజేయును. పరాక్రమము చూపించదగిన సమయమున

బాధను పొందు క్షుద్రునకు పురుషార్థమేదియు లభించదు సుమా. అని చెప్పుచుండగా, రాత్రి ఈ విధముగా గడవగా, వానరులందరును వాలిపుత్రుని చుట్టియుండగా, అతడు దేవతలచే సేవింపబడుచున్న ఇంద్రునివలె నొప్పుచు చేయవలసిన కార్యముని గూర్చి ఆలోచించెను. తారాపుత్రుడు, వాయునందనుడు తప్ప ఆ కపిసేనను నిల్పుటకెవ్వడు సమర్థుడగును?

## అంగదుడు కపులను సంద్రమును దాట ప్రేరేపించుట

వానర వృద్ధులను, తక్కిన సేనాపతులను జూచి వాలిపుత్రుడు గొప్ప బుద్ధితో అందరు నూరడిల్లునట్లు అర్థవంతములైన మాటలతో గొప్ప సంతోషము గల్గునట్లు ధైర్యముతో నిట్లనెను. ఏ గొప్ప తేజోశాలి, యీ సముద్రమును దాటి వానరాధిపతి మాట నిలబెట్టగలడో, ఏ మహాబలశాలి ఈ నూరామడల దూరమును లంఘించి వానరుల భయమునంతయు పోగొట్టగలడో, ఎవ్వని మహిమచే ఇక్కడినుండి వెళ్లి ఆలుబిడ్డలతో మనము సుఖియింపగలమో, ఎవ్వని దయచేత సంతసముతో సుగ్రీవుని, రామలక్ష్మణులను మనము చేరగలమో, అట్టి సామర్థ్యము గల వానరుడు సముద్రమును దాటగలవాడు ఉన్నచో, ఈ వానరసైన్యసమూహములకు అభయమనెడి దక్షిణ వేగముగా నొసగుగాక! అని తారాపుత్రుడు అడుగగా విని, యాసేనయందొక్కడైననూ మాట్లాడడయ్యెను. వానరసైన్య మించుకన్తయైనను కదలక మెదలకుండగా యువరాజిట్లనెను. వానరులారా! మీరు బలవంతులలో శ్రేష్ఠులరు. ఘన పరాక్రమముచే కీర్తింపబడు వారలు. శ్రేష్ఠమైన మంచి కులమున బుట్టినవారలు. కీర్తింపబడిన కార్యనిర్వహణా సామర్థ్యముచే వందనీయులురు గదా. వానరులారా! ఎటు పోయినను, ఏ సమయమందైనను మీరు వెళ్లలేని తావులు భూమియందు లేవు కాన, ఓ వానరశ్రేష్ఠులారా! మీరెవ్వరెవ్వరు సముద్రము నెంత దూరము దాటగల వారలో మీ శక్తినాలోచించి చెప్పుడనగా అతనితో ఆ వనచారా శ్రేష్ఠులిట్లనిరి.

# అరువది యైదవ సర్గము

## అంగదునితో కపులు వారివారి లంఘనా శక్తిని చెప్పుట

గవయ, గవాక్ష, సుషేణులు, ద్వివిదుడు, మైందుడు గజుడు, జాంబవంతుడు, వేగముగల గంధమాధనుడు, వ్యర్థ ముగాని పరాక్రమముగల శరభుడు సంతోషముతో నిట్లనిరి. గజుడను వానర శ్రేష్ఠుడు నేను పది యోజనములు సముద్రమును దాటగలనని చెప్పెను. గవాక్షుడు నేనిరువది యామడలు వెళ్లగలనని చెప్పెను. ముప్పదామడ దాటగలనని గవయుడు పరాక్రమము వెలయ చెప్పెను. నాలువదామడ దాటగలుగుదునని శరభుడు త్సాహముతో బలికెను. ఏబది యామడలు దాటుదునని చలించని బుద్ధితో గంధమాదనుడు దెల్పెను. మైందుడను వాడరువదామడ దాటుదునని సంతోషముతో జెప్పెను. డెబ్బదియామడ నేను ధైర్యముగా దాటగలనని ద్వివిదుడు చెప్పగా, గొప్ప సంతోషముతో నేను వేగముగా ఎనుబదియామడలు దాటగలనని సుషేణుడు చెప్పెను. అంతట ఆ వానర సమూహమునంతను తగు విధముగా మాటాడి ముసలి వయస్సు గలిగిన (అందరిలో పెద్దవాడైన) జాంబవంతుడు, ఓ వానరులారా! నేను కొంత గమన శక్తి కలవాడనే పూర్వము గాని, ఇప్పుడు కడు వృద్ధుడనైతిని. వయస్సు యొక్క అంతమును చేరితిని. అది యటులుండనిండు. సూర్య వంశజులును, సూర్యపుత్రుడును తమ మనస్సులందు మనమెట్లయిన ఈ మహా కార్యమును చేయగలమని విశ్వాసముతోనున్నారు. కాన నేను దీనినుపేక్షింపదగదు. కాలభేదము చేత నిప్పటి బలమును తలచి చూడగా, నాకు తొంబదియామడ దాటగలుగు

శక్తియేయున్నట్లు నా మనస్సుకు తోచుచున్నది. నా గమన శక్తి ఇంతేకాదు సుమండి. పూర్వకాలమున మహాబలిచక్రవర్తి యజ్ఞము చేయుచుండగా, త్రివిక్రమావతారమెత్తిన విష్ణుమూర్తికి నేను వేగముగా ప్రదక్షిణము చేసితిని. యవ్వనమందు నాకు సాటి లేని బలము, వేగము నుండెను. ఆ వయస్సంతయు గడచిపోయినది. ముసలితనము వచ్చినది. గమనము తగ్గి, బలము సన్నగిల్లినది. కాన నేవిధముగా జూచినను ఇంత కన్నా వేగముగా బోజాలను. దానివలన ఫలము కనిపించదు. ఏమి చేయుదును? అని చెప్పుచున్న భల్లుక శ్రేష్ఠుని కొనియాడుచు వాలి తనయుడిట్లనెను. నేను, గొప్ప శక్తితో నూరు యోజనములు దాటగలను గాని తిరిగి రాగలనో లేనో యనగా విని జాంబవండుతుడు, ఓ వానరశ్రేష్ఠా! నీయొక్క శక్తి ఎంతైనను కీర్తింపతగినది. వినుము. నూరామడలైనను, వెయ్యియామడలైనను పోయి, వేగముగా తిరిగి వచ్చుటకు కూడ నీకు శక్తిగలదు. అయినను అట్లు చేయుట నీకు సరియైన పని కాదు. పనిచేయుంచుకొనువాడు రాజు. నిన్ను పంపుట సేవకుల సమూహమునకు తగదు. నీ సేవకులగు వీరులను బంపి పనిచేయించుకొనుట నీకు తగును. వానర సమూహమునకంతకు నీవు రాజువగుటచే ఎల్లప్పుడును ఎక్కువగా నీవు భార్య వలె జాగ్రత్తగా రక్షింపదగిన వాడవు. సేనలకన్నింటికి అధిపతి రక్షింపదగిన వాడు. ఇది లోకమర్యాద. కాన నిన్ను మేము కాపాడుకొనదగును గాని ఒంటరిగా పంపుట తగిన పనియా? అంతేగాక కార్యమునకంతకును నీవే మూలమైనవాడవు. అర్థమూలమును రక్షించుట మిక్కిలి యర్థమను నీతిని కార్యవిధులు తెలిసినవారలు చెప్పుదురు. చెట్టునందు మూలము బాగుగాఉన్నచో ఓ వానరేశ్వరా! కొమ్మలు, పండ్లు, పువ్వులెన్నియో గల్గును గదా. అనఘా! మంచి బుద్ధికిని మంచి ధైర్యమునుకును, నిధివై యొప్పు నీవు కార్యసాధనమునకంతయు మూలమైన వాడవు. గొప్ప పరాక్రమము గలవాడా! మాకు గురుడవు. వానర నాధుడగు సుగ్రీవుని అన్నగారి పుత్రుడవు. కుమారా! అట్లగుటచే నిన్ను

ముందుంచుకొని కార్యమును చేయ ప్రయత్నించు వారము సుమా. అని జాంబవంతుడు చెప్పగా విని, తారాపుత్రుడు, నేను వెళ్లకున్నచో మనలో వెళ్లగల వాడెవ్వడున్నాడు. కావున మరల ప్రాయోపవేశము చేయుటయే తగును. ఆ సూర్యపుత్రుని ఆజ్ఞను చేయకుండా వెళ్ళినచో జీవములతో నుండుటరుదు. సుగ్రీవుడు అనుగ్రహమునందును, నిగ్రహమందును సమర్థుడు. గడువు దాటించి వ్యర్థులమై వెళ్ళినచో యందరిని సంహరించును. ఏ విధముగా కార్యము చెడకుండునో ఆ విధమును నీవే చెప్పుము అని అడుగగా జాంబవంతుడు వాలి తనయునితో నిట్లనెను. నీదైన ఈ కార్యమునకు కొరత కలుగబోదు సుమా. కార్యము చేయగల వానిని, రాజపుత్రా! ఇపుడే ఉత్సాహ పరిచెదను చూడుము అని చెప్పి, దుముకుట యను కేళియందు ప్రవీణుడును, ఏకాంతమున హాయిగ కూర్చుని యున్న వాడును నగు హనుమంతుని నుత్సాహపరుప నారంభించెను.



# అరువది యాఱవ సర్గము

## జాంబవంతుడు హనుమంతుని ప్రోత్సాహపరచుట

ఏమియు జేయలేనివారై ముఖములు దైన్యముతో వ్రేలాడుచుండగా, తోచక, ధైర్యమును గోలుపోయిన వానర సంఘములను జూచి ధీమంతుడగు జాంబవంతుడు హనుమంతుని యందు దృష్టి నిలిపి ఇట్లనెను. ప్రాకటముగా అన్ని శాస్త్రములను అభ్యసించినవాడా! వానర వీరురలో శ్రేష్ఠుడా! పావనీ! ఒంటరిగా నిట్లు మౌనమును బూని వినోదించుచు మాటలాడకున్నావేమి? సూర్యపుత్రునకును, ఆ రఘువీరులకును బలమందును, ధైర్యమునందు, శౌర్యమునందు, ఎంచి చూచినచో నీవు సమానమైన వాడవు. వినతా నందనుడును, మహాబలము గలవాడును, కశ్యపప్రజాపతి పుత్రుడును, పక్షినాధుడును అయిన గరుత్మంతుడు, సముద్రమందున్న పాములను హరించి, విహరించుచుండగా నేనెన్నిమారులో చూచితిని. అతని రెక్కలకు గల బలము, వేగము, నీ బాహువులకు నిక్కముగా గలదు. అతనికి నీవు వీసమంతైనను తీసిపోవు సుమా. బుద్ధి బలము నందు, తేజస్సు నందు, ధైర్యమందు జగత్తున నున్న అందరికంటెను నీవెక్కువైన వాడవు. ఓ నిర్మలాత్మా! నిన్ను నీవేల యెఱుగవు? ఓ మహాత్మా! ఇది ఎందుచేతనో ఆలోచింపుము.

## జాంబవంతుడు హనుమంతుని జన్మవిధము చెప్పుట

అప్సరలలో మిన్నయైన కుంజికస్థలయను సౌందర్యవతి, ఒక శాపముచేత ఈ భూమియందు వానర కాంతయై అంజన యను పేరుతో, ఆ వానరరాజగు కుంజరుడను వాని పుత్రికై జన్మించెను. ఆమె తనుకోరిన యాకారమును ధరించు

నేర్పు గలది. కేసరి యను వానికి భార్య యైయ్యెను. సుకుమారమైన, అందమైన రూపము, యవ్వన విలాసము గలిగిన ఆ వానర స్త్రీ ఒక దినమున సంతోషముతో మనుష్య రూపము ధరించి, విచిత్రమైన, అందమైన భూషణములు ధరించినదై, పుష్పమాలలను, అందమైన, మృదువైన పట్టువస్త్రములు ధరించినదై, మేఘము వంటి కాంతి గల పర్వతతటమున సంచరించుచుండగా, పద్మముల వంటి కన్నులుగల ఆ అంజనయొక్క ఎఱ్ఱని అంచుగల శుభకరమైన పచ్చని పట్టువస్త్రము, అప్పుడు ఆ పర్వతము మీదనుండి వీచుచున్న గాలి కారణముగా మెల్లగా తొలగిపోగా, ఎత్తైన స్తనములను, అందమైన, గుండ్రమైన, బలిసియున్న తొడల పైభాగములు, పిరుదులను, అందమైన ముఖమును, మంగళకరమైన ఆకృతిని చూచి, మోహము పొందిన వాడై వాయుదేవుడు, మన్మథ బాణములచే నొప్పింపబడ్డవాడై, ఆ సాధ్విని దగ్గరకు దీసిగొని తన భుజములతో, ప్రేమతో కౌగిలింపగా అప్పుడు అంజనాదేవి సంభ్రాంతురాలై, ఎవ్వడు నా పతివ్రతాత్వము నిప్పుడు నాశనము గోరెను అనగా, ఆ పూబోడితో వాయుదేవుడు నిట్లనెను. ఓ అంజనా! నీమీద మనస్సు గలుగుటచే నేనీవిధముగా నిన్ను కౌగిలించుకున్నాను. అంతేగాని నీకేమాత్రమును కీడు కలిగించబోను. ఓ యవ్వనీ! భయము చెందవలదు. ఓ యశస్వినీ! నేను స్పర్శనుడను. (వాయువును) సుమా. ఓ కాంతా! ఈదుటయందును, దుముకుటయందును, నాతో సమానమైన వాడును, గొప్ప వేగముగలవాడను, పరాక్రమము గలవాడును, వ్యర్థముగాని బలము గలవాడును, ప్రాజ్ఞుడును. నీకు కుమారుడుగా కలుగగలడు అని చెప్పగా, నీ జననియు మనస్సునందు సంతోషమును పొందినదై వెళ్ళి, ఆ పర్వత గుహయందు నిన్ను వానరోత్తముని ప్రసవించెను. సాటిలేని కీర్తిగలవాడా! నీవొకనాడు ఉదయించుచున్న సూర్యుని జూచి, ఫలము అనేడి  ఆశచే, ఆకాశమునకెగిరి, మూడునూర్ల యోజనములు వెళ్ళి, సూర్యుని వేడిచే మాడ్చబడుచున్నవాడవైనను, మనస్సునందైన బాధపడక, భాస్కరుని

చేరవచ్చుచున్ననీపై ఘనమైన కోపమును బొంది, ఇంద్రుడు ఱివ్వున వజ్రాయుధమును వేసెను. ఆ గొప్పదైన వజ్రాయుధపు దెబ్బచే నీ యెడమ దవడ తెగుటచేత జగత్తునందు నీకు హనుమంతుడగు పేరు గలిగినది. (హనుమదాచార్యోపదేశమును చూడుడు. హనుమంతుని తత్త్వమంతయును గణనగును.) మీకు తగిలిన దెబ్బను జూచి గొప్పనైన కోపముతో, జగత్తులకు ప్రాణమైన వాయుదేవుడు ఇంచుగంతయు గదలకుండెను. మూడు జగములును కదలిపోయెను. దేవతలందరు కలత చెందిన మనస్సులుగలవారై వేగముగా వచ్చి కోపించిన గాలినోదార్చగా, వానరశ్రేష్ఠా! నిన్ను జూచి బ్రహ్మ దయతో శస్త్రములచే చావు లేకుండ వరమిచ్చెను. వజ్రాయుధపు దెబ్బకు నీవు నొవ్వకుండుటచే సంతసించి ఓ పావనీ! కనికరముతో ఆ వేయికన్నులరేడు నీవు నీకిష్టము వచ్చినపుడు మృతిచెందునట్లుగా వరము ఇచ్చెను. భయంకరమైన పరాక్రముగలవాడా! నీవు కేసరికి క్షేత్రజుడనగు(భార్యయందు పుట్టినవాడు.) వాయుదేవునకు ఔరసపుత్రుడవు. గొప్పనైన తేజస్సునందును, విక్రమమునందును నీవు కన్నతండ్రికి సరిపోలుదువు. నాయనా! ఇది కల్ల కాదు. పుణ్యమైన బుద్ధి కలవాడా! మా ప్రాణములు పోవుచున్నవి. మమ్ము కాపాడవయ్యా. ధైర్యము, శౌర్యము, గొప్పదైన సామర్థ్యములందు నీవు పక్షిరాజునకు ప్రతిరూపమైన వాడవు. త్రివిక్రమావతార సమయమున నేను పర్వతములు, వనములతో గూడిన ఈ భూమినంతను, ఓ పావనపుత్రా! ఇరువదియొక్క మార్లు ప్రదక్షిణముగా చుట్టివచ్చితిని సుమా. అమృతము కొరకై సముద్రమును తఱచు సమయము నందు దేవతల ఆజ్ఞచే గొప్ప ఔషధీలతలను సమకూర్చితిని. ఆ తీగలచేతనే ఓ ప్రజ్ఞానిధి! అమృతము పుట్టినది సుమా. అప్పుడు నాకసమానమైన బలమును, వేగమును యుండెను. పుణ్యశీలా! నాకాలమంతయు గడచిపోయెను. ముసలివాడనైతిని మఱియు తగ్గిపోయిన విక్రమముగలవాడను, ఇపుడిట్లయితిని. ఇక చింతించిననేమి ప్రయోజనమున్నది. ఓ వానరశ్రేష్ఠ! నీవెన్నెన్నో

సర్వసద్గుణములు గలిగియున్న వాడవు. బలమందును, దూరమునెగురు నేర్పునందును భూమిపై నీవే మేటివి. నీవలె ప్రాణికోటిలో నేదియును వెళ్లజాలదు. ఏదీ మారుతి! వేగముగా నీ విజృంభణమును, బలమును, నేర్పును చూపవయ్యా. వానరశ్రేష్ఠా! లెమ్ము. ఈ మహాసముద్రమును దాటుము. ఈ వానర సమూహములు నీయొక్క వేగమును, వీర్యమును చూడవలెనను ఆశతోనున్నారు సుమా. ఓ అనఘా! పూర్వము త్రివిక్రమునివలె ప్రశంసింపదగిన నీ శక్తినంతను చూపుచుండగా ఈ కపిశ్రేష్ఠులు కన్నులార చూడగోరుచున్నారు. అన్నా! ఇట్లుపేక్షించుట నీకు తగియున్నదా? అనుచు జాంబవంతుడు ఉత్సాహపరచగా హనుమంతుడు ఆ క్షణముననే విజృంభించి, వానరసైన్యములు హర్షముతో చూచుచుండగా, స్థిరముగా తనరూపమునప్పుడు పెంచెను.



# అరువది యేడవ సర్గము

## జాంబవంతుని వాక్యములచే హనుమంతుడు విజృంభించుట

సులువుగా నూరుయోజనముల సముద్రమును దాటుటకై విజృంభించుచు వెలుగుచున్న వాడును, పరాక్రమాతిశయముతో కార్యసిద్ధిని పొందుట యందు ప్రసిద్ధుడును, అయినా ఆ వానరనాధుని జూచి వానరులాక్షణమునందే తమ దుఃఖమును విడిచినవారై, సంతసము నిండిన మనస్సులతో కల కల మని నినాదములు చేయుచు, జై జై అని స్తోత్రము చేయుచు, పూర్వము త్రివిక్రముని చెలువు వహించి యొప్పుచున్న నారాయణుని లోకులందరు చూచిన విధముగా వానరులందరు విస్మయము, ఇంతింతనిరాని సంతోషము గల మనస్సులు గలవారై చూచుచుండగా, హనుమంతుడు శరీరమును పెంచి అధికమైన, వృద్ధిపొందిన బలాధిక్యముచే తోకనల్లలనాడించెను. పర్వత గుహములోనుండి వెడలునట్టి సింహమువలె వాయుపుత్రుడు విజంభించి వానరులచే నుతింపబడ్డవాడై, అవిరాళమైన తేజస్సు గల రూపముతో ప్రకాశింప జొచ్చెను. అప్పుడు వాయుపుత్రుని ముఖము ఎర్రగా కాగియుండేది. పెనమును దిరస్కరించుచు, కణ కణ కణ మండుచు, పొగ గప్పని నిప్పులకుప్ప యొక్క కాంతితో ప్రకాశించెను. శరీరమునందు గగుర్పాటు కలుగుచుండగా వానర మధ్యము నుండి లేచి, ఆ ధీరుడు, వృద్ధ వానరులకు నమస్కరించి ఇట్లు చెప్పెను. పరాక్రమాతిశయముచే పర్వత శిఖరములనైన పడగొట్టగల వాడు, అమితమైన శౌర్యముతో ఆకాశమునందు సంచరించువాడు, అగ్నిహోత్రుని మిత్రుడు, శీఘ్రముగా వెడలు వాడు.

## హనుమంతుడు కపులతో తన పరాక్రమము చెప్పుట

గొప్ప వేగము కలవాడునైన వాయుదేవునియొక్క ఔరసపుత్రుడను, దుముకుటయను గొప్ప పనియందు జగములలో నాకు సమానమైన వారలు కనిపించరు. నా తండ్రియైన వాయువుతో సమానుడను. ఆకాశమునంటు బంగారు పర్వతమునకు ప్రదక్షిణముగా వెయ్యి మారులు చుట్టి వత్తునా? కొలనులతో, పర్వతములతో, వనములతో గూడిన భూమిని చేతులతో చిమ్మబడిన సముద్ర జలములలో ముంచి వేయుదునా? నా పిక్కల యొక్క అధికమైన వేగముచే మొసళ్ళతో గూడిన సముద్రమును విలాసముగా ఆకాశమున కెగజిమ్ముదునా? ఆకాశమున పరుగెత్తుచున్న వినతాపుత్రుడైన పక్షిరాజును వేయిమారులు ప్రదక్షిణింతునా? ఉదయించుచున్న సూర్యునిక్కడనుండి చేరబోయి, అతని వెంట పరిగెత్తి, అస్తాద్రిని చేరి, సూర్యుడస్తమించకముందె ఎదురేగి, మండుచున్న మార్తాండమణ్డలమును చేరువాడను. అచ్చటనుండియే భూమిపై విశ్రమించకుండ మరల వెళ్లి ఇచ్చటికి రాగలను. ఆకాశాచారులందరిని, శక్తిని ప్రదర్శించి, ఉత్సాహముతో దాటిపోగలను. ఇంతింత ముక్కలుగా ఈ భూమిని చీలుతునా? సముద్రమునెండింతునా? పర్వతములను చేతులతో పిండి పిండిగా దంచుదునా? నా తొడల వేగముచే భయంకర సముద్రమును నా వెంట వచ్చినట్లు చేయుదునా? మీరలీభయంకరమైన శరీరము గలిగిన ఆంజనేయుని నేమని తలంచితిరి? తీవ్రమని వేడుకగా నేనాకాశమున కెగిరినచో లతలందు చెట్లయందునున్న పువ్వులెగిరి చివ్వన అందముగా నా వెంట వచ్చుచుండగా, నేను వెళ్ళు మార్గమంతయు తథ్యముగా ఆకాశమునందలి చుక్కలధికముగా గల మార్గము వలె (పాలపుంత వలె) దూరమునుండి చూచు వారలకు కనిపించును. పైకెగురుచు, క్రిందకు దిగుచు వేగముగ ఆకాశమునందు వెళ్లుచున్న నన్ను, భూతసమూహములు నివ్వెర పొందినవై చూడగలవు.

ఆకాశమున గొప్ప మబ్బువలె గప్పి ఆకాశమును మ్రింగుటకు చేకొన్న విధముగా వెళ్లుచున్న నన్ను వానరులారా! చూచెదరు మీరు. పర్వతములను గదలించుచు, సముద్రము నుడికించుచు పరాక్రమముచే మేఘములను నశింపచేయుచు సముద్రమును దాటెదను, కపిసింహులారా! చూడుడు. బలమునందును, వేగమునందును వాయువునకు, వినతా తనయునకు సాటివత్తును. ఆ పక్షిరాజును, గాలియు తప్ప ఇతరులెవ్వరైనను నా వెంట రాగలరా? నిమిష మాత్రములో మెరుపు మెరిసిన విధముగా, ఆకాశమున కెగిరి, ఏదియు పట్టుకొనకుండ సముద్రమును దాటుచుండగా త్రివిక్రమావతారమెత్తిన విష్ణువు విధముగా విస్మయము గలుగునట్లొప్పెదను. ఓ వానరేంద్రులారా! చింతలను విడచిపెట్టి సంతోషమును పొందుడు. విడువని బుద్ధిబలముచే జానకిని చూచెదను. కీడు కలుగదు. మనస్సు యొక్క చేష్ఠ అట్లు సూచించుచున్నది. వాయువు యొక్కయు, గరుత్మంతుని యొక్కయు వేగములతో సమానమైన అధికమైన వేగముతో వెయ్యి యోజనముల దూరమునైనను దాటజాలుదునని తలంచుచున్నాను. స్వయంభువునైన బ్రహ్మ చేతియందైనను, వజ్రాయుధము ధరించిన ఇంద్రుని చేతియందైనను యున్నట్లే, అమృతమును గూడ, నా గొప్ప శక్తిచే హరించి తెచ్చెదను. లంకాపట్టణమును పునాదులతో పెకలించి, అడ్డులేకుండగా పెరికి, వెంటలాగుకొని వచ్చుటకు నేను నేర్తునని నిశ్శంకముగా తోచుచున్నది, వానరోత్తములారా! అని గర్జించుచున్న మహాబలశాలియగు వానరశ్రేష్ఠుని జూచి, ఆ వానరులు కడు ఆశ్చర్యముతోను, ముదముతోనుండగా, వాయునందనుని జూచి జాంబవంతుడిట్లనెను. జగత్ప్రాణపుత్రా! వీరలోకముచే నుతింపబడినవాడా! కేసరిపుత్రా! బంధుజనుల శోకమును తీర్చితివిగా నాయినా! కావున, నీ మేలుకోరెడి ఈ వనచరముల సంఘములన్నియు కుతూహలంతో కార్యసిద్ధికై నీకు శుభము కలుగునట్లు మంగళాశాసనములు చేయుచున్నవి.

తపస్వి జనుల అనుగ్రహ మహిమ వలనను, వానరవృద్ధుల ఆశీస్సుల వలనను, గురుజనుల దయచేతను, కపివీర లోకనాయకా! విపులమైన మహాసముద్రమును దాటి కీర్తితో వెలయుము.

## హనుమదాదులు మహేంద్రాద్రి నెక్కుట

నీవు వచ్చుదనుక ఒంటిపాదమున నిందునిలిచెదము. ఈ వానరయోధ సమూహములయొక్క ప్రాణములన్నియును నీ అధీనములే సుమా యని సంతోషముతో చెప్పుచున్న వానరులతో వాయుపుత్రుడిట్లనెను. నేను వేగముగా ఎగురుటచే పుట్టు వేగమును ఒకింతయైనను ఈ భూమి భరింపజాలదు. ఆ మహేంద్రపర్వతముయొక్క గొప్ప శిఖరములు కదలని కఠినమైన శిలలతో గూడినవి, అనేకమైన చెట్లతో నిండినవియును. ధాతువులు స్రవించుటచే కాంతి గలవియును, గట్టివియు గాన, అవి నూరామడ సముద్రమును నుత్సాహముతో దాటగా, నా పాదఘట్టనములను సహింపగలవు అని చెప్పుచు వానరులతో గూడి పర్వతమునెక్కి, వివిధములైన వృక్షములు, తీగలు, పొదలు నిండినదియు, మృగములతో నిండియున్న పచ్చికబయళ్ళు గలదియు, ఎల్లప్పుడును పుష్పఫలములు గల చెట్లతో గూడినదియు, నీటి ప్రవాహములతో నొప్పినదియు, సింహముల, పెద్దపులుల సంచారము గలదియు, మదించిన పక్షుల శబ్దములు గలదియు, మదించిన ఏనుగులతో నిండినదియుయైన, ఆ మహనీయ స్థలమునందు మనస్సు సంతోషముతో నుప్పొంగుచుండగా వానర శ్రేష్ఠుడు విహరించెను. అంత వాయుపుత్రుని పాదములచే ద్రొక్కబడినదై ఆ పర్వతము సింహముచే దెబ్బతిన్న గజమువలె నుండెను. చెదిరి పడిన రాళ్లుగలదై, జల ప్రవాహములు వెడలగ్రక్కెను.

బెదురుచున్న మృగములను, కదులుచున్న చెట్లును, ఎగురుచున్న పక్షులును,

మధుపానసక్తులై యుండి విడిపోవుచున్న గంధర్వ, నాగ దంపతులను, దాగుగొనుచున్న సర్పములును గలిగి, దొరలి వచ్చుచున్న బండరాళ్లు ఢీకొట్టుచుండగా, గొప్ప బాధతో నిట్టూర్పుగాడ్పులు విడచుచున్న సగము వెలువడిన సర్పములతో ఆ పర్వతము జండాలుపట్టిన విధముగా కనుపించుచు, భయము కలిగించుచుండెను. భయముతో సంభ్రమించిన మునిజనులచే విడచిపెట్టబడిన ఆ పర్వతములు, దారుణమైన అడవి మధ్యభాగమున గుంపుచే వదలబడిన ఒంటరి పాంధుని వలె నొప్పెను. అపుడు వేగమునందే ఉంచబడిన మనస్సు గలవాడును, కపిసింహుడును, అధికమైన వేగము గలవాడును, శుభప్రదమైన మహిమ గలవాడును, శత్రు సంహారకుడును, మనస్వియు అగు వాయుపుత్రుడా సమయమున లంకకు వెళ్లుటకై సంసిద్ధుడయ్యెను.



## కిష్కింధాకాండాంత పద్యములు

మాయను జయించినవాడా!
నీదైన మహామాయచే స్వీకరింపబడిన అవతారము గలవాడా!
మాయావుల యొక్క మహామాయను అణగద్రొక్కగలవాడా!
మాయామయమైన దివ్యదేహము గలవాడా!
మాయనే మోహింపజేయువాడా!
నీయందు స్నేహముగల వారిని పాలించునట్టి
విశిష్టమైన మంచి చరిత్ర గలవాడా!
అజ్ఞానులగు జీవులయొక్క సమూహముయొక్క
మోహమును చూచి పరితపించువాడా!
పాలసముద్రమునందు నివసించువాడా!
పండితులను సంతోషపెట్టుటలో నేర్పరియైనవాడా!
వికసించిన పద్మములవంటి నేత్రములు గలవాడా!
రామనాధా! స్త్రీకి అభయమిచ్చిన వాడా!
దయాళులలో శ్రేష్ఠుడా! వానరరాజును సంహరించినవాడా!
రామా! ఒంటిమిట్టపురము నివాసముగా గలవాడా!
చంద్రబింబము వంటి ముఖము గలవాడా!
సోమునిచే (చంద్రునిచే, ఉమాసహితునిచే) నుతింపబడినవాడా!

# గద్యము

## ఇది

శ్రీరామచంద్ర చరణారవిందమిళిందాయమాన మానసయు శ్రీ మొలుగు వెంకట నృసింహాచార్య తనూజయు శ్రీమత్పండిత మంత్రరత్న బిరుదాంచిత శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట రాఘవాచార్యులుఅయ్యవార్లంగారి ధర్మపత్నియు అగు వెంకట సీతమాంబచే శ్రీ వావిలి కొలను సుబ్బారాయ ప్రణీత శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణ పద్యకావ్యమునకు వ్రాయబడిన వచనానువాదమునందు కిష్కింధాకాండము.

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ ప్రసాద సిద్ధిరస్తు
శ్రీ రామార్పణమస్తు
శ్రీరామ ప్రసాద సిద్ధిరస్తు
శ్రీ జగన్మాతార్పితమస్తు

శ్రీ శ్రీ శ్రీ

నమోస్తు రామాయ సలక్ష్మణాయ ! నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మభువే వరాయ ! నమోస్తు వల్మీక భవాయ తస్మై



# ఇతర రచనలు

1. **శ్రీ ఆంధ్ర వాల్మీకి వచన రామాయణము**

   బాల కాండ, సుందర కాండ,

   అయోధ్య కాండ, అరణ్య కాండ,

   కిష్కింధా కాండ, యుద్ధ కాండ,

   ఉత్తరకాండతో సహా

2. **సన్మార్గ దర్శనము**

3. **శ్రీ రామానుజ చరిత్ర**

4. **దశరథుని కోడళ్ళు**